## సచిత్ర విచిత్రం

# గోడమీద బొమ్మ




ఈ కారు ఆ బిల్డింగ్ మీదకి ఎలా ఎక్కిందీ...? అని చూసినవారంతా ఆశ్చర్య పోతుంటారు. అసలు సంగతి వాళ్లలా ఆశ్చర్యపోయేట్లు చేయాలనే ఫ్లోరిడా రాష్ట్రంలోని మియామి నగరంలోని 'అమెరికన్ పోలీస్ హాల్ ఆఫ్ ఫేమ్ అండ్ మ్యూజియం' గోడమీద ఈ పోలీస్ కావలా కారునిలా నిలబెట్టారు. పోతే బరువు తగ్గించాలని పైకి కనపడని ఇంజన్ వగైరాల్ని తీసేశారంతే!

# చతురప్రపంచం

## మరువలేని అనుభూతి

బాబాలు, స్వాములు, అమ్మలు... ఇలాంటి వాళ్లు ఆ పేర్లతో, ఆ ముసుగుతో మనుషుల మూఢవిశ్వాసాలను క్యాష్ చేసుకుంటూ హాయిగా, ఆనందంగా కాలం గడిపేస్తున్నారు. ఆధునికత జెట్‌స్పీడ్‌లో అభివృద్ధి పథంలోకి పోతున్నా మనిషి కొన్ని విషయాల్లో భయాల్ని, నమ్మకాల్ని పోగొట్టుకోలేక సతమతమవుతున్నాడు. తనకొచ్చిన కష్టాల్ని ధైర్యంగా ఎదుర్కొనే మానసిక శక్తిని కోల్పోయి, తన తోటి మానవుడే దైవాంశసంభూతుడని తలచి అతని ఆశ్రయం కోరుతున్నాడు.

'అయితే భారతదేశంలో నిజమైన యోగి పుంగవులు జన్మించకపోలేదు. ఇప్పటికీ అలాంటి వాళ్లు అక్కడక్కడైనా లేకపోలేదు...' అంటున్నారు జయంతిపూర్‌లో ఓ గుహలో నివశిస్తున్న ఓ టిబెటన్ యోగి లామా కెలాంగ్‌ను చూసినవారు. షిల్లాంగ్ నుంచి చిరపుంజికి వెళ్లి అక్కడినుంచి జయంత్‌పూర్‌కి వెళ్లాలి. చిరపుంజినుంచి జయంత్‌పూర్ తొందరగా చేరుకోవాలంటే ఆ గతుకుల రోడ్డుమీద జీపుమీద వెళ్లడం తప్ప మరో మార్గంలేదు. ఈ జయంతిపూర్‌కి 4 మైళ్లదూరంలో ఓ కొండ గుహలో ఈ టిబెటన్ లామా నివశిస్తున్నాడు. అక్కడికి వెళ్లాక ఆ గుహవద్ద ఎవరూ కనుపించక 'ఎవరైనా వున్నారా?' అంటూ రెండు సార్లు కేకలు పెట్టారు ఆ వెళ్లినవాళ్లు.




అంతలో కాషాయ వస్త్రాలతో వున్న ఓ సాధువు బయటకు వచ్చి ఎవరు కావాలని అడిగాడు.

'టిబెటన్ యోగి లామాకెలాంగ్ కావాలి!' అని అడిగారు వచ్చినవాళ్లు. లోపలికి తీసుకు వెళ్లాడతడు. లోపల ఓ గోడమీద బుద్ధుడి బొమ్మ పెయింట్ చేయబడి వుంది. గదంతా చక్కటి ధూమపువాసన

---

కవర్ ఫొటోగ్రాఫర్ : సురేష్‌చంద్ర బబావత్

వెదజల్లబడి వుంది. అక్కడ ఒక యోగి కూర్చుని వున్నాడు.

"మీరు షిల్లాంగ్ నుంచివస్తున్నారని తెలుసు. కానీ నాలాంటి అల్పుడుని, చిన్నవాడిని చూడటానికి అంతదూరంనుంచి రావడానికి కారణమేమిటి?" అని అడిగాడా యోగి దానికి వాళ్లిద్దరిలో ఎవరూ సమాధానం చెప్పలేకపోయేసరికి ఆ లామాయే తిరిగి ఇలా అన్నాడు. "మీరు చాలా అలిసిపోయినట్లు కనిపిస్తున్నారు. ఆకలిగా కూడా వున్నట్టున్నారు కానీ ఈ అడవిలో నేను మీకేం పెట్టగలను? అయినా చూద్దాం" అంటూ తన అరచేతిని విప్పి చాచాడు. వెంటనే అతని చేతిలోకి జీడిపప్పు, కిస్మిస్, ద్రాక్ష మొదలయిన పళ్లతో నిండిన ప్లేటు వుంది. అది కిందపెట్టి మళ్లీ అతను చేయి చాచాడు. అప్పుడు రకరకాల పళ్లతో నిండిన ప్లేటు వచ్చింది. వాటిని వచ్చిన వారి ముందు పెట్టి తినమన్నాడు.

ఓమూల ఆశ్చర్యం ముప్పిరిగొనగా ఆకలి దానిని జయించడంతో తినడానికుపక్రమించారు అతిథులు. అంతలో వారిలో ఒక వ్యక్తి ఆలోచించసాగాడు. "కేవలం ఒక చేతిని చాచి ఇలాంటి మహిమ చూపించారీ యోగి. మనం ఎంతోమంది సాధు సన్యాసులను కలిశామే..." అనుకుంటున్న అతని ఆలోచన ఇంకా పూర్తికాకుండానే అతని మనసును, ఆలోచనలను చదివినట్టుగా...

"ఇది చెయ్యిచేసే గిమ్మిక్కుకాదు. ఇది ఒక చిన్న తంత్రసిద్ధి. ఇది కూడా ప్రదర్శన కోసం చేసిందికాదు. కేవలం మీ ఆకలిని తీర్చడంకోసమే" అన్నాడా యోగి.

అంతేకాకుండా "అతిథులను మర్యాదచేయడం మా ధర్మం" అని కూడా అన్నారు. ఆ తరవాత మరోగదిలోపలికి తీసుకువెళ్లాడు లామా. గదంతా చిమ్మచీకటి. వాళ్లను కూర్చోమని "ఇది నా సాధనా ప్రదేశం. ఇక్కడ వెలుగు వుండదు. ఇలాంటి గాఢాంధకారంలోనే నేను భగవంతునికి కొంచెం దగ్గరగా వెళ్లగలుగుతాను" అంటుండగా... "భగవంతుడంటే బుద్ధుడా?" అన్న సందేహం వెలిబుచ్చాడు వచ్చినవాళ్లలో ఓ వ్యక్తి.

"అవునూ, కాదూ కూడా" అంటూ సందిగ్ధాత్మికమైన సమాధానం చెప్పాడు లామా. అంతలోనే "మీరు కూడా భగవంతుణ్ణి చూడాలనుకుంటున్నారా?" అని అంటుండగానే అతడి అరచేతులనుండి తెల్లని కాంతి కిరణాలు వెలువడడం ప్రారంభించాయి. అవన్నీ ఆ చీకట్లో ఒక ఎర్రటి సున్న ఆకారంగా మారాయి.

"ఈ సున్నయే భగవంతుడు. దీన్నుంచే మనంవచ్చాం. తిరిగి అందులోనే కలిసిపోతాం" అన్నాడు లామా.

"ఇదంతా మీరు ఎక్కడ నేర్చుకున్నారు?" అని అడిగాడో వ్యక్తి.

"నా జన్మస్థానం టిబెట్. అక్కడే నేర్చుకున్నానిదంతా. నా తండ్రి ఓ బౌద్ధ గురువు. ఆయన సిద్ధులలో, జ్యోతిష్యాస్త్రంలో నిష్ణాతులు. ఆయన నన్ను కూడా లామాను చెయ్యాలనుకుని చక్కని విద్యను అందించారు. నేను చిన్నతనంలోనే కాశీ వచ్చి హిందీ, సంస్కృతాలు నేర్చుకున్నాను. చదువయ్యాక టిబెట్‌లో నా సాధన ప్రారంభించాను. నా తండ్రిగారే నా ఆదిగురువు. ఆయన నాకెంతో జ్ఞానాన్ని ప్రసాదించారు. అటుపైన ఒక యోగి నాకు మరో గురువుగా లభించారు. వారు హిందువులే అయినా టిబెట్‌లో ఎక్కువ కాలం వున్నారు. ఆయనే నాకు ఈ సిద్ధులను నేర్పింది. కానీ ఈ సిద్ధులను సరదాకో, స్వప్రయోజనానికో ఉపయోగించరాదని హెచ్చరించారు. అలాంటి గురువు లభించడం నా అదృష్టం అనుకుంటాను. అంతే కాదు వారిని కలిసిన పద్ధతి కూడా చాలా విచిత్రంగా జరిగింది. ఓ రోజు చీకట్లో గతుకుల దారిలో ప్రయాణిస్తూ కాలు మడత

పడి పక్కనే ఉన్న ఓ పొదలో పడ్డాను. భయంతో కెవ్వుమని అరిచాను. అటుపైన చూస్తే నేను ఓ మనిషి ఒడిలో పడి వున్నాను. మరుక్షణంలో ఆజానుబాహుడైన ఓ అతిపెద్ద వ్యక్తి నా ముందు నిలబడ్డాడు. అతని అరచేతులనుంచి చక్కని వెలుగు కిరణాలు వస్తున్నాయి. ఆయన నాతో టిబెటన్ భాషలో "నువ్వు నన్ను ఈ విధంగా కలవాలని రాసివుంది" అన్నారు.

సుమారు 7 అడుగుల పొడవుతో, తెల్లని గుబురు గడ్డంతో ప్రశాంత వదనంతో ఎంతో మహిమాన్వితులుగా నాకు అనిపించారు. వెంటనే నేను ఆయన పాదాలకు నమస్కరించాను. ఆ స్పర్శతో ఓ విద్యుత్తరంగం నా దేహమంతా వ్యాపించి, కొద్ది క్షణాలు నన్ను అచేతనుణ్ణి చేసింది. కొంత సేపటికి తేరుకున్న నాకు నేనే ఓ కొత్త మనిషిలా అనిపించాను. నా కుటుంబ సభ్యుల ఆలోచన పూర్తిగా పోయి, "నేను నా గురువుతో నివశించడానికే పుట్టాను" అన్న ఆలోచనా తరంగం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది. ఆయనతోనే వుండిపోయాను.

ఓ రోజు రాత్రి ఆయన నన్ను ఓ చీకటి గుహకు తీసుకువెళ్లారు. ఈ గుహ గురించి ఆయన నాకు ముందే చెప్పారు. ఆ గుహ మార్గం గుండా చాలా దూరం నడవగా ఓ చోట ఆ దారి మూసుకుపోయింది. అక్కడ గుహ పైభాగం నుంచి బొట్లు బొట్లుగా నీళ్లు రాలుతున్నాయి. అక్కడ ఆయన కొన్ని మంత్రాలు చదివారు. నేను అసంకల్పితంగానే కళ్లు మూసుకున్నాను. నాపై ఏదో అమృతవర్షం కురుస్తున్న భావన. అదొకరకమైన అలౌకిక ఆనందస్థితిలో మునిగిపోయాను. అందులోంచి బయటకు రాలేకపోతున్నాను. అంతలో మా గురువుగారి గంభీరస్వరం విన్పించింది.

"నీ సాధన పూర్తయింది. నాకు తెలిసిన విద్యలన్నిటినీ నీకు ఇచ్చాను. ఇప్పుడు నువ్వు ప్రపంచంలోకి వెళ్లి నీ శక్తియుక్తులతో మానవాళికి నువ్వు చెయ్యగలిగిన మంచిని చెయ్యి" అన్నారు. అప్పుడు నేను తిరిగి మా గ్రామానికి వెళ్లి కుటుంబ సభ్యులకు విషయమంతా వివరించి శాశ్వతంగా వారినుంచి బయటకు వచ్చాను. గ్రామస్థులు కూడా నన్నాస్థితిలో చూసి సంతోషించారు. నా స్పర్శతో నాకు తెలియకుండానే రోగపీడితులకు రోగనివారణ జరిగేది. ఈ వార్త చుట్టుపక్కల గ్రామాలకు పాకడంతో జనం తండోపతండాలుగా రావడం ప్రారంభించారు. అందులో ఎక్కువమంది లౌకికమైన కోరికల సాఫల్యం కోసం వచ్చేవారు. దాంతో ఆగ్రామాన్ని నేను తప్పనిసరిగా వదిలి రావలసి వచ్చింది" అని ముగించాడా యోగి. అప్పుడు "మీరు రోగాల్ని మంత్రతంత్రాలద్వారా నయం చేస్తారా? లేక ఆయుర్వేద ఔషధంతోనా? " అని అడిగాడు వచ్చిన వ్యక్తి.

"రెండింటితోనూ చేయవచ్చు. కానీ ఇక్కడ కూడా ప్రజలు గుంపులుగుంపులుగా రావడం ప్రారంభించారు. అందుకే ఈ ప్రదేశాన్ని కూడా విడిచిపెట్టేద్దామనుకుంటున్నాను" అన్నాడు లామా.

"అలా మాత్రం చేయకండి"అని అభ్యర్థించాడు వచ్చిన వ్యక్తి.

"లేదు... నేను తప్పనిసరిగా వెళ్లాలి. ఎందుకంటే ఓసారి ఓ వ్యాపారస్థుడు కలకత్తానుంచి తన భార్యను తీసుకు వచ్చాడు. ఆమెకి సుగర్ వ్యాధి, రక్తపోటు చాలా ఎక్కువగా వున్నాయి. ఆమెకి పూర్తిగా నయమైందిక్కడ. దాంతో ఆ వ్యాపారస్థుడు నాకిక్కడ ఒక ఆశ్రమం కడతానన్నాడు. నేను వద్దన్నాను" అని చెప్పాడు లామా.

అటుపైన వ్యాధి నివారణ గురించి వారికున్న కొన్ని అనుమానాలను బయటపెట్టారు వచ్చిన వ్యక్తులు.

"అది ఎలా జరుగుతుందో నాకే తెలియదు. బహుశా ఏదో అదృశ్యశక్తి నాచేత ఈ పని చేయిస్తూ వుండవచ్చు. చేతికొచ్చిన వేరును ఉపయోగించి రోగానికి చికిత్స

చేస్తాను. అది నయమయిపోతోంది. బహుశా వారికి నాపైవున్న నమ్మకమే ఆ రోగాల్ని నయం చేస్తున్నట్లుంది" అంటూ చెప్పాడు లామా.

వచ్చిన వ్యక్తులిద్దరూ శలవు తీసుకుంటూ మని వారికి పాద నమస్కారం చేశారు. ఆ క్షణంలో అతడి పాదాలనుంచి విద్యుత్తరంగమేదో తమ శరీరంలోకి ప్రవేశించిన అనుభూతి కలిగిందంటున్నారు ఆ వ్యక్తులు. ఇప్పటికీ వారికి ఆ అనుభూతి అలాగే వుంది. "దానిని మాత్రం మేం మర్చిపోలేము" అంటారు వారు.

---

## పాములను ప్రేమించండి

**పా**ము అంటే అందరికీ భయమే నీళ్ళలో తిరిగే నీటిపాములను చూస్తేనే జలదరింపుగా వుంటుంది. ఇంక తాచుపాము, కట్లపాము మొదలయినవి కంటబడితే... అంతే సంగతులు... ప్రాణాలరచేత పట్టుకుని పరుగెత్తడమే.

కానీ వేలాయుధన్ అనే వ్యక్తి ప్రపంచం మొత్తంమీద ఉన్న భయంకర విషనాగుల రకాల్ని పోగేసి వాటిమధ్య 75 రోజులు గడిపి గిన్నిస్ బుక్‌లో కెక్కాడు 1980లో ఆ పాముల సంఖ్య మొత్తం 400 వీటన్నిటినీ అతనితోపాటు కలిపి ఓ పెద్ద గాజు పెట్టెలో బంధించారు. ఈ పెట్టె 16 చదరపు అడుగుల వైశాల్యంగలది. ఇంతకీ ఈయన ఇలా ఎందుకు చేశాడంటే మనుషులకి పాములపట్ల వుండే భయాన్ని పోగొట్టడానికట. వేలాయుధన్ తనని తాను ప్రొఫెసర్ ఆఫ్ స్నేక్స్ అని చెప్పుకుంటాడు. అతని వయసు 50 సంవత్సరాలు. తర్వాత బొంబాయిలో కూడా అతనొక పాముల ప్రదర్శనని ఏర్పాటుచేశాడు. అందులో 110 తెల్లతాచులు, 90 నల్లతాచులు మరో 50 అతిభయంకర విషసర్పాలు, ఇవికాక మరెన్నో కొండచిలువలు, జెర్రిగొడ్లు... వీటన్నిటి మధ్యా ఆడుతూ పాడుతూ కేరింతలు కొడుతూ ప్రదర్శకులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తాడు. గత 20 సంవత్సరాలుగా వేలాయుధన్ ప్రపంచంలోని వివిధ ప్రాంతాలనుంచీ బయంకరమైన ప్రమాదకరమైన పాములనెన్నిటినో సేకరించి పెంచుతున్నాడు. 'పాములు ఎంతో ఆకలేస్తే తప్ప దేనినీ తినవు. కోడిపిల్లలు కోడిగుడ్లు వాటి



ఆహారం. వారానికొకసారి వాటికి ఆహారం వేయడం అలవాటుచేస్తే, మధ్యలో ఆకల యినా అవి గాలి భోంచేస్తాయని చెబుతు న్నాడతడు. కొన్ని జాతుల సర్పాలు ఒకే సారి ఎక్కువ ఆహారాన్ని తీసుకుని రెండేళ్ళ దాకా మరి ఆహారం ముట్టవట.

అడవులను నరకడం ప్రారంభించాక పాములు తమ నెలవులను కోల్పోయి జనా వాసాల్లోకి రావడం, వాటిని చూసిన ప్రజలు భయంతో చంపడం జరుగుతోం దని అంటున్నాడు వేలాయుధన్

"అసలు పాములతో ఇలా స్నేహం చేయ డానికి బలీయమైన కారణమేమైనా వుందా? " అని ఎవరో ప్రశ్నిస్తే, తన స్నేహి తుడిని ఓసారి ఓ నల్లత్రాచు కాటేసిందనీ అప్పటినుంచీ వాటి గురించి తెలుసుకోవా లనే పట్టుదల కలిగిందనీ చెప్పాడతడు.

పాములు, వాటి కాటుకి తగిన చికిత్స మొదలైన విషయాలన్నీ ఆంధ్రప్రదేశ్‌లోని రాజమండ్రీ వచ్చి 'గులాబ్ షహీమ్' అనే అతనివద్ద నేర్చుకున్నానంటున్నాడు వేలా యుధన్. అతనిది కేరళ రాష్ట్రం. ఎలక్ట్రిసిటీ బోర్డ్‌లో ఆఫీసరుగా పనిచేస్తున్నాడతడు. పాములకు సంబంధించిన చర్చల్లో పాల్గొన డానికి, ప్రదర్శన లివ్వడానికి అతనికి ఆఫీసు వారు ప్రత్యేకమైన సెలవు మంజూరు చేస్తారు.

పాములన్నీ హానికరమైనవికావనీ, ఏవో కొన్ని సర్పాలు మాత్రం ప్రాణాంతకమైన వనీ, చాలా పాములు కేవలం ఆకలివల్లనో, రెచ్చగొట్టడంవల్లనో మాత్రమే కాటేస్తాయనీ అతనంటాడు.

'మరి పాము కాటువల్ల ఎన్నో మరణాలు సంభవిస్తున్నాయి కదా? ' అన్న ప్రశ్నకి అతడు చెప్పిన జవాబు ఏమంటే "నన్ను 9 సార్లు పాములు కాటేశాయి. కానీ... నాకేమీ కాలేదు. దీనికంతకీ కారణం పాము కరిస్తే వెంటనే చేయవలసిన ప్రథమ చికిత్స ఏమిటి? అసలు ఏ పాము ప్రమాదకరమ యినది? దాన్ని గుర్తించడం ఎలా? మొద లైన పాములకు సంబంధించిన ప్రాథమిక జ్ఞానం వుంటే ప్రతి మనిషీ పాము కాటు నుంచి బయటపడవచ్చును. చాలామంది పాము కాటుద్వారా ఎక్కే విషంవల్లకన్నా, అది కరిచిందన్న భయంతోనే చనిపోతు న్నారు" అంటాడు వేలాయుధన్.

అతని పాముల ప్రదర్శనలో మరో ఆకర్ష ణీయమైన దృశ్యం పాము విషాన్ని పిండి స్వయంగా తాగడం. విషపానం చేశాక కలిగే మత్తు మద్యం ఇచ్చే మత్తులాగే వుంటుందంటాడతడు. ఇండియాలోని రకర కాల పాముల విషాలకి విరుగుడుగా ఓ రక మైన నిరోధకశక్తి తనలో వుంది అంటాడ తను. తనలా పాము విషాన్ని మింగడానికి ప్రయత్నించడం అందరికీ మంచిది కాదని కేవలం 15 మిల్లీగ్రాముల విషం మనిషి ప్రాణాన్ని హరించేస్తుందనీ అంటున్నాడు.

ఇండియాలో పాముల గురించి కొన్ని మూఢనమ్మకాలున్నాయి. పాము తనని చంపిన వ్యక్తియొక్క ఆకారాన్ని కళ్లలో వుంచుకుంటుంది. మరో పాము ఆ చనిపో తున్న పాము వద్దకువచ్చి ఆ కళ్లలోని ఆకా రాన్ని తాను గుర్తుపెట్టుకుని అతనిపై పగ తీర్చుకుంటుందంటారు. కానీ ఇవన్నీ నిజాలు కావనీ పాము మరణించేటప్పుడు దాని శరీరంనుంచి వచ్చే గాఢమైన వాసన కారణంగా ఇతర పాములు దానివద్దకు పరుగెత్తుకుని వస్తాయి. అంతేగానీ పాము పగపట్టడం, సాధించడం... అదంతా మూఢనమ్మకం అంటాడు.

వేలాయుధన్‌కి ముగ్గురు కూతుళ్ళు న్నారు. వాళ్లే తన ప్రథమ శిష్యులు అంటా డతను. వాళ్ళకు కూడా పాముల్ని గురిం చిన జ్ఞానాన్నంతా బోధించి, పాములను వాళ్ళు ప్రేమించగలిగేలా తీర్చిదిద్దాడు. తన భార్యకి ఈ వ్యవహారం అంతగా నచ్చకపో యినా సర్దుకుపోతుంటుంది అంటాడతను.

# ఏరిన ముత్యాలు

★ స్త్రీ ప్రేమ అనంతం- సముద్రంవలే దానితీరాలు కంటికి కానరావు.

-మిల్టన్

★ క్రమశిక్షణ, గురుభక్తి, అంతరంగంనుంచి రావాలి. బాహ్యంగా భయపెట్టి వాటిని రప్పించ ప్రయత్నించరాదు.

-రాజారామమోహన్‌రాయ్

★ అనరాని మాటలను అందంగా అనడం, చేయరాని పనులను అందంగా చేయడమే దౌత్యం.

-ఇజక్ గోల్డ్‌బెర్గ

★ మౌనం అనేది సంభాషణకు సురక్షితమైన ప్రాంతం.

-ఆర్నాల్డ్ గ్లాస్కో

★ పోషణ లేకుండా పెరిగేది ఒక్కటే- అది అహంభావం.

-మార్షల్ లయ్స్‌డెన్

★ తరువాత వచ్చే కోర్కెలను సంతృప్తిపరచడంకంటే తొలి కోర్కెలను అణచివేయడం చాలా సులభం.

-ఫ్రాంక్లిన్

★ జీవితగ్రంథం మొదటిపుటలో కనిపించేది ఒకతోడు, యువతి, యువకుడు, చివరి పేజీల్లో వారి జ్ఞాపకాలు.

-అస్కార్‌వైల్డ్

★ హిమాలయాలు ఎంత శాశ్వతమో, సత్యం అంతే శాశ్వతం.

-వివేకానంద

★ మానవుడికి మర్యాదకు మించి విలువైనది ఏదీ లేదు.

-టెరెన్

★ పాట పాడుతూ కులాసాగా పనిచేసే తేనెటీగవలే బ్రతకటం నేర్చుకో.

-గోల్డ్‌స్మిత్

★ వయస్సు మీదపడుతున్నకొద్దీ జీవితసౌఖ్యం తగ్గిపోతుంది.

-గోల్డ్‌స్మిత్

★ రహస్యం దాస్తేనే అది నీకు బానిస. బయట పడిందా అదే నీ యజమాని.

-ఎమర్సన్

★ జీవితంలో వేటికీ భయపడవలసిన పనిలేదు. కేవలం వాటిని అవగాహన చేసుకోవాలి.

-మేరీ క్యూరీ

★ ఆలోచించేవారు, ఇతరులను ఆలోచింపచేయగలిగేవారే సృజనాత్మక రచయితలు.

-రెక్స్

సేకరణ : చింతా కృష్ణమోహన్


చతుర
జూలై 1998
సంచిక : 6
సంపుటి : 21
పదహారు వసంతాలు మాత్రమే నిండిన ఆ అద్భుత సౌందర్యరాశి జీవితంలో
వివాహం ఓ దుస్వప్నంగా మిగిలిపోయింది.
భర్తనుంచి ఆమెకు కోట్లాది రూపాయల ఆస్తి సంక్రమించినా ఆప్యాయత
స్పర్శామాత్రంగా కూడా లభించని దుస్థితి ఆమెది.
అసూర్యంపశ్యగా మిగిలిన ఆమెలోని నిద్రాణమైన శృంగార రసానుభూతులు
మరలా ఎలా జాగృతమయ్యాయి.
సదాచారులైన సద్వంశీకుల కుటుంబంలో పుట్టిన ఆమె... ఇటు
కుటుంబమర్యాదలకి, అటు వయసు పులకింతలకీ మధ్య నలిగి... చివరకు
ఏమయింది?
మనిషి జీవితంలో అరుదుగా ఎదురయ్యే అనూహ్యమైన మలుపులకు
అక్షరరూపం ఘండికోట బ్రహ్మాజీరావు రచన 'వాన-వరద'
ఈ నెల 'చతుర' సమగ్ర నవల.
వాన-వరద
— ఘండికోట బ్రహ్మాజీరావు

## నారాయణి కథనం

ఏరు పరవళ్లు తొక్కుతోంది.

నాగావళి నానావిధభంగిమలలో నాట్యం చేస్తోంది.

వరదల్లో ఉన్న ఏటిని చూడడానికి ఉదయం వెళ్లినప్పుడు వర్షం కురుస్తూనే ఉంది. నేనూ మా అమ్మా గట్టుమీద నిలబడి చూస్తున్నాం. క్షణక్షణానికి ఏటిమట్టం పెరుగుతూనే ఉంది. ప్రవాహవేగం గట్లను కోసేస్తూనే వుంది. వరదనీటిలో చెట్లు, చేమలు, గుడిసెల పైకప్పులు, ఇంకా ఏవేవో కొట్టుకుపోతున్నాయి. ఉన్నట్లుండి మేము నిలుచున్నచోటనే గట్టు కూలిపోయింది. వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పింది మాకు.

"నారాయణీ!" మా అమ్మ గట్టిగా అరిచి నన్ను కావలించుకుంది.

నాకేం భయం వెయ్యలేదు. నా నుదుట అంత చక్కటి చావు వ్రాసిపెట్టిలేదు.

"ఇక పద! చాలు నీ చూడడం. కనురెప్పపాటులో ఏ వేంకటేశ్వరస్వామో అడ్డుపడ్డాడు. ఎంత ఘోరం! ఎంత ఘోరం!!"

నేను ధైర్యంగా నిలుచున్నాను. ఎంతైనా తల్లి కడుపుకదా! తన కూతురు ఎటువంటిదైనా, తన ఎదుటే చనిపోవడం ఏ తల్లీ కోరదు.

మబ్బులు యింకా దట్టమవుతున్నాయి. రెండు రోజులై అడపా దడపా వర్షం కురుస్తూనే ఉంది. కొండలలో బాగా వర్షం కురిసిందేమో, నాగావళికి వరదలొచ్చాయి.

ఏటిగట్టు కూలిపోవడం ఊళ్లో అందరికీ తెలిసిపోయింది. వార్త తెలిసిన వెంటనే తండోపతండాలుగా జనం మా యింటిమీద పడ్డారు. ప్రమాదం జరగలేదు. జరిగిందేపో! ఎంత ఘోరమయి ఉండేది!

*12 జూలై 1998*

మా అమ్మ మళ్లా గుండెలు బాదుకుంది. ఎంత ఆపుకున్నా ఆమెకు దుఃఖమాగలేదు.

మధ్యాహ్నం భోజనాలయేసరికి ఒంటిగంట దాటిపోయింది. రెండు గంటలనుండి గాలి వీచడం మొదలయింది. ఇంతవరకు నిలువుగా పడుతున్న జల్లులు ఇప్పుడు ఏటవాలుగా పడుతున్నాయి.

మధ్యాహ్నం మూడుగంటలవేళకే చీకట్లు కమ్ముకున్నాయి. ఇప్పుడు వర్షం జల్లులుగా పడడంలేదు, కుండలతో వంపినట్లే కురుస్తున్నది.

ఊర్లోకి వస్తూంటే మొదటి వీధిలో చివరన మా యిల్లు ఉంది. ఎత్తుగా కట్టిన పెద్ద పెంకుటిల్లది. ముందు కచేరీ సావిడి, ధాన్యం కొట్లు ఉన్నాయి. తరువాత మండువా, దానినానుకొని కుడివేపు పెద్ద పడకగది, ఎడంవేపు నొకటి, పిమ్మట పెద్ద నట్టిల్లు, వంటగది, సామానుగది ఉన్నాయి.

నేనూ, మా అమ్మా కుడిచేతి వేపున్న గదిలో పడుకుంటే, మా అన్నయ్యా, వదిన ఎడమచేతి వేపున్న గదిలో పడుకుంటారు.

నా గదికి దక్షిణం వేపు పెద్ద కిటికీ ఉంది. పడమరవేపు కూడా అటువంటిదే ఉంది. మా అమ్మ పడమటి కిటికీ దగ్గిర మంచం వేసుకుని పడుక్కుంటుంది. నా మంచం దక్షిణపు కిటికీ దగ్గిర ఉంది. దాని తలుపులు తీస్తే, ఆవరణలో మల్లెచెట్లు కనిపిస్తాయి. ఎండాకాలంలో ఆచెట్లు విరియబూసి, గాలి పిల్లలు నా గదిలోకి పరిమళాలు మోసుకొని వస్తాయి.

నాకు మధ్యాహ్నం తిండి సరిగా సహించలేదు. ఏదో గుండెల్లో ఆందోళన. ఈ యేరు నమ్మదగినది కాదు. ఉన్నట్లుండి ఊళ్లను ముంచుతుంది. మా వూరిగట్లు ఎత్తుగానే ఉన్నాయి. అయినా, ఒకవేళ ఈ యేరు గట్టుదాటిందే అనుకో, మరి జలప్రళయమే.

అప్రయత్నంగా నా దృష్టి కిటికీలోంచి

ఆవరణలో ఉన్న కొబ్బరిచెట్ల మీద పడింది. అదేమిటి? ఆ చెట్లు వంగి భూమికి నమస్కరిస్తున్నాయే! చెట్ల కొమ్మలలోంచి గాలి పోతూ రొద చేస్తున్నది. ఈ గాలి, ఈ వర్షం ఈశాన్యంనుంచి వస్తున్నాయేమో, నాకిటికీ తలుపులు తీసినా జల్లులు లోపలికి రావడంలేదు.

కచేరీ సావిడిలో కూర్చొని మా వదిన, అమ్మ మాట్లాడుకుంటూ వత్తులు చేసుకుంటున్నారు. ప్రపంచమంతా ప్రళయంలో మునిగిపోతుంటే, ఆదిశేషువు మీద లక్ష్మీనారాయణులు పచ్చీసుపాళీ ఆడుకుంటున్నారట! ఏదెలా ఉన్నా, కార్తీకమాసం కోసం మూడు నెలల ముందుగా వత్తులు చేయడానికి ఆయత్తమయ్యారు వీళ్లు.

ఆ గాలి బుస కొడుతోంది. ఆ వర్షం కసిగా కురుస్తోంది.

ఉన్నట్టుండి పెరటిలో పెద్ద చప్పుడయింది. ఆవు, పెయ్య అంభారావాలు చేస్తున్నాయి.

మా అమ్మ అరవై యేళ్లది. మా వదినకు ముప్పై అయిదేళ్లయినా సుకుమారమైంది. అన్ని శ్రమలకు నిలబడవలసిన దానిని నేనే మిగిలాను. పెరట్లోకి పరుగెత్తాను. నట్టింట తలుపులు తీద్దునా, ఆవుసాల నేలకు పడిపోయి కనిపించింది. దానిమీద వేసిన చొప్ప ఎగిరిపోయింది. రాటలు విరిగిపోయాయి. అదృష్టమేమంటే, ఆవూ, పెయ్యా వర్షంలో తడుస్తూ బయట నిలబడ్డాయి బెదిరిపోతూ.

ఇంతలో మా అన్నయ్య కూడా లేచి వచ్చాడు.

సాలకు, యింటికి కొంత దూరముంది. వాననీటితో నిండి పెరడు చెరువులా ఉంది. గాలి మా యిద్దరినీ తోసివేస్తున్నది. వర్షం నిర్దాక్షిణ్యంగా మోదుతోంది. చాలా ప్రయత్నంమీద ఆవుని, పెయ్యని రాటలనుండి విప్పి, ఇంట్లోకి తెచ్చేసరికి మేమిద్దరం పూర్తిగా తడిసిపోయాం. మా అమ్మ, వదిన వత్తులక్కడ పారేసి పెరటివేపు వచ్చారు.

కచేరీ సావడిలో కిటికీ ఊచలకు ఆవును కట్టాను. మా అన్నయ్య స్తంభానికి పెయ్యను కట్టాడు. మా అమ్మ పెరటి తలుపులు మూసి వచ్చింది. నేను తొందరగా చీర మార్చుకొని, పొడిబట్ట తెచ్చి ఆవును, పెయ్యను తుడిచాను.

"ఇంట్లో ఇంత దిట్టంగా వేసిన సాలే విరిగిపోయింది. కళ్లంలోని సాల నిలుస్తుందా? రెండు జతల ఎడ్లు తడిసిపోతాయి" అన్నాను మా అన్నయ్యతో.

"కళ్లంలోని పాక తొందరగా పడిపోదు. మన పెరటి సాల పైకప్పు ఎత్తుగా ఉంది. కళ్లంలోది కిందికి వాలి ఉంది. పైగా, నారాయడు ఈ మధ్యే కొన్ని రాటలు పాతి, పైకప్పుకి ఆసరా కల్పించాడు" అన్నాడు మా అన్నయ్య.

నారాయడు అరవై అయిదేళ్లవాడు. నమ్మకంగా పనిచేసే కంచారి. మా పెరట్లోని సాల గురించి, కళ్లంలోని పాకగురించి నేను ఆరాటపడుతున్నాను. నారాయడి గుడిసె గురించి ఆలోచించనే లేదు. అందులో అయిదుగురు తల దాచుకుంటున్నారు. మామూలు రోజుల్లో, కుటుంబంలోని వాళ్లందరూ బయట నులకమంచాలమీద పడుక్కుంటారు. చలికాలంలోను, వర్షాకాలంలోను విధిలేక యింట్లో తల దాచుకుంటారు. వాడి యింట్లో తల చెడిన కూతురు, దాని కొడుకు పదేళ్లవాడు, నారాయడి పెళ్లాం, నారాయడి అక్క ఉంటున్నారు. ఈ మధ్య నారాయడి మనవడికి ఒంట్లో బాగోలేదు. విడవకుండా జ్వరం. వాళ్లందరూ ఈ వర్షంలో ఎలా ఉంటున్నారు?

నాకేం హాయిగానే ఉంది. దిట్టమైన పెంకుటిల్లు. పచ్చడం కప్పుకొని వెచ్చగా మంచంమీద కూర్చున్నాను. మధ్యాహ్నం భోజనం చేశాను. రాత్రి భోజనం గురించి

చింతలేదు.

వాళ్లేమిటి వండుకుంటారు? ఎక్కడ తింటారు?

పరిస్థితులు విషమించినప్పుడు దిగువ వీధుల్లోవాళ్ల ఎలిమెంటరీ స్కూలులో తల దాచుకుంటారు. హెడ్ మాస్టరుగారు చాలా మంచాయన. ఆయనవాళ్లకు భోజనాలు కూడా పెట్టిస్తారు.

అంతలో నాకు జ్ఞాపకం వచ్చింది.

మా అమ్మ గదిలోకి వచ్చి మంచంమీద కూర్చొని పచ్చడం కప్పుకుంటున్నది.

"అమ్మా! హెడ్మాస్టరుగారికి బియ్యం, పప్పు, చింతపండు, అన్నీ పంపించావా? "

"మనం ఏరు చూడ్డానికి వెళ్లినప్పుడు మన వదిన అన్నీ యిచ్చిందట"

మా వదిన కొంచెం జాగ్రత్త అయిన మనిషి. ఆమె ఒక పూటకు సరిపడ్డవే యిస్తుంది. మరి రాత్రికెలా? ఈ గాలివానలో ఎన్ని కుటుంబాలవాళ్లు స్కూలు చేరుకున్నారో? వెళ్లి చూడాలనుకున్నాను. పని తొందరలో మరచిపోయాను.



ఇంతలో కచేరీ సావడిలోని గడియారం అయిదుగంటలు కొట్టింది. గదినిండా చీకటి. సావడిలో కట్టిన పెయ్య అరుస్తూ ఉంది. ఇవాళ పాలుపితికే అసిరయ్య రాడు. వాడి గుడిసె ఈ గాలికి నిలవదు.

మా అన్నయ్య పెయ్యను తెచ్చి యింట్లో కట్టినప్పుడు బాగా తడిసిపోయాడు. తుమ్ములు పట్టుకున్నాయి. మా వదిన వాడికి తల తుడిచి, బట్టలుమార్చి, మంచం మీద పడుక్కోబెట్టి, గుండెలకు అమృతాంజనం రాసి, కంబళి కప్పి, కాళ్లు పడుతున్నది.

ఏమీ లేనిదానిని నేనే.

లేచి పొయ్యి ముట్టించాను. వేన్నీళ్లు కాచి ఆవుకి కుడితి పెట్టాను. పాలు పితికాను. దీపాలు వెలిగించి, రాత్రివంటకు నడుంకట్టాను.

మామూలు రోజుల్లో అన్నీ ఒక క్రమంలో జరిగిపోతాయి. పరిస్థితులు కొంచెం విషమిస్తే ఇంట్లో ఎవరికివాళ్లు తోటకూర కాడల్లా వేలాడిపోతారు. ఏం చెప్పేది?

ఊళ్లో పదిహేనిళ్లవాళ్లు బ్రాహ్మలున్నారు. వారిలో నాలుగు కుటుంబాలవాళ్లు మా బంధువులే. పట్టణాలలో చుట్టాలు, స్నేహితులు అంతగా పట్టించుకోరు. కాని ఈ పల్లెటూరిలో మాత్రం ఏ ఒక్క చిన్న సంఘటన జరిగినా, వెంటనే అందరికీ తెలిసిపోతుంది. ఈ వర్షం, ఈ గాలి ఇలా బాదుతూఉన్నా, ఎవరెవరో వస్తున్నారు, వెళ్తున్నారు.

తీరా వంటంతా అయిన తర్వాత మా అన్నయ్య భోజనం చెయ్యనన్నాడు. మా అమ్మకు ఫలహారం తయారుచేశాను. మేం ముగ్గురం తిళ్లుతిన్నాం. కాచినపాలు ఒక గ్లాసునిండా పోసుకుని మా వదిన పడకగదిలోకి వెళ్లింది. మా అమ్మ గదిలో మంచమెక్కి, పచ్చడం కప్పుకొని గువ్వపిట్టలా కూర్చుంది. ఇల్లు చక్కబెట్టుకుని ఆవుకి ఎండుగడ్డి వేసి, కచేరీ సావిడిలో దీపం ఘనంచేసి గదిలోకి నడిచాను.

ఒక్కసారి గాలివాటం మారిపోయింది. తెరచిన కిటికీలోంచి వర్షమూ, గాలీ లోపలికి దూసుకువచ్చాయి. కిటికీ తలుపులు మూశాను. ఇంతవరకూ మెరుపులు లేవు. ఇప్పుడు అవికూడా మొదలయ్యాయి. వాటితోపాటు ఉరుములు. ఈ మేఘాలు తమలో తామే పోట్లాడుకుంటున్నాయి. ఆ గాలికి గదిలోని కోడిగుడ్డు దీపం కూడా ఆరిపోయింది.

బయట పెద్ద హోరు.

గాలి, వర్షం.

ఆకులు, కొమ్మలు, చెట్లు ఊగిపోతూ ఎగిరి విరుగుతున్నాయి.

ఇళ్లు, వాకిళ్లు తుడుచుకుపోతున్నాయి.

నా మనసులో ఏదో భరించరాని ఆందోళన.

మా అమ్మ పడుకోలేదు. పచ్చడం కప్పుకొని కూర్చునేఉంది.

"అమ్మా!"

"ఏం నారాయణీ? "

"ఇది గాలివానేనా? "

"ఇంకా సందేహమా? "

నా జీవితంలో ఇది మూడో గాలివాన. గాలివానతోనే నేను ఈ భూమిమీద పడ్డాను.

"అమ్మా! మరొక్కసారి చెప్పు"

"ఏమిటి చెప్పాలి? "

"నేనెలాంటప్పుడు పుట్టాను? "

మా అమ్మ ఈ సంగతి ఏ వందసార్లో చెప్పింది. అయినా, నాకు మరోసారి వినాలనే ఉంది.

మా అమ్మ చెప్పింది.

అది నా మూడోపురుడు. అత్తవారింట

దక్షతలేదని, ఇష్టంలేకపోయినా, మా అమ్మ పురుడు పోయడానికి ఒప్పుకుంది. నేటివు మంత్రసాని రెండేసి రోజులకొకసారి వచ్చి చూసి వెళ్తూండేది. అప్పటికి నాకు తొమ్మి దోనెల వచ్చి ఒకవారం రోజులే అయింది. ఇంట్లో పనిపాట్లు మామూలుగా చేసుకొనే దానిని.

తాతగారి యిల్లు నీకు బాగా జ్ఞాపకమే కదా! ముందుభాగంలో చినతాతగారి కుటుంబం ఉండేది. వెనుకభాగంలో కింద మూడుగదులు. మేడమీద మూడు గదులు. వంటిళ్ళు రెండుఉన్నా, నట్టిల్లుమాత్రం సమి ష్టిగా ఉండేది.

వారానికో, పదిరోజులకో మీనాన్నగారు వచ్చి వెళ్తుండేవారు. మేడమీద వెనుకగ దిలో మీ అన్నయ్యను, అక్కయ్యను పెట్టు కొని నేను పడుకునేదానిని.

అప్పుడుకూడా, ఓ రోజు ఇలాగే చిన్న జల్లు, ముసురు. మేడమీద నేనున్న గది లోంచి చూస్తే పెరట్లోని కొబ్బరిచెట్లు, బాదంచెట్టు, అరటిచెట్లు కనిపించేవి.

ముసురు పట్టిన దగ్గిరనుంచి నేను అట్టే కిందకు దిగలేదు. మేడమీదనే గడిపాను. మా అమ్మ పెరట్లో కాసిన దొండకాయలో, బీరకాయలో కోసి రోజుకొక రకం వండిపె ట్టేది. పుస్తకాలు చదువుకుంటూ, చలేస్తే దుప్పటి కప్పుకుని హాయిగా మంచంమీద పడుక్కునేదానిని.

వర్షం పడుతుంటే కిటికీలోంచి చూస్తే పెరట్లో చంద్రకాంతం పూలు, నూరువర హాల పూలు, బీరపూలు, మందారాలు చిను కులో తలలు ఇటూ అటూ వాలుస్తూ, నిలి చిన నీటి ముత్యాలతో చాలా అందంగా కని పించేవి. నిలబడి ఒంటికాలిమీద తపస్సు చేసుకుంటున్న మునిపుంగవులకు మల్లే కొబ్బరి చెట్లు కనిపించేవి.

ఈ వర్షమంటే నాకు ఎంతో సరదా. చిన్నప్పుడు వర్షంలో వానా వానా వల్లప్పలు తిరిగేదానిని. ఆరోజులన్నీ జ్ఞాపకం తెచ్చు కుంటూ ఆనందించేదానిని. విడువకుండా కొండలమీద వర్షం కురిసిందేమో, ఏరు గట్లుతీసిపారడం మొదలుపెట్టింది. క్రమక్ర మంగా వరదనీరు మెట్లన్నీ ఎక్కి, గుడివీధి వేపు, వారధివేపు పారింది.

రెండురోజులు హాయిగా గడిచాయి. మూడోరోజు ఉదయానికి పరిస్థితి మారిపో యింది. గాలి మొదలయింది. వర్షం కుండ పోతగా కురిసింది. ఆకాశం దట్టమైన మేఘాలలో దాగి పగటిపూట కూడా వెలు తురు తగ్గిపోయింది.

సూర్యుడు కనిపించకపోవడం చేత మా బామ్మ భోజనం మానేసింది. కిటికీ తలు పులు తీసి చూస్తే, పెరడల్లా, ఆబోతు కుమ్మిన పంటపొలంలా కనిపించింది. ఆ చక్కని పూలన్నీ ఏ కొమ్మలకిందనో దాగు న్నాయి. కొమ్మలు గాలికి విరిగిపోయాయి. బీరపాదు పందిరినుంచి పక్కకు పడిపో యింది. నిన్నటివరకు నిలకడగా ఉన్న కొబ్బరిచెట్లు, పూనకం పూనిన గణాచారికి మల్లే తలలూపుతున్నాయి.

ఎంత తొందరగా ఈ ప్రకృతి మారిపో యింది! జల్లులు లోపలికి వస్తూంటే కిటికీ తలుపులు మూసివేశాను. గదిలో వెల్తురు బాగా తగ్గిపోయి చదువుకోవడానికి కూడా వీలు చిక్కింది కాదు. భోజనానికి మధ్యాహ్నం కిందికి దిగి వేడి పులుసు అన్నం తిన్నాను. కాయగూరలు పెరట్లో దొరకలేదు. తోటకూర పులుసే బ్రహ్మాం డంగా ఉంది. పిల్లలను తీసుకొని, భోజనా లయిన వెంటనే, మేడమీదికి వెళ్లిపోయాను.

మంచంమీద పడుక్కున్నానే కాని మనసు నిలకడగా ఉంచలేకపోయాను. ఆందోళన, చెప్పలేని భయం పట్టుకున్నాయి. కిటికీ తలుపులు తీయడానికి ప్రయత్నించాను. కాని లాభం లేకపోయింది. కొబ్బరాకు

ల్లోంచి దూసుకుపోతున్న గాలి, అడవిలో ఒంటరిగా ఉన్న ఆడదాని ఏడుపులా వినిపిస్తున్నది. ఆ గాలి వర్షంతో పంతాలు పోయింది. లోకమంతా ప్రళయంలో మునిగిపోతున్నదా అనిపించింది.

ఎప్పుడు సాయంకాలమయిందో తెలియలేదు. మానాన్న నాకోసం కింది గదిలో వెదకి మేడమీదికి వచ్చాడు. చీవాట్లు పెట్టి నన్ను, పిల్లలను కిందికి తీసుకుపోయాడు. మధ్యగదిలో మంచంమీద పడుక్కున్నాను. అప్పుడే నొప్పులు ప్రారంభమయ్యాయి.

మా అమ్మ చెప్పడం ఆపింది. పచ్చడం సరిగా కప్పుకొని నిటారుగా కూర్చుంది.

కొంచెంసేపటి తరువాత ఆమె తిరిగి చెప్పటం మొదలుపెట్టింది.

"మంత్రసానిని పిల్చుకురమ్మని మా అమ్మతో చెప్పాను. మా నాన్నను పంపించాము. కానీ, అతను వీధిలోకి వెళ్లి పూర్తిగా తడసిపోయాడు. గాలి అతనిని ఒకడుగు కూడా ముందుకు వెయ్యనియ్యకపోతే, తిరిగివచ్చాడు

తొందరగా వేడి అన్నంలో పాలు పోసి మా అమ్మ నాకు పెట్టింది. ఏదో ఎంగిలిపడ్డాను. నొప్పులు దగ్గరదగ్గరగా రావడం మొదలయింది

గాలి, వర్షం, మెరుపులు, ఉరుములు అప్పుడు తొమ్మిదిన్నర అయింది. పైన పెద్ద మెరుపు మెరిసింది. కళ్లు చెదిరిపోయాయి. మా అమ్మ నాకు పక్కనే కూర్చొని సేవ చేస్తున్నది. ఒక్కసారి, పిడుగొకటి సూటిగా మేడపక్కనే ఉన్న కొబ్బరిచెట్టు మీద పడింది. చెట్టుకొంత విరిగి, కొంతకాలి, మేడ చివరి గదిమీద పడింది. గదిగోడలు, పైకప్పు కూలిపోయాయి. ఈ చప్పుళ్లన్నీ ఒకే చప్పుడయి నాకు వినిపించాయి. భయంతో పెద్దకేక పెట్టాను. అప్పుడే నువ్వు భూమిమీద పడ్డావు."

నేను ఆలోచిస్తున్నాను. ఎంత ప్రశాంతమైన సమయంలో నేను జన్మించాను!

"దీపం వెలిగిస్తావా, నారాయణీ?" మా అమ్మ పడుకుంటూ అడిగింది.

ఆ చీకటి నాకు భయం కలిగించడానికి బదులు రక్షణ కవచంవలె నన్ను చుట్టుకుంది.

"ఈ గాలిలో దీపం నిలవదు" అన్నాను.

మా అమ్మ మరేమీ అనలేదు. మరో పది నిమిషాల్లో ఆవిడ గుర్రు వినిపించింది. ఆలోచనలు లేనివాళ్లు ఎంత అదృష్టవంతులు!

బయట కొమ్మలు విరిగిన చప్పుడు, చెట్లు కూలిన చప్పుడు, తలుపు సందులలోనుంచి గాలిపోతూ చేసే వింతయిన శబ్దం అన్నీ వింటున్నాను.

రెండు నెలలకిందే పెంకు తిరగవేయించాను. అందుచేత ఒక్క చినుకు కూడా కురవడంలేదు. నాలుగు మూలలనుంచీ మండువాలో పడుతున్న చూరునీళ్లు కాలువలలోంచి పైకి పోతున్నాయి.

ఏవీ ఆలోచించకూడదు.

అన్నిటికన్న ముఖ్యమైనది మనిషి జీవించి ఉండడం.

హాయిగా బతుకుతున్నవాళ్లు లేనిపోని ఆలోచనలకు పోయి ఆరోగ్యం పాడుచేసుకోకూడదు. గతంలో ఏర్పడ్డ సమస్యలు పరిష్కారమయ్యాయి. జీవితం ఒక నలిగిన దారిలో నడుస్తున్నది.

నాకెందుకీ ఆలోచనలు.

గాలివాన అంటే నాకేదో అనుమానం కలుగుతోంది.

నేనెరిగిన రెండో గాలివాన నా జీవితాన్నే నాశనం చేసింది.

అన్ని కష్టాలను ఎదుర్కొంటూ, ఏదో దారిపట్టానని సంతోషించాను. కానీ, ఆ

ఆనందాన్ని ఈ గాలివాన నాశనం చేస్తుందా?

బయట గాలి చేస్తున్న చప్పుడు వేయి దుందుభులు మోయించినట్లుంది. మధ్యమధ్యన మా అమ్మ గురక వినిపిస్తూనే వుంది.

మా గ్రామం రెండువందల గడపకలది. మా ఊరికి బండిదారి తప్ప రోడ్డు కూడా లేదు. వర్షాకాలంలో ఆ నాటుదారి కూడా మాయమవుతుంది. అయితేనేం మా వూరి భూములు సంవత్సరానికి మూడుపంటలు పండుతాయి. మావే పాతిక ఎకరాలున్నాయి. మా వాసలో ఉన్న మా ఇల్లేకాక మరి నాలుగు ఇళ్లు కూడా మావే. ఇవన్నీ 'మావి' అనడంకన్న 'నావి' అంటే సమంజసంగా ఉంటుంది. మా అన్నయ్యకు పిత్రార్జితమైన ఇల్లు కాని, ఒక సెంటు భూమికాని లేదు. ఈ భూములు, ఈ ఇళ్లూ నావి. నా పేరున ఉన్నవి. వీళ్ల అందరూ అంటే మా అన్నయ్య, మా వదిన, మా అమ్మ, నాలుగిళ్లలో ఉన్న మా జ్ఞాతులు నా దయమీదనే బతుకుతున్నారు. నాకు ఇంత ఆస్తి ఉన్నా, ఏమీ లేనిదానివలే పొట్ట గడవక మా అన్న పంచన చేరినదానివలె లోకం భావిస్తుంది, అందరికీ నిజం తెలుసు. కానీ నేనాడకూతుర్ని. అన్నిటికీ నేనెక్కడికి పోతాను? లావాదేవీలు, కోర్టు వ్యవహారాలు ఆస్తితో పాటు రావలసినవే. స్వయంగా వ్యవహారాలు చేసుకోడానికి ప్రయత్నించాను. లోకం అట్టుడికిపోయింది. ప్రజలు ముక్కులమీద వేళ్లు వేసుకున్నారు. ఈ ఆస్తిని నిలబెట్టుకోడానికి ఓ మగసహాయం కావాలన్నారు. నా వయసు కూడా నాకు శత్రువయింది. పరిస్థితులతో రాజీపడి, నేనే బాధ్యతను మా అన్నయ్యమీద విడిచి పక్కకు తప్పుకున్నాను.

నా ఆలోచనలు దారి మళ్లుతున్నాయి.

కచేరీ సావడిలో గడియారం పన్నెండు కొట్టింది.

ఈ మూడో గాలివాన నా జీవితాన్నే మార్చేస్తుందా?

ఏమో! ఈ గాలివానలు మాత్రం నా జీవితమార్గంలో మైలురాళ్లుగా నిలుస్తున్నాయి.

నా బతుకులో మరే మార్పులు కలగడానికి అవకాశాలు లేవు.

మారవలసిందల్లా మారిపోయింది.

ఉదయం లేవడం, ఇంటిపనులు చూసుకోవడం, స్నానం, భోజనం, విశ్రాంతి- ఈవిధంగా రోజు తరువాత రోజు గడచిపోతున్నది. వచ్చే బంధువులతో విధిలేక మాట్లాడుతాను. వాళ్లు నా ముఖం ముందు పొగడడం, వీపు వెనుక ఎన్నో కథలల్లడం నాకు తెలుసు. వచ్చిన ధాన్యం కొట్లలో పోయించడం, అమ్మినవి అమ్మడం, బ్యాంకులో వేసిన సొమ్ము ఎంతుందో చూసుకోవడం- ఈవిధంగా నిర్విచారమైన జీవనానికి రెండు సంవత్సరాలయి అలవాటుపడ్డాను.

మరెందుకీ ఆలోచనలు?

ఈ మూడో గాలివాన ఎందుకొచ్చింది?

ఈవిధంగా కూడా నన్ను బతకనీయదా?

నాకు నవ్వొచ్చింది.

ఈ మూడో గాలివానే ఏమిటి, ఇంకా నేను ఎన్ని గాలివానలు చూడాలో!

ఈ ఆలోచనలు ఎప్పుడో ఆగిపోయి నాకు నిద్రపట్టింది.

ఉదయం తెలివివచ్చేసరికి చాలా వెలుతురు వచ్చింది. మా అమ్మ మంచం వేపున్న కిటికీ తలుపులు తీసివున్నాయి. బయట వర్షం పడడంలేదు. గాలి చేసే చప్పుడు కూడా వినిపించలేదు.

కచేరీ సావడినుండి మాటలు వినిపిస్తున్నాయి.

చీర సరిగా సర్దుకొని, దగ్గిరగా వేసిన గది తలుపులు తీసుకొని, సావడి వేపు నడి

చాను. అక్కడ నిన్న సాయంకాలం కట్టిన ఆవుకాని, పెయ్యకాని లేదు. పేడతీసి ఆ చోటు కడిగినట్లుంది. సావడిలో ఒక పక్కకు బల్లమంచముంది. దాని దగ్గిర నారాయడు మరో నలుగురు రైతులు నిలబడ్డారు. మంచంమీద ఎవరో పడుక్కున్నట్లుంది. మనుషులు అడ్డంగా ఉండడంచేత మంచంమీద పడుకున్నవాళ్లెవరో సరిగ్గా కనిపించలేదు.

"ఇంతకీ, ఈ మనిషెవడో బతికే ఉన్నాడా? " మా అన్నయ్య చికాకుగా అడిగాడు.

"పక్కలెగరేస్తున్నారు బాబూ" అన్నాడు నారాయడు.

"నారాయడూ! ఊరిలో రెండువందల ఇళ్లున్నాయి. వీడిని ఎవరింటికో తీసుకుపోండి. పొద్దున్న పొద్దున్నే ఈ తంటాలు తెచ్చిపెట్టారేమిటి? " విసుక్కుంటూ అన్నాడు. మా అన్నయ్య.

"తమరిలాగంటారని తెలుసు. ఏం సెయ్యడం? అంగుళం వాసిలో ఈయనెవరో బతికిపోయారు. లేకపోతే కొబ్బరిసెట్టుకింద పడ్డవారు బతుకుతారా? తప్పకుండా చచ్చిపోయేవారు"

"అప్పుడే చికాకుల్లేవు. తిన్నగా ఒకచోటకే తీసుకుపోయి ఉండేవారు"

"అవేం మాటలు బాబూ! నిండు ప్రాణం, మనిషి బతికే ఉన్నాడు. మెడలో జంధెముంటే ఎవరో బ్రామ్మల మనిసే అనుకున్నాం. పంచె, బనీను తప్ప ఒంటిమీద మరేవీలేవు మనిషి బురదలో కూరుకుపోయాడు. నారాయడు చెప్పగానే తొందరగా వచ్చాం. మనూరికొస్తూ ఈయనెవడో పడిపోయాడు. ఎవరి చుట్టమో" అన్నాడు నరిసిగాడు.

చుట్టమన్నమాట వినగానే, మా అన్నయ్య మంచం దగ్గిరికెళ్ళి పడుక్కున్న మనిషి ముఖంలోకి చూసి అన్నాడు.

"వీడెవడో నా చుట్టంకాడు. మిగిలిన బ్రాహ్మలు ఉన్నారు కదా! ఎవరింటికో తీసుకుపొండి" మా అన్నయ్య చీదరించుకున్నాడు.

"బుగతగోరూ! తమరు ఈ వూరికి మోతుబర్లు- బ్రామ్మలు. మిగిలిన బ్రామ్మలు మీతో సాటైనవాళ్ళేనా? వాళ్లకున్న కొంపలే పాటి, వాళ్లకున్న ఆదాయమేటి? " అన్నాడు నారాయడు.

"హెడ్ మాస్టరున్నాడు కదా! స్కూలు బిల్డింగులో మీరు ఉంటున్నారు కదా! అక్కడ బల్లలు అన్నీ సదుపాయంగా ఉంటాయి" అన్నాడు మా అన్నయ్య.

"ఆయనలేరు. పొద్దున్నే శిగాకుళం వెళ్లిపోయారు. ఆయనను స్టేషనుకు దిగబెడుతుంటేనే తోవలో ఈ మనిషి కనిపించాడు. అతనే తమరి ఇంటికి తీసుకుపొమ్మని సెప్పి నన్ను పంపించి, తానొక్కరూ వెళ్లిపోయినారు. వెంటనే అసిరిగాడిని, గురవయ్యని, ఎంకటేసుగాడిని, సూరిగాడిని పిలుసుకొచ్చి, కొబ్బరిసెట్టుని పక్కకుతీసి, ఈ మనిషిని ఇక్కడికి తెచ్చాం"

మా అన్నయ్య మంచమొకటి తెచ్చి, కర్రలు కట్టి, ఆ మనిషిని శ్రీగాకుళం గవర్నమెంటు ఆస్పత్రికి తీసుకు పొమ్మని సలహా ఇచ్చాడు.

అప్పుడు నేను రంగంలోకి రావలసి వచ్చింది.

"నారాయడూ! వైద్యులు సీతారామయ్యగారిని వెంటనే తీసుకురా!" అన్నాను నేను.

మా అన్నయ్య నావేపు కోపంగా చూశాడు. నలుగురు రైతుల మధ్య తన మాటకు విలువలేకుండా పోయిందని వాడి అభిప్రాయం.

నారాయడు పరుగెత్తాడు. మరొక్క పది నిమిషాలలో సీతారామయ్యగారిని తీసుకువ

చ్చాడు. అదృష్టవశాత్తు అతను ఏ పూరా వెళ్ళిపోలేదు.

మంచంమీద చైతన్యం లేకుండా పడివున్న మనిషిని ఒక పావుగంటవరకూ వైద్యులు పరీక్ష చేసి పెదవి విరిచారు.

"అమ్మాయ్! ఇతను మాట దక్కించడని నా అనుమానం. ఎవరేనా ఇంగ్లీషు డాక్టరుకి చూపిస్తే ఇంజక్షనిచ్చి బతికించవచ్చు" అన్నారు ఆయన.

"అదే నేనూ చెప్పినది. శ్రీగాకుళం హాస్పిటల్ కి తీసుకుపోమ్మన్నాను" అన్నాడు మా అన్నయ్య.

నేనా మాటలు విననట్లే అన్నాను.

"అయ్యా! ఈ మనిషిని ప్రస్తుతం కదిలించే ప్రసక్తిలేదు. చేయవలసిన వైద్యం మీరు చెయ్యండి. ఆయుర్దాయముంటే మనిషి బతుకుతాడు. లేనప్పుడు ఎక్కడికి తీసుకొని వెళ్ళినా ప్రయోజనంలేదు"

మా అన్నయ్య మరేం మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు. వాడికి బాగా జలుబు చేసింది. జ్వరం కూడా వచ్చిందేమో!

మా వదిన కూడా మా వాడి వెనుకే నిష్క్రమించింది.

నారాయణీ! చాలా పెద్ద బరువు తల మీద వేసుకుంటున్నావు మరోసారి ఆలోచించు అంది మా అమ్మ.

"ఆలోచించడానికేముంది? సాటిమనిషి-చావుబతుకుల్లో ఉన్నాడు. అతనికి ఎవరున్నారో ఎవరు లేరో! హాస్పిటలులో డాక్టర్లు మందులు పోస్తారు. అతనినెవరు కనిపెట్టుకుని ఉంటారు? మనం అన్నిటికీ భయపడితే ఎలా? ఈ మనిషి బతికి బయటపడితే తన దారిని తాను పోతాడు. ఇప్పుడు ముందు వెనుకలు ఆలోచించడానికి వ్యవధి లేదు. నారాయడూ! నువ్వు సీతారామయ్యగారితో వెళ్ళు. వారిచ్చిన మందులు తీసుకురా వాటినెలా ఉపయోగించడమో ఆయన చెప్తారు"

నా మాటలు విని సీతారామయ్యగారు సావడినుండి వీధివేపు నడిచారు. నారాయడు అతనితో వెళ్లాడు. అసిరిగాడిని, మిగిలిన ముగ్గురు రైతులను వెళ్ళిపోమన్నాను.

సీతారామయ్యగారు వచ్చేసరికి దెబ్బతిన్న మనిషి పూర్తిగా బురదతో ఉన్నాడు. బురద తుడిపించి బట్టలు మార్చేసరికి అరగంటపట్టింది. అటు తరువాత ఆయన పరీక్షలు చేశారు. నమ్మినబంటు నారాయడు వాడుంటే చాలా పనులు సులువుగా అవుతాయి. వాడు ప్రశ్నలు వెయ్యడు. వాడి సలహాలు సమయానికి ఉపకరిస్తాయి.

ఇది నాకు పరీక్ష.

నారాయడు మందులు పట్టుకొచ్చేసరికి అరగంట పట్టింది. నారాయణతైలం శరీరానికి పట్టించి, రెండు మూడు కంబళ్లు కప్పుతున్నారు వైద్యులు. మనిషి ఇటు అటు కదిలినా, శరీరం వేడెక్కి నోరు విప్పినా, పొట్లాంలోని మందు తేనెలో కలిపి నాకించమన్నాడు.

నారాయడు రోగి దగ్గర కూర్చున్నాడు. మా అమ్మ వంట చేస్తున్నది. మా అన్నయ్య దగ్గుతున్నాడు గదిలో మా వదిన కూడా వాడితోనే ఉంది.

పెరడు, ఆవు, పెయ్య అన్నీ సమస్యలే.

పనులు చూసుకొని, స్నానం చేసి నేను వచ్చేసరికి అపరాహ్ణం దాటింది.

"నారాయడూ! రోగిశరీరం వేడెక్కిందా?"

"లేదమ్మగారూ!"

"నేను కూర్చుంటాను. నువ్వు తిండి తినిరా"

నాకు భోజనం చేయాలని లేదు. చావు బతుకులలో ఉన్న మనిషొకడు సావడిలో

పడి ఉంటే ఎలా తిండి తినడం? మా అమ్మ రెండు మూడుసార్లు భోజనానికి పిలిచింది. తరువాత ఎప్పుడో తింటానని, గిన్నెల మీద మూతలు పెట్టి, అంట్లూ ఎంగిళ్లు చూసుకోమని చెప్పాను.

నారాయడు తిరిగి వచ్చేసరికి బాగా ఆలస్యమయింది. అంటే సాయంకాలం నాలుగు గంటలవేళ అయింది. ఈరోజు కూడా కొన్ని కుటుంబాలకు స్కూలులోనే తిండి పెడుతున్నారు. అక్కడే వాళ్ల బస. బహుశా అక్కడే వాళ్లోవారం రోజులుండాలి. అప్పటికిగాని వాళ్ల గుడిసెలు ఒక రూపానికి రావు. అందుకోసమే ఇవాళ ఒక పదిరోజులకు సరిపోయే సరుకులు బడికి పంపాను. గ్రామంలో, డబ్బు గల కుటుంబాలు ఆ విధంగా ఇవ్వడం ధర్మం.

నారాయడు వచ్చి అడిగాడు.

"అమ్మగారు! ఈ మనిషి వొళ్లేమేనా వేడెక్కిందా? "

నాకు నవ్వొచ్చింది. పరాయిమగాడి వంటిమీద ఎలా చేయి వేస్తాను?

"ఓరి నారాయడూ! అందుకే నీ కోసం ఎదురు చూస్తున్నాను. ఏ సంగతీ నువ్వు చెపితే వినాలని తొందరపడుతున్నాను"

నారాయడు తల ఆడించాడు. వాడికీ విషయం అర్థమయినట్లుంది.

వాడు రోగి శరీరం ముట్టుకొని చూశాడు. తరువాత గుండెలమీద చెయ్యి వేశాడు. ముక్కు దగ్గిర వేళ్లుంచాడు.

"అమ్మగారూ! ఒళ్లు కొంచెం వెచ్చగా ఉంది. ఊపిరి కూడా వేళ్లకు తగులుతోంది. గుండెలు కొంచెం ఎగురుతున్నాయి. అయ్యగారిచ్చిన మందు తేనెలో కలిపితెస్తే నాకించడానికి ప్రయత్నం చేస్తాను"

మా అమ్మ గదిలో పడుక్కుంది. పడకగదిలో మా అన్నయ్య, వదిన మాట్లాడుకుంటున్నారు. అందరి మధ్యన నేనొంటరిగా పనులు చేస్తున్నాను.

నారాయడు మెల్లిగా రోగిచేత మందు నాకించాడు. ఆవుపాల తుడిచి, పాలు పితికి, చీకటి పడుతుంటే వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి నాకు భోజనం మీద కాస్త ఆసక్తి కలిగింది.

మనసులోని ఆందోళన తగ్గింది.

మళ్లా ఇల్లు, పని, అన్నీ మామూలుగా మొదలయ్యాయి.

మా అన్నయ్య పొరపాటుకైనా రోగి గురించి ప్రశ్నించలేదు. మా అమ్మ రోగి సంగతి అడిగింది. రోగికి మందిచ్చినట్లు తెలిసి ఆమె సంతోషించలేదు.

రోగి బతికినా బాధే, చనిపోయినా బాధే.

ఆ రాత్రికి రోగి దగ్గిర నారాయడు పడుక్కున్నాడు. చాలా రోజులవరకు వాడు అలా పడుకోక తప్పింది కాదు.

సీతారామయ్యగారు మందు మార్చి ఇచ్చారు.

మరునాటి ఉదయానికి రోగి కొంచెం కదిలాడు. మందులు పనిచేస్తున్నాయన్న మాట.

మార్చడానికి రోగికి బట్టలు కావాలి. మా అన్నయ్య గునుస్తున్నాడు. మా వదిన చింకి వాటికోసం వెదుకుతోంది. మొత్తంమీద పంచ, బనియను, తువాలు రాబట్టాను.

నారాయణతైలం రాసిన తరువాత కట్టిన బట్టలు వాసన వేసేవి. మార్చక తప్పదు. నారాయడు ఎంతో ఓపికతో నేర్పుతో రోగికి సపర్యలు చేస్తున్నాడు.

మూడోరోజుకి రోగి కళ్లు తెరచి మెల్లిగా మూలిగాడు. కొంచెం కొంచెం పాలు తాగిస్తే నారాయడి ముఖంలోకి కృతజ్ఞతగా చూశాడు.

అయిదోరోజు పొద్దున్న పది గంటలకు

సీతారామయ్యగారిని మా అన్నయ్య ప్రశ్నించాడు.

"ఈ మనిషెవడో, యముడి నోట్లో మన్నుకొట్టాడు. వీడినెప్పుడు ఇంటినుంచి పంపించవచ్చు? "

మా అన్నయ్య ఎదుటే సీతారామయ్యగారు రోగిని అడుగుతూ సంజ్ఞలు చేశారు.

"ఎవరు నువ్వు? "

రోగి ముఖంలో ఏవిధమైన మార్పు లేదు.

"మాట్లాడగలవా? "

రోగి ప్రయత్నించాడు, కాని చిన్న మూలుగు తప్ప మరేదీ రాలేదు.

"ఒంట్లో బాధగా ఉందా? "

బాధతో అతను కళ్లు మూసుకున్నాడు.

మనిషి చాలా నీరసంగా ఉన్నాడు. ఏదో చెప్పలేని బాధతో అలమటిస్తున్నాడు. కొబ్బరి చెట్టు ఇతని మీద పడిందన్నారు. తలమీద బలమైన దెబ్బ తగిలివుండాలి.

అక్కడనుంచి మా అన్నయ్య వెళ్ళిపోయాడు. సాధారణంగా వాడు కచేరీ సావడిలో రాతకోతలు సాగిస్తాడు. పార్టీలు వస్తారు. కోతలయిపోయాయి. పండుగకి ముందే అంబారాలు కొలుస్తారు. రోగి మంచం సావడిలో ఉండడం చేత మా అన్నయ్య వీధి అరుగుమీద కూర్చొని రాత పనులు చేయవలసివచ్చింది.

అప్పుడప్పుడు అంబారాలు కూడా సావడిలో కొలుస్తాం. హెచ్చుమంది రైతులు ధాన్యం ఒకేసారి తెస్తే, మండువా కడిగి శుభ్రంచేసి, ధాన్యం పోయించి కొలుస్తారు. రోగిమంచం ఒక మూలకు ఉండడంచేత సావడిలో ధాన్యం కొలవడానికి ఇబ్బంది లేదు.

మా అన్నయ్య సులువుగా వీధి అరుగు మీద రాతకోతలు చేసుకోవచ్చు కాబట్టి రోగిని సావడినుంచి కదపడానికి వీలులేదని గట్టిగా చెప్పాను.

రోగి మాత్రం చాలా గట్టివాడు. పదిరోజులయ్యేసరికి లేచి కూర్చున్నాడు. ఇరవైరోజులయ్యేసరికి నట్టింట్లో కూర్చొని మా అందరితో భోజనం చేశాడు. నెల్లాళ్లకు అతను ఇంట్లో మనిషయ్యాడు.

అన్నీ బాగానే ఉన్నాయి. కానీ అతనికి మాటలు రాకుండా పోయాయి. చెవులు కూడా వినిపించడంలేదు. సీతారామయ్యగారు చాలా ప్రయత్నాలు చేశారు. పేరు, ఊరు, ఉద్యోగం మొదలైన విషయాల గురించి సంజ్ఞలు చేసి ఒక వారంరోజులు ప్రయత్నించారు. కొబ్బరి చెట్టు తలమీద పడి గట్టిదెబ్బ తగిలిందని, దానితో గతమంతా అతనికి మరపులోకి వెళ్ళిపోయిందని వైద్యులు చెప్పారు. అతనిని మేమెలా తయారుచేస్తే ఆవిధంగా మారుతాడని ఆయన అన్నారు.

మా అన్నయ్య అతనిని ఇంట్లోంచి పంపుతానన్నాడు. మా అమ్మ కొత్త మనిషికి వండిపెట్టలేనంది. ఒకనెల్లాళ్ల తరువాత కూడా అతను నీరసంగానే ఉన్నాడు. శ్రమపడి నడిస్తే ఆయాసపడుతున్నాడు. ఏ పనికేనా అతనితో చెప్పడం చాలా కష్టమవుతోంది. అతను పరాకుగా ఉంటే మెల్లగా తట్టి సంజ్ఞలు చేయవలసివస్తోంది.

"నారాయడూ! ఈ మూగి మనిషికి మనమే ఏదేనా పేరు పెడితే బాగుంటుందేమో!" అన్నాను నేనోరోజు.

నారాయడు ఒక్కక్షణం ఆలోచించి అన్నాడు.

"అమ్మగారూ! దేముడి పేరేదో పెట్టండి, లేకపోతే రామదాసని పిలవండి."

అతని పేరు రామదాసని రెండురోజులు చెప్పిన తరువాత పెదవి కదలికలను సంజ్ఞలను గుర్తించి ఆ పేరు స్వీకరించినట్లున్నాడు.

ఆ రామదాసు క్రమంగా గడ్డం పెంచాడు.

మా అన్నయ్య ఇచ్చిన చింకిపంచ, బనియను ఒక రోజు కట్టుకుంటాడు. వాటిని తడిపి ఆరవేసి తాను వేటితో వచ్చాడో వాటిని మరోరోజు కట్టుకుంటాడు. అతని స్వంతపంచ, బనియను చవుకబారువి కావు.

రెండు నెలలయ్యేసరికి రామదాసు మా ఇంట ఓ మనిషయ్యాడు. అతనిప్పుడు సావడిలో నేలమీద చాపవేసి పడుకుంటున్నాడు. పెరడు తుడవడం, సాల శుభ్రం చేయడం చేస్తూ నారాయడికి పొలంపనులు చూసుకోడానికి అవకాశం కలిగిస్తున్నాడు. పాలు పితుకుతున్నాడు. ఆవును ఏటికి తీసుకెళ్లి కడిగి తెస్తున్నాడు. పచ్చగడ్డి కోసి తెస్తున్నాడు.

మా పెరడు చాలా పెద్దది. నా గది కిటికీ దగ్గిర పూలమొక్కలున్నాయి. ఈమధ్య, అంటే గాలివాన తరువాత నేనటు వేపే వెళ్ళలేదు. రామదాసు చాలా నేర్పుతో వాటినన్నిటిని కత్తిరించి, పాదులు కట్టి నీళ్ళు పోస్తున్నాడు. పెరట్లో ఆవులసాలకెదురుగా ఉన్న ఖాళీ స్థలంలో ఆనప పాదు పెట్టాడు. వంగమొక్కలు నాటాడు. మిరపనారు తెచ్చి వేశాడు పొద్దున్న లేచిన దగ్గిరనుంచీ రాత్రి పదిగంటలకు నిద్రపోయేవరకు రామదాసు ఇంట్లో ఏదో పని చేస్తుంటాడు.

ఒకరోజు మా అన్నయ్య సావకాశంగా పెరట్లోకి వెళ్లి నవనవలాడుతూ ఎదిగిన ఆనపకాయలు, చెట్లనిండా వంకాయలు, మొక్కలనిండా మిరపకాయలు చూసి పక్కనున్న మా అమ్మతో అన్నాడు.

"ఈ రామదాసుగాడికి పెట్టిన తిండి దండగకాలేదు" అని కాని, మా అన్నకి మనసులో ఓ కించ మాత్రం మిగిలిపోయింది.

ఈ కొరగానివాడు తన పంక్తిని భోజనం చేస్తున్నాడని, ఈ రామదాసు బ్రాహ్మడు కదా! వీధిసావడిలో విస్తరివేస్తే ఊరివాళ్లు కాకుల్లా పొడుచుకొని తింటారు. కాబట్టి లోకానికి భయపడి తన పంక్తిన కూర్చోనిస్తున్నాడు.

రామదాసు మా అన్న పంక్తిని భోజనం చేస్తున్నా తన హద్దులలోనే ఉన్నాడు. మా అన్న పెద్ద పీట వేసుకుంటాడు. నూరుతులాల వెండికంచంలో తప్ప భోజనం చెయ్యడు. వెండిచెంబు, వెండిగ్లాసు విధిగా మంచినీళ్లకు ఉండవలసినవే. వెన్నకాచిన నేయి, గడ్డపెరుగు, మీగడ కట్ట చక్కగా కాచినపాలు ఈ విధంగా ఏపిల్ల జమీందారు వలెనో అన్ని భోగాలు అనుభవిస్తున్నాడు.

రామదాసుకి, మా అన్నకు ఒకే పంక్తిలో పెట్టినా, వాళ్లిద్దరి మధ్య పదడుగులు దూరముంటుంది. అతను పెరట్లో అరిటాకు కోసి వేసుకుంటాడు. తడిగావంచా కట్టుకొని నేల మీద కూర్చుంటాడు. మితంగా తింటాడు. మా అన్నకు వేసినవన్నీ తన విస్తట్లో ఉన్నాయా లేవా అని చూడడు. మాకే పాపమనిపించి అన్నీ కొద్దిగా అయినా వడ్డిస్తాం. తన ఆకు పారేసుకొని, ఎంగిలి తనే ఎత్తుకుంటాడు.

రామదాసు మా అన్నను చాలా గౌరవిస్తాడు. తనవంటి దిక్కులేని వాడికి తిండిపెడుతున్నాడని ఎప్పుడూ కృతజ్ఞతా భావంతోనే ఉంటాడు.

ఆ సంవత్సరం మా భూములు విపరీతంగా పండాయి. రైతులు కూడా బకాయిలు లేకుండా అంచనా ప్రకారం అంబారాలు కొలిచారు. పుష్యమాసం పండుగ ముందు ఒక పదిరోజులు మాకు తీరుబాటంటూ లేకపోయింది. రైతులకు భోజనాలు పెట్టడం, వారికి కొత్తబట్టలు యివ్వడం ప్రతి సంవత్సరం పరిపాటి అయింది. ఈ సంవత్సరం వడ్లనలకు రామదాసు ఇక్కడే నడుంకట్టుకొని పనిచేశాడు.

నేను, మా అమ్మ వండివార్చడానికి, అందరికీ తృప్తితీరా రామదాసు వడ్డించడానికి సరిపోయింది.

ప్రతి రైతుకీ మేలు రకం పంచలచాపు మా అన్నయ్య ఇచ్చాడు. రామదాసు మూటలోంచి తీసి ఇస్తే, మా అన్నయ్య రైతు చేతిలో పెట్టేవాడు. ఈ విధంగా నలభై చాపులు మా అన్నయ్య పంచిపెట్టాడు. రెండు చాపులు మిగిలిపోతే, వచ్చే సంవత్సరానికి పనికి వస్తాయని మా వదిన చేతికిచ్చి, పెట్టెలో దాచమన్నాడు. పక్కనే నిలబడ్డ రామదాసు కట్టుకున్న పంచ చిరిగిపోయిందని వాడు గుర్తించలేకపోయాడు.

నేను చాలా బాధపడ్డాను. రామదాసును సంజ్ఞ చేసి అడిగాను.

"నీ పంచల చాపేది? "

దానికి అతను సంజ్ఞచేసి చెప్పాడు, తాను రైతునుకానని.

మా అన్నయ్య ఈమధ్య ప్రతిపనికి రామదాసునే పిలుస్తున్నాడు. తనతో శ్రీగాకుళం తీసుకుపోతున్నాడు. బ్యాంకులో డబ్బు వేయడానికి, డబ్బు తీయడానికి వెళ్లేటప్పుడు రామదాసునే తన అంగరక్షకుడిగా వినియోగించుకుంటున్నాడు. తాను జమీందారుగా, రామదాసు తన సేవకుడుగా అతను వ్యవహరించాడు.

రామదాసుకి నిజం తెలుస్తే ఏమనుకునేవాడో! ఏది అయితేనేం నాకేమీ కించలేదు.

క్రమక్రమంగా మా అన్నయ్యకేకాక, ఊళ్లో వాళ్లకి కూడా రామదాసు తలలో నాలుక అయాడు. ఎక్కడయితే మరో మనిషి సహాయం అవుసరముంటుందో అక్కడ అతను విధిగా ఉండేవాడు. అటు స్కూలు మాస్టరుగారు, ఇటు వైద్యులు సీతారామయ్యగారు అతనిని బాగా మెచ్చుకుంటున్నారు.

క్రమక్రమంగా చలి తగ్గిపోయింది.

మా అన్నయ్యకు ఇన్ని యేళ్ళబట్టి లేనికోరిక ఒకటి పుట్టుకొచ్చింది. అది వాడికికాదు, వాడిపెళ్లానికి. ఇంత సంపద ఉండి కూడా ప్రయోజనమేముంది? పిల్లాపాపలు లేని ఇల్లు శోభించదు. తీర్థయాత్రలు చేసి వస్తే తప్పక ఫలితం కలుగుతుంది. మా వదిన కడుపు పండుతుంది.

మా అమ్మ చాలా సంతోషించింది. వాళ్లతోపాటు మా అమ్మ కూడా వెళ్తే బాగుండునని నేనన్నాను. ఈ సంవత్సరానికి వాళ్లిద్దరూ వెళ్లివస్తే, వచ్చే సంవత్సరం మేమిద్దరం వెళ్లవచ్చునని మా అన్నయ్య నచ్చజెప్పాడు.

తీర్థయాత్రలకు చాలా డబ్బు కావాలి.

వాడికీ డబ్బంతా ఎక్కడిది?

మాటవరసకైనా వాడు నన్ను డబ్బు అడగలేదు.

ఒకవేళ వాడు నన్నడిగితే కాదనేశక్తి నాకులేదు. ఫలితమొక్కటే. కాని, నాకొక్కటే ఆశ్చర్యం వేస్తుంది. తనదికాని డబ్బుని చాలా స్వతంత్రంగా వాడుకోడానికి సిగ్గు కూడా వాడికి వెయ్యదా?

సిగ్గుదేనికి? ఈ సంసారమంతా మా అన్నే నడుపుతున్నాడు కదా! పెద్దవాడు. అధికారం హస్తగతం చేసుకున్నాడు. డబ్బు చాలా చెడ్డది. ఒకేరక్తం పంచుకున్న అన్నదమ్ముడికి అప్పచెల్లెలుకి మధ్య కలతలు లేవదీస్తుంది.

ఏదో జీవితం సాఫీగా వెళ్తున్నదని సంతోషించడానికి వీలులేకుండా మా అన్నయ్య చిచ్చుపెట్టి వెళ్లిపోయాడు.

తరువాత తరువాత తెలిసింది, వాడు నలభైవేల రూపాయలు బ్యాంకునుండి తీశాడు. మా ఇద్దరి పేర్లతో జాయింట్ అకౌంట్ ఉంది. పాసుబుక్కు వాడి దగ్గిరే ఉంది. వాడి గదిలో సందుగుపెట్టెలో అది

కనిపించింది. దానిని తెరచి చూస్తే నిజం తెలిసింది.

రెండు సంవత్సరాలనుండి నెలకు రెండు వేల రూపాయల చొప్పున మరొక అకౌంటుకు డబ్బు బదిలీ అవుతూ వచ్చింది. అసలు వడ్డీలతో కలిసి ఏభైవేల రూపాయలు ఆ అకౌంటులోకి బదిలీ అయాయి. అది మా వదిన పేరున తెరచిన అకౌంటు అనుకుంటాను. కాబట్టి, తన భార్య డబ్బు వాడు తీసుకున్నాడు.

వాడిపేర పవరాఫ్ అటార్నీ ఇచ్చాను. ప్రతి యేడు దానిని రెన్యూ చేయిస్తూ వచ్చాను. ఈ సంవత్సరం దానిని మరో అయిదేళ్ళకు పొడిగించాను.

చేజేతులా ఆస్తి అంతా ఒక దౌర్భాగ్యుడి చేతిలో పోశాను.

ఈ సంగతి మా అమ్మతో చెప్పాలని అనుకున్నాను. ఆవిడ మాత్రం ఏంచేస్తుంది? వాడామెకు ఒక్కడే సుపుత్రుడు కదా! మా అందరికోసం శ్రమపడుతున్న వాడు ఆపాటి సద్వినియోగం చేస్తే తప్పేముంది?

ఎవరికి చెప్పుకున్నా ప్రయోజనంలేదు.

స్పెషల్ ట్రెయిను, అంటే తీర్థయాత్రా స్పెషల్- విశాఖపట్నం నుంచి బయలుదేరుతుంది. మా అన్నయ్య, వదిన మెయిల్‌లో విశాఖపట్నం వెళ్లారు. ఆముదాలవలసలో మెయిలెక్కించడానికి రామదాసుని కూడా బండిమీద తమతో తీసుకుపోయారు.

రామదాసు తిరిగి వచ్చిన తరువాత తెలిసింది, మా వాళ్లిద్దరే కాక మరొకతను కూడా స్టేషనులో వాళ్లని కలిశాడు. రామదాసు చేసిన సంజ్ఞలనుబట్టి ఆ మనిషికి గిరజాలున్నాయి.

అప్పుడు నాకు అర్థమయింది మా వదిన వేసిన పథకమంతా.

ఆ గిరజాల పెద్దమనిషి పేరు నారాయణరావు. వాడు మా వదినకు దగ్గిర చుట్టం. అంతేకాదు చిన్నప్పటినుంచీ వాళ్లిద్దరూ ఒకే కంచంలో తిని ఒకేమంచం మీద పడుకునే వాళ్లు. ఎంతకాలమో తెలుసా? మా వదిన పెద్దమనిషయేవరకు. అటు తరువాత కూడా వాళ్లు ఒకే మంచం మీద పడుక్కునే వాళ్లే- కడుపో, కాలో వస్తుందని, పెళ్లయేవరకు వేరే పడుక్కోండని మా వదిన తల్లి వాళ్లని విడదీసింది. వాళ్లిద్దరికీ పెళ్లికావలసింది. కాని, ఇద్దరు పెళ్లికొడుకులలో ఎవరు మెరుగని పెద్దవాళ్లు ఆలోచించారు. మా అన్నయ్యకు ఆస్తి, ఇల్లూ, వాకిలి, ఉద్యోగం, ఉద్యోగానికి కావలసిన చదువు ఏవీలేవు. అయినా పెద్ద కుటుంబంవాడు. మాది ఒకప్పుడు గౌరవంగా బతికిన కుటుంబం. సంపన్నులం. ఆస్తులుపోయినా, పట్టణంలోని పెద్దకుటుంబాలలో మాదొకటి అన్న పేరు మాత్రం నిలిచిపోయింది.

నారాయణరావు తండ్రి యాయవారమెత్తి బతికినవాడు. కొడుకు చదువు గురించి ఆయన పట్టించుకోలేదు. బ్రాహ్మణత్వాలు చేసుకొని వారాలు చేసుకొని, చదివిన క్లాసులోనే మూడేసి సంవత్సరాలుంటే, చుట్టలో బీడీలో తాగుతూ ఆ కొడుకు ఏడో తరగతితోనే చదువు చాలిస్తే, వాడి తల్లిదండ్రులు ఏంచేస్తారు?

ఆవిధంగా ఇద్దరు పెళ్లి కొడుకులలోనూ మావాడే ఉత్తముడిగా ఎన్నికయ్యాడు.

మా వదిన వచ్చిన దగ్గిరనుంచీ మావాడికి సిరిపట్టింది. ప్లీడరు గుమాస్తాగా ఉద్యోగం దొరికింది. పార్టీల బుర్రలమీద చెయ్యివేసి డబ్బు సంపాదించడం నేర్చుకున్నాడు.

తరువాత మా అక్కయ్య పెళ్లయింది. మరో అయిదు సంవత్సరాలలో నా పెళ్లయింది. నా పెళ్లితో మేమందరం చాలా

గొప్పవాళ్లమయిపోయాం.

నారాయణరావుకి మరి పెళ్లికాలేదు. తరచు మా వదిన దగ్గిరికి వచ్చేవాడు. ఆ నెపం పెట్టుకొని నన్ను, మా అక్కయ్యను తెగ చూసేవాడు. ఏవో మాట్లాడి మమ్మల్ని నవ్వించడానికి ప్రయత్నించేవాడు. వాడు, మా వదిన నవ్వుకునేవాళ్లు. మేము అక్కడ నుంచి వెళ్లిపోయేవాళ్లం. మా అమ్మ వాడిని మా ఇంటి గడప తొక్కొద్దని చెప్పిననాడు మా వదిన కడవలుకొద్దీ ఏడ్చింది.

పట్టణంలోని ఇల్లూ వాకిలీ అమ్మి, ఈ గ్రామంలో ఇళ్లు, భూములు కొని, మేము స్థిరపడిన తరువాత, ఈ నారాయణరావన్న పెద్దమనిషి అడపాదడపా రావడం మొదలుపెట్టాడు. కొత్తలో బుద్ధిమంతుడిగా వ్యవహరించాడు. రానురాను బడి దిగిపోయాడు. మా వదిన నూతి దగ్గిర స్నానం చేస్తుంటే విధిగా పెరట్లో తచ్చాడేవాడు. వాడు వచ్చిన రెండుమూడు రోజులకు మా అన్నయ్య పనిమీద ఏదో వూరు పోయి వారంరోజుల వరకు అక్కడే ఉండిపోయేవాడు. సావడిలో మంచం మీద పడుకున్న పెద్దమనిషి ఏ అర్ధరాత్రో మా అన్నయ్య గదిలోకిపోయి తలుపులు వేసేవాడు. ఈ సరసాలు భరించలేక నేనే ఒకరోజు వాడిని ఇంట్లోకి రానియ్యకుండా వీధిలోంచే పంపించాను.

అప్పటినుంచి మా వదిన పైకి మైత్రి నటిస్తున్నా, లోలోపల నాపైన కక్ష పెంచుకుంటూనే వుంది. మా అన్నయ్య ఆవిడను ఓదార్చి నచ్చజెప్పి మరో ఏర్పాటుచేశాడు. ఆ నెలనుంచే కాబోలు మా వదినపేర బ్యాంకులో అకౌంటు తెరచి ప్రతినెల రెండు వేల రూపాయల చొప్పున ఆ అకౌంటుకి బదిలీ చేయిస్తూ వచ్చాడు. అంతేకాకుండా ప్రతియేడు ఓ గరిసెడు ధాన్యం, పుట్టెడు పెసలు, పుట్టెడు మినుములు పట్నంలోని నారాయణరావుకు పంపుతూనే ఉన్నాడు.

ముందో వెనుకో అన్ని విషయాలు నాకు తెలుస్తూనే ఉన్నాయి. వీధికెక్కి నేను సాధించేదేముంది? అపారమైన నా సంపదలో ఇదేపాటి? మాలోనే మాకు స్పర్థలు పెరిగి, మా అమ్మకు కూడా నేను శత్రువయిపోవాలి. ఈ గృహచ్ఛిద్రానికి నేను కారణమై, ఒంటరిదాన్నయిపోవాలి. చాలా విషయాలతో రాజీపడ్డాను. ఇది మరొకటి.

మా వాళ్లు యాత్రలకు వెళ్లినప్పుడు రామదాసుని జాగ్రత్తగా చూసుకోమని, అతను నమ్మినబంటని, మగసాయానికి అంతకన్న మంచివాడు దొరకడని, మా అన్నయ్య నాతోను, మా అమ్మతోను నొక్కినొక్కి చెప్పాడు.

ఫాల్గుణమాసం తొలిరోజులలో మావాళ్లు యాత్రలకు వెళ్లిపోయారు. మా అన్నయ్య మీద కొన్నిపనులు విడిచిపెట్టినా, ముఖ్యమైనవాటిని నేనే స్వయంగా చూసుకుంటాను. ఎవరికేనా ఇవ్వవలసి వచ్చినా, ఎవరికేనా ఇచ్చిన రుణాలు మాఫీ చేయవలసి వచ్చినా నేనే ఆ పనులు చేస్తాను.

అన్నిటికన్న నాకు ప్రియమైనది మామిడి తోట. పదిహేను ఎకరాల తోటలో చాలారకాల మామిళ్లు ఉన్నాయి. అక్కడక్కడ జీడిచెట్లు, సపోటా చెట్లు కూడా ఉన్నాయి. ప్రతి సంవత్సరం తోటను కవులికిస్తాం. ఈ సంవత్సరం కూడా ఒకరైతు తీసుకున్నాడు. మామిడి పూత మొదలైన దగ్గిరనుంచి వారానికో, పదిరోజులకో తోటలో తిరిగి వస్తుంటాను. నేను తోటకెళ్లేటప్పుడు నారాయుడు నాతో ఉంటాడు. ఈసారి వాడు మరో పనిమీద పట్నం వెళ్లాడు. నేనొకతెనూ వెళ్లిరాగలను. గ్రామానికి దిగువవేపున ఒక మైలు దూరంలో తోట వుంది. రామదాసుకి పనేమీ లేకపోతే నాతో తోటకు తీసుకుపోయాను.

చలి బాగా తగ్గింది. ఎండలో చిన్న వేడి

కనిపించింది. మధ్యాహ్నం మూడు గంటలకు మేమిద్దరం తోట చేరుకున్నాం. దక్షిణపు గాలి మొదలవలేదు. మామిడిపూత ప్రారంభించింది.

ఏదో కూనిరాగం తీస్తూ నడుస్తున్నాను. తోటలో ఒక మూల కాపలా కాసేవాడి గుడిశవుంది. అందులో ఎవరూ ఇంకా నివాసం ఏర్పరచుకోలేదు. కొంచెం దూరం నడిచిన తరువాత ఒక మామిడి చెట్టు దగ్గిర ఆగిపోయాను. దాని కొమ్మ ఒకటి భూమికి మూడడుగుల ఎత్తులో వంగి ఉంది. సాధారణంగా నేను ఆ చెట్టుకొమ్మమీద కొంత సేపు కూర్చుంటాను. మనసులోని జ్ఞాపకాలను నెమరు వేసుకుంటాను. మంచి సంగతులను మననం చేసుకుంటాను. కిందటి సారి ఆ కొమ్మమీద కూర్చున్నప్పుడు ఎదురుగా ఉన్న ఒక చెట్టు శిశిరం చివరి రోజులలో, వసంతం రోబోయే ముందు కొత్త చిగుళ్లు తొడిగింది. చెట్టు లేత ఊదారంగు పయ్యెద కప్పుకున్నట్లు అపుడు నాకనిపించింది. ఈసారి చూద్దునా ఆ చిగుళ్ల లేత రంగు మాయమయింది. చిలుకాకు పచ్చ ఆకుల చీర కట్టుకుంది ఆ చెట్టు ఇవాళ. ఎంత తొందరగా ఈ ప్రకృతి మారిపోయింది.

చెట్టును చూస్తూ కోకిల కొసరి కూస్తుంటే శ్రద్ధ పట్టివినలేదు. పంచమంలో ఆ రవం నా హృదయవీణా తంత్రులను స్పృశించింది.

నేను అయిదు సంవత్సరాలు సంగీతం నేర్చుకున్నాను. మా గురువు గారు వెంకన్న గారు. అప్పటికే ఆయనకు అరవైయ్యేళ్లు దాటాయి. ఏదో సందర్భంలో నాపాట ఆయన విన్నారు. చాలా మెచ్చుకున్నారు. తానే స్వయంగా వచ్చి నాకు సంగీతం నేర్పేవారు. అకస్మాత్తుగా ఆయన పరమపదించడంతో నా సంగీతం మొదలైనట్లే అంతమయింది. ఆ మహావిద్వాంసుడి దగ్గిర శిష్యరికం చేసిన తరువాత మరొకరి దగ్గిర నేర్చుకునే ప్రశ్నేలేదు. అప్పటికే నాకు చాలా కీర్తనలు వచ్చు అవన్నీ ఒకయెత్తు. మా బావ చెప్పినవి ఒకయెత్తు. అతను నాకు చాలా యెంకిపాటలు నేర్పాడు. మా బావ మంచి కవిత్వం చెప్తాడు. కథలు రాస్తాడు. మనసుకు హత్తుకునేలా మాట్లాడుతాడు.

కొమ్మపై కోయిలా కోయంటదే

రాగతనమో యేమొ బాగువోగెరుగదే

కోకిల కూతను అనుకరిస్తూ గొంతెత్తి పాడాను. ఏకాంతమైన ప్రదేశంలో మామిడి పూలపరిమళంలో మందానిల సంచారంలో నా పాట దిక్కులకు వ్యాపించింది.

పాట ముగిసేవరకూ నేను ఏ గంధర్వలోకంలోనో ఉన్నాను. భువికి తిరిగి వచ్చిన తరువాత నాకో పదడుగుల దూరంలో, నేల మీద కూర్చున్న రామదాసు కనిపించాడు. అతను నావేపు వీపుంచి కూర్చున్నాడు. నాకొక్కటే సంగతి తెలుసు, అతనికేమీ వినపడదని. కాని, కూర్చున్న తీరును చూస్తే, అతను పాటవింటున్నాడని స్పష్టమయింది. అతను ఒళ్లు మరచినట్లు కనిపించాడు.

"రామదాసూ" కొంచెం గట్టిగా పిలిచాను.

అతను ముఖం తిప్పి నావేపు చూశాడు.

"ఇలారా!"

ఏ సంజ్ఞ చేయకుండానే నా దగ్గిరికి వచ్చి నిలబడ్డాడు.

"నీకు బాగా వినపడుతోందా? "

అవునన్నట్లు తల ఊపాడు.

"ఎన్నాళ్లబట్టి వినిపిస్తోంది? "

సంజ్ఞలు చేశాడు, ఒక నెల్లాళ్లనుంచి అని.

"ఈ సంగతి ఎవరికేనా తెలుసా? "

తెలియదన్నట్లు తల ఊపాడు.

"మా అన్నయ్యా వాళ్లతో ఆముదాలవలస వరకూ వెళ్లావుకదా, వాళ్ల మాటలు వినగలిగావా? "

రామదాసు నా కళ్లలోకి చూశాడు. అవ్యక్తమైన బాధ అతని చూపులలో తోచింది. చాలా వినరాని సంగతులు విన్నట్లు, నా మేలు కోసం వాటిని చెప్పకూడదన్నట్లు సంజ్ఞలు చేశాడు.

సాయంకాలం చాలా రమ్యంగా ఉంది. మనసు ఏ నందనవనంలోనో విహరించుతున్నది. ఇటువంటి సమయాన్ని పాడు ఆలోచనలతో మలినం చేయవద్దన్నట్లు రామదాసు చూపులలో చదువుకున్నాను.

"రామదాసూ! నా పాట విన్నావుకదా, ఎలా ఉంది? "

అతని కళ్లలో ఆనందాశ్రువులు కారాయి. వాటిని తువాలుతో తుడుచుకున్నాడు. అంత చక్కని పాట ఇంతవరకూ వినలేదని సంజ్ఞ చేశాడు. ఆ మనిషికి మాటలొస్తే ఎంత బాగుండేది!

ఇద్దరం ఇంటివేపు నడిచాం.

దారిలో నారాయడు కనిపించాడు. ఆవు పొర్లు కొచ్చే సమయం. శ్రీకాకుళం పశువుల ఆస్పత్రినుండి కాంపౌండరును పిలుచుకురమ్మన్నాను. మేలురకం పశువుల ఉత్పత్తికి ఇంజక్షన్లు పరిపాటి అయ్యాయి.

ప్రస్తుతం కాంపౌండరుకు తీరికలేదు. ఆవునే అక్కడికి తోలుకు రమ్మన్నాడు. సూర్యోదయానికి పూర్వమే నారాయడు, రామదాసు ఆవును తోలుకు పోడానికి ఏర్పాట్లు జరిగాయి.

ఆవును తోలుకుపోడంలో ఆలస్యం జరగలేదు. కాని, ఆవుమాత్రం పదిగంటలయ్యేసరికి ఇంటికి తిరిగి వచ్చింది. మా ఊరికో ఆబోతుంది. అది దారిలో అడ్డుకుంది. ఇద్దరు మొనగాళ్లను ముప్పుతిప్పులు పెట్టింది. ఆవును సాలలో కట్టి పెరటి తలుపులు మూసినా అది వెళ్ళిపోలేదు. తలుపు వెలుపల కాపలా కాస్తూనే వుంది.

ఈ ఆవుకి కూడా బుద్ధిలేదు. ఆబోతు కోసం అది కూడా వెర్రులెత్తుతోంది. మంచి జెర్సీ పెయ్యకోసం ఇంజక్షనిప్పించాలని ప్రయత్నం చేస్తే ఊరి ఆబోతు అడ్డుపడి తన హక్కులను వినియోగించుకోవాలని నిశ్చయించుకుంది. ఏదారిని వెళ్లినా ఆబోతు అడ్డుపడింది. మరేం చేయడానికి తోచలేదు.

ఆ రాత్రి నా మనసు చాలా ఉల్లాసంగా ఉంది. తోటలో నిన్న నేను పాడడం, నా గానాన్ని మరో హృదయమున్న వ్యక్తి విని ఆనందించడం అనుకోకుండా జరిగాయి. కొన్ని సంవత్సరాలయి మూగవోయిన నా గొంతు మళ్లీ విచ్చుకుంది. కాని, నేనెక్కడ పాడుకోను? వినేవాడు ఒకడు దొరికినా అన్ని చోట్లూ పాడుకోడానికి యోగ్యంగా లేకుండా పోయాయి. ఆశనిరాశల మధ్య ఆ రాత్రి నిద్రపోయాను.

ఉదయంలేచి చూద్దునా, పెరడంతా భీభత్సంగా ఉంది. ఆబోతు ఏరాత్రో నామమాత్రానికున్న పెరటి తలుపును పొడిచి విరిచేసి లోపలికి ప్రవేశించింది.

పెరడల్లా అది పాడుచేసినందుకు నాకు చాలా కోపం వచ్చింది. పాదులన్నీ తొక్కేసింది, ముళ్లను కలిపివేసింది. పెరటి తలుపువేసి దానిని బయట ఉంచామని అది కసి తీర్చుకుంది. నాకు ఏమిచేయడానికి తోచలేదు. ఆవు కూడా ఆబోతుతో సఖ్యం చేసుకుంది. దగ్గరగా నిలబడ్డ ఆబోతును అనురాగంతో నాకుతోంది.

ఆబోతు రెండురోజులు మా పెరటిలో కాపురంచేసి తన దారిన వెళ్లిపోయింది. ఇంట్లో ఉన్న ముగ్గురిలో ఒకరు పెరట్లో ఉండక తప్పిందికాదు. రాత్రి నారాయడు పెరటికి కాపలా కాసేవాడు.

ఆబోతు వెళ్లి పోయిన తరువాత నారాయడు, రామదాసు పెరటి తలుపు బాగుచేశారు. మర్నాటినుండి పెరడు మళ్లా బాగు చేస్తానని రామదాసు ధైర్యం చెప్పాడు.

ఆవుపాలు మరి పితకడంలేదు. పెయ్యినుకూడా అది రానియ్యలేదు.

రెండు రాత్రులయి నాకు నిద్ర సరిగా లేదు. ఆబోతు వెళ్లిపోయిన నాటిరాత్రి భోజనం చేసి వేగంగా పడుకున్నాను. అర్ధరాత్రి ఒక్కసారిగా తెలివి వచ్చింది. నా శరీరమంతా చెమటతో నిండిపోయింది. ఏ పీడకలనయితే నేను తప్పించుకోవాలని కోరుకుంటానో అది నన్ను విడువకుండా వెంటాడుతున్నది.

అందుకే రెండవ గాలివాన అంటే నాకంత భయం.

భయందేనికని మనసు సమాధానపరచుకుంటాను.



**నా**కు పదకొండేళ్ళు వచ్చినప్పుడు మా అక్కయ్యకి పెళ్లయింది. మాబావ ఒడ్డూ, పొడుగూ ఉండేవాడు. మా అక్కయ్య బంగారం బొమ్మ. మా బావ చామనఛాయలో ఉండేవాడు, ఎప్పుడూ నవ్వుతూ ఉండేవాడు. ఆరోజుల్లో బియ్యే పాసయ్యాడు. మంచి రైల్వే ఉద్యోగం. కానీ కట్నం పుచ్చుకోలేదు. అయితేనేం పెళ్లి ఖర్చులకని మానాన్న ఉన్న ఎకరంపొలం అమ్మేశాడు. అంతేకాకుండా జబ్బుపడి మంచమెక్కాడు. మా అక్కయ్యను కాపురానికి పంపిన తరువాత మా యిల్లు అయ్యవారి నట్టిల్లయింది. మా అన్నయ్య ఎందుకూ పనికిరానివాడు. మూడుపూటలా సుష్టుగా భోజనం చెయ్యడం తప్ప మరే ఉద్యోగం లేనివాడు.

ఇల్లుగడవటం చాలా కష్టంగా ఉండేది. మా అమ్మవంటి మీద బంగారమమ్మి ఎన్నాళ్లు బతకగలం? మానాన్నకు సరియైన వైద్యంకూడా చేయించలేదని మా అమ్మ వాపోయింది. ఒకరోజు మా వీధిలోనే రెండిళ్లకు అవతలున్న మీనాక్షిగారు మానాన్నను చూడడానికి వచ్చారు. మా పరిస్థితిని క్షణంలో గుర్తించి ఆమె అన్నారు.

"కాంతమ్మ వదినా! నేను నీకు ఎరుగని దాననా? ఏదో దూరపు బంధుత్వం మాట విడిచిపెట్టు, మనం చిన్నప్పటినుంచీ కలిసి పెరిగాం కదా! మా అన్నయ్య ఇంత హీన స్థితిలో ఉన్నాడని నాకు తెలియదు. మాది లంకంత యిల్లు. నేను, బుచ్చన్న మాత్రమే అందులో ఉంటున్నాం కదా! పెరటివేపు మూడుగదులు, వంటకో కొట్టు ఉన్నాయి. మొన్ననే మరమ్మత్తులు చేయించి సున్నాలు వేయించాను. రేపే మంచిరోజు. అందరూ వచ్చేయండి"

మానాన్నకోసం మా అమ్మ యిల్లు మారడానికి అంగీకరించింది. పెరటివేపు గదిలో, మంచి గాలి కిటికీలోంచి వచ్చేచోట మా నాన్నకు మంచం వేశాం. మీనాక్షిగారికి పాడికి, పంటకు లోటులేదు. పెరడు పెద్దది. కాయగూరలు బాగా పండేవి.

ఆనాటినుండీ దారిద్ర్యం మాకు దూరమయింది.

మా అన్నయ్య మీనాక్షత్తగారి పనులు చేస్తూ ఉండేవాడు. ఆవిడ నిత్యం మా మంచిచెడ్డలు చూసేది. మంచి వైద్యుడిని పిలిపించి మానాన్నకు చికిత్స చేయించింది. అప్పటికే మా నాన్నకు రోగం బాగా ముదిరింది. పథ్యం, పానం, విశ్రాంతి, ఔషధం

మొదలైనవాటికి లోపంలేకుండా అన్ని ప్రయత్నాలు చేశాం. అతనికి చాలాకాలం బెంగ ఉండేది తన తరువాత కుటుంబాన్ని ఎవరు చూస్తారని అతను విచారించేవాడు. మా మీనాక్షత్త ధర్మమా అని అతని మనసులోని ఆందోళన తొలగిపోయింది. ఒక మంచిరోజున ప్రశాంతంగా కన్నుమూశాడు. ఎవరికీ మమ్మల్ని అప్పగించలేదు.

మానాన్న పోయేటప్పటికి నాకు పన్నెండేళ్లు. టెలిగ్రాం అందగానే మా బావ, అక్కయ్య వచ్చారు. దినవారాలకి మాబావ ఖర్చులన్నీ పెట్టాడు. మా ముగ్గురిని తనతో రమ్మని బలవంతం చేశాడు. అప్పుడు వెళ్లిపోవడం దేనికని, కొన్నాళ్లయిన తరువాత పంపిస్తానని మీనాక్షత్త బావతో చెప్పింది. మా అమ్మకూడా మా బావగారి యింట ఉండడానికి అంత మొగ్గలేదు.

మానాన్నకు మాసికాలు పెట్టడంనుంచి, సంవత్సరీకాల వరకు ఏలోటు లేకుండా మా మీనాక్షత్తే జరిపించింది. దానాలు, ధర్మాలు, సమారాధనలు అన్నీ సవ్యంగా చేయించింది. అపుడు కూడా మాబావ కాపురం ఎత్తివేసి మమ్మల్ని తన దగ్గిరికి రమ్మన్నాడు. అదిమాత్రం కుదరలేదు.

మా అన్నయ్య భూములమీదికి వెళ్లివచ్చేవాడు. మా అమ్మ వంటలో సహాయంచేసేది. నేను యిల్లు చక్కదిద్దుకోవడం, మా అత్తకు కుడిభుజంగా ఉండడం చేసేదానిని. నాకు జడవెయ్యడం, సంగీతం చెప్పించడం, ఇంటి వ్యవహారాల గురించి చెప్పడం మా అత్త చేస్తూ ఉండేది.

మా అత్తకు పుట్టింటివాళ్లెవరూ లేరు. అత్తింటివాళ్లు అంతకన్నా లేరు. ఉన్న ఒక్క కొడుకు జడ్డివాడు. సరిగా బట్టలుకూడా కట్టుకోలేడు. ఇష్టమయితే తినేవాడు, లేకపోతే తిండికి వచ్చేవాడే కాడు. మాఅత్తే వాడికి స్నానం చేయించడం, బట్టలు తొడగడం కూడా చేసేది. పనివాళ్లమీద ఆమెకు నమ్మకంలేదు. కొడుకు కింద ఒకగంటపని తప్ప, మిగిలిన కాలమంతా ఆమె మాతోనే గడిపేది. ముఖ్యంగా నాతోనే పొద్దుపుచ్చేది. అంత అభిమానం నామీద పెంచుకుంది. తాను చేయదలచుకున్న మంచి పనులన్నిటితోను నాకు సంబంధం ఏర్పరచింది.

నేను పదమూడో యేటనే పెద్దమనిషినయాను. పధ్నాలుగో యేటికి చాలా యేపుగా పెరిగాను. కొన్నాళ్ళు పైట, పరికిణీ వేసుకున్నా, చీరలు కట్టుకునే వయసు వచ్చిందని మా అత్త మురిసిపోయింది. ఒకనాడు నాకు జడవేస్తూ మా అత్త అసలు విషయం ప్రస్తావించింది.

"అమ్మడూ! నేను చాలాకాలమయి నీతో ఒకవిషయం చెప్పాలని అనుకుంటున్నాను. ముందు నీతో మాట్లాడిన తరువాత అమ్మతో చెప్పాలని నా అభిప్రాయం. నీ దగ్గిర నేను ఏ రహస్యం దాచదలచుకోలేదు. నువ్వు చాలా వివేకంగల పిల్లవి. నాకు ప్రపంచంలో జడ్డిబుచ్చన్న కన్నా హెచ్చు ఎవరూలేరు. నాకు శక్తి ఉన్నంతకాలం వాడికేలోటు రానీయను. కాని నేను శాశ్వతం కాదుకదా! నా అనంతరం వాడి గతి ఏమిటని భయపడతాను. తల్లి తరువాత తల్లివలె చూసుకోవలసింది భార్య. మావాడిని అర్థంచేసుకొని సపర్యలు చేయాలి. నా డబ్బుకి, సపర్యలకు ఏ విధమైన సంబంధం ఉండకూడదు. మానవత్వం దృష్టితో వ్యవహరించాలి. ఇన్ని మంచిగుణాలు ఒకరియందే ఉండడం చాలా అరుదు. నేను చాలామంది ఆడపిల్లలను చూశాను. కానీ, ఎవరూకూడా నా ఎన్నికకు నిలవలేదు. నువ్వు అన్నివిధాలా చాలా ఉన్నతమైన స్థానంలో ఉన్నదానివి.

నీకు జీవితం మీద ఎటువంటి అభిప్రాయాలున్నవో నాకు తెలియదు. సంగీతం, సాహిత్యం తెలిసినదానివి. చక్కదనంలో

# ఏరిన ముత్యాలు

★ తరువాత చేయబోయే కార్యమేమిటో తెలుసుకొనడమే వివేకం. దానిని ఎలా చేయాలో తెలుసుకొనడమే నైపుణ్యం. దానిని పూర్తి చేయడమే సద్గుణం

-డి.యస్.గోర్డన్

★ పుస్తకాలు అలంకరణ కోసం రాయబడలేదు. కానీ పుస్తకాలంత అందంగా ఇంటిని అలంకరించే సామాగ్రి మరొకటిలేదు

-హెన్రీబీచర్

★ గొప్ప త్యాగాలు చేసినపుడే గొప్ప పనులు సాధించబడతాయి

-వివేకానంద

★ పఠనం వలన మానవుడు పరిపూర్ణుడవుతాడు

-బేకన్

★ దేశసంపదకు, సంస్కృతికీ మూలస్థంభం రైతే

-డానియల్ వెబ్‌స్టర్

★ మన పొలాలే మనస్వర్గం

-నెహ్రూ

★ ఒక గేయం రాయడంలో ఎంత గౌరవమున్నదో పొలాన్ని దున్నడంలో అంతే గౌరవమున్నదని గుర్తించని జాతి పురోగతి పొందలేదు

-వాషింగ్‌టన్

★ ఎక్కడ కాయకష్టం హీనంగా చూడబడుతుందో అక్కడ ఫలితం స్థబ్దత, క్షీణత, మృత్యువు

-స్వామిరామతీర్థ

★ రైతులు మానవ నాగరికత నిర్మాతలు

-వెబ్‌స్టర్

★ రైతులు భూలోక స్వర్గమునకు వారసులు

-గాంధీజీ

★ ఉత్సాహం లేకుండా ఇంతవరకూ ఎవరూ గొప్ప కార్యాలు సాధించలేదు

-ఎమర్సన్

★ మనిషి ఎలాంటివాడో హృదయంవల్లనేకాదు ముఖంలోనూ తెలుస్తుంది

-జార్జ్‌మాక్డోనాల్డ్

★ కృత్రిమ కళాసౌందర్యం వేశ్యవంటిది

-టాల్‌స్టాయ్

★ కష్టాలను తప్పించుకొనే వాళ్లు కాదు వాటిని అధిగమించేవాళ్లు గొప్పవాళ్లు

-రూజ్‌వెల్ట్

సేకరణ : షేక్ సాధిక్ షా




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర' ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూలై చతుర నవల వాన–వరద

.................................................................

సమీక్షకుని పేరు : .................................................................

చిరునామా: .................................................................

.................................................................

.................................................................

.................................................................

నీకు సాటి ఎవరు? నువ్వు నా బుచ్చన్నను జాగ్రత్తగా చూసుకుంటున్నావు. నీమీద ఉన్న అభిమానమో, మానవ సహజమైన కరుణో నిస్వార్థంగా నువ్వు వాడి పరిరక్షణకు నడుం కట్టావు. వాడి సంరక్షకురాలిగా నిన్ను కోరడం నావంటి కన్నతల్లి కోరుకునే వరం"

మా అత్త కళ్లు తుడుచుకుంది. నాకు జవాబు చెప్పడానికి ఏముంది? నేను అందమైనదానినని, సంగీత సాహిత్యాలు వచ్చునని, మంచి తెలివితేటలున్నదానినని నాకు ఎప్పుడూ అనిపించలేదు. బుచ్చన్న నా పరిచర్యకు అలవాటు పడుతున్నాడు. ఏదోరోజు పెళ్లిచేసుకొని వెళ్లిపోయేదాకా అతనికి ఏలోటు రాకుండా చూడాలని అనుకున్నాను. మా అత్తమాటలలో నిజం గ్రహించాను. ఆమె మా కుటుంబానికి చేసిన ఉపకారం ఎలా మరచిపోగలను!

"నారాయణీ! నా మాటలన్నీ మరచిపో బంగారంవంటి నిన్ను జడ్డివానికి కట్టబెట్టడం కన్నా పాపముందా?"

"అత్తా! ఎంత ఆలోచించినా ఈ సమస్యకు పరిష్కారమార్గం కనిపించడంలేదు. బుచ్చన్న జడ్డివాడు కావచ్చు కాని, చెడ్డవాడు కాదు. అయితేనేం, స్వతంత్రంగా ఈ ప్రపంచంలో నెగ్గుకురాలేడు. ఎవరో అతని వెనక ఉండాలి. నేనుకాని, ఎవరైనాకానీ, మహత్తరమైన త్యాగం చెయ్యాలి"

మా అత్త కొంచెంసేపటి తరువాత అంది.

'నారాయణీ! బుచ్చన్నవల్ల కడుపుపండితే, నువ్వు చేసిన త్యాగం సఫలమవుతుంది. మాతృత్వంకన్నా స్త్రీ జన్మకు పరమార్థం లేదుకదా!'

ఆవిడ మాటలు చాలా ఉదాత్తంగా ఉన్నాయి. సంపద ఎరజూపి నన్నావిడ కొనుక్కోదలచలేదు. రెండురోజులు ఆలోచించి, బుచ్చన్న బతుకుకోసం ఆమె ప్రతిపాదనను నేను అంగీకరించాను.

మీనాక్షత్త మరోవారం రోజుల తరువాత మా అమ్మతో ఈ సంగతి చెప్పింది. ఆమె ఏమీ జవాబు చెప్పలేదు. మా అన్నయ్యకు ఈ విషయం తెలిసింది. ఎగిరి గంతేశాడు. మా అక్కయ్యకి, బావకి మా అమ్మ ఉత్తరం వ్రాసింది. వాళ్ళు చీవాట్లు పెడుతూ, నా గొంతుక కోయవద్దని జవాబు వ్రాశారు.

కానీ, నేనొక నిశ్చయానికి వచ్చిన తరువాత వెనక్కుతిరిగే ప్రసక్తిలేదు. ముహూర్తం పెట్టమని మా అమ్మతోను, అత్తతోను చెప్పాను. శుభలేఖలు పంపి మా అక్కను, బావను పెళ్లికి వారంరోజులు ముందు రావలసిందని ఉత్తరం వ్రాయించాను.

మా అక్క ఏడ్చింది. మా బావ చీవాట్లు పెట్టాడు. నా నిశ్చయం వెనుకనున్న కారణం తెలుసుకొని అతను నిర్విణ్ణుడయ్యాడు.

పెళ్లిలో గొడవ జరిగింది. మంగళస్నానాలు అన్నీ అయి, పీటలమీద కూర్చున్న పెళ్లికొడుకు సరిగా ముహూర్తం వేళకు పక్కకు వెళ్లిపోయాడు. నలుగురు మనుషులు బలవంతం చేసి పెళ్లిపీటలమీద కూర్చోబెట్టినా తలమీద జీలకర్ర, బెల్లం ఉంచడంకాని, తాళికట్టడంకాని చెయ్యలేదు. జడ్డి బుచ్చన్నకు బదులు మాబావే ఈ రెండు పనులు చేశాడు.

పెళ్లయిపోయింది. కార్యం ఎప్పుడో సావకాశంగా జరిపించవచ్చునని పెద్దవాళ్లు అభిప్రాయపడ్డారు. మా అక్క, బావ, వాళ్లఊరు వెళ్లిపోయారు. ఆ యింటికి ఆ విధంగా నేను యజమానురాలినయ్యాను. ఆ మహా సంపదకు వారసురాలినయ్యాను.

మాఅత్త నాకు ఇంటి ఆస్తులు అప్పజెప్పే సరికి నూరుతులాల బంగారం, రెండువేల తులాల వెండి, ఏభై ఎకరాల పల్లపుభూములు, పట్టణంలో మెయిన్‌రోడ్డుమీద

చాలా పెద్ద మేడ, బాంకులో కొన్నివేల రూపాయలు, బీరువాలలో పట్టుచీరలు, రంగంటేకుతో చేసిన పందిరిమంచాలు, ఇలా ఎన్నో ఎన్నో ఉన్నాయి. నన్ను ఎవరూ అదృష్టవంతురాలునని అనలేదు. మా అమ్మను, అన్నయ్యను అన్నారు. నావంటి కోడలు దొరికినందుకు మా అత్తను కొనియాడారు. జడ్డిబుచ్చన్నను చూసి కొంతమంది యువకులు ఈర్ష్యపొం దారు. కోతికి కొబ్బరికాయ దొరికిందని ఎగ తాళి చేశారు. అసలే జడ్డివాడేమో, ఆ మాటలు విని అతను మరీ ఉడుక్కునే వాడు.

పెళ్లయిన తరువాత నా అంతస్తులో మార్పు వచ్చిందేమో గానీ నా పనులలో మాత్రం మార్పు రాలేదు. మా అత్త ఇంకా నిర్విచారంగా, ఏదో పెద్ద బరువు తలనుండి దింపుకున్నట్లు హాయిగా ఇంట్లో మెదలజొ చ్చింది. మా అమ్మ, అత్త ఏవో మాట్లాడుకో వడం, మా అన్నయ్య మా ఎస్టేటుకి మేనే జరువలె ప్రవర్తించడం అమలులోకి వచ్చాయి.

మా అత్తయ్య ఒక్కమాట అంది. ఏదో రోజు నాకడుపు పండితే నాకు మరే విచారం ఉండదని, ఇలా అనుకుంటుండ గానే ఒక సంవత్సరం తిరిగిపోయింది. నాకు పదహారో యేడు వచ్చింది. రోజుకొక పట్టుచీర కట్టుకున్నా బీరువాలనిండా ఇంకా కొత్త చీరలే. సిరిసంపదలు పాలు పొంగి నట్లు పొంగుతున్నాయని మా అత్త ఎప్పుడూ నన్ను చూసి అనేది.

నా కార్యానికి ముహూర్తం పెట్టి వారం రోజులముందే మా అక్కయ్యను తీసుకొని రావలసిందని మా బావకి ఉత్తరం వ్రాశాం. రాయపూర్ లైనులో రాయగడ దాటిన తరు వాత నాలుగో స్టేషనులో మాబావ పనిచే స్తున్నాడు. ఉత్తరం అందిన వెంటనే అతను సెలవు పెట్టి తప్పకుండా మా అక్కయ్యను తీసుకొస్తాడు. రెండురోజులు గడిచాయి. ముహూర్తం ఇంకా అయిదురోజులే ఉంది. వాళ్లు రాలేదు. ఎందుకు రాలేదో తెలియ లేదు. మర్నాడు వైరిప్పించాము. ఆ టెలిగ్రా ముకుకూడా జవాబు దొరకలేదు.

అదేం దురదృష్టమో, ఆకాశం మబ్బుపట్టి చిన్నచిన్న తుంపరలు పడడం మొదల యింది. ఎండన్నది రావడం - మానేసింది. క్రమక్రమంగా ఈదురుగాలులు కూడా వీచడం మొదలయింది. ఆకాశం నల్లటి మేఘాలతో నిండి పగలే చీకటిగా అయింది. వర్షం ఉధృతమయింది.

కార్యంనాటి ఉదయానికి గాలివాన తీవ్ర మయింది. మా అక్కయ్య, బావ రాలేదు. కనీసం ఇరుగుపొరుగువాళ్లని పిలిచి తాంబూలాలు ఇప్పించడానికి కూడా వీలులే కపోయింది. ధారాపాతం వర్షం. కనీసం సాయంకాలం పురోహితుడు వచ్చి విఘ్నేశ్వ రపూజ చేయించడానికి కూడాఅయింది కాదు.

ఏం చేయడం? ఆ రాత్రి ముహూర్తం దాటితే మూఢం వస్తుంది. మూఢం తరు వాత శూన్యమాసాలు. మరో నాలుగు నెల లవరకు దంపతులను కలపడానికి ముహూర్తాలు లేవు.

ఆ రాత్రి ఎనిమిది గంటలకు మా అత్తే విఘ్నేశ్వరపూజ చేయించింది. బుచ్చన్న పీటలమీద కూర్చోడు. ఏం చెయ్యడం అన్నీ నేనే చేశాను. మేడమీద గదిలో శోభనానికి ఏర్పాటుచేశారు.

మా అమ్మా ఏం చెప్పలేదు. మా అత్తా చెప్పలేదు. తలుపులు దగ్గిరగా లాగి వాళ్లు వెళ్లిపోయారు. నేనే తలుపులు వేశాను.

బుచ్చన్న కొద్దిగా గోడదగ్గర నిలబడ్డాడు. కట్టుకున్న కొత్త పంచ జరీ అంచు దీపం వెలుతురులో మెరుస్తోంది. పైన వేసుకున్న కండువా జారిపోతోంది. పెద్ద పందిరి మంచం, ముఖమలు తలగడాలు, బూరుగు

దూది పరుపు, దానిపైన పాల మీగడవంటి దుప్పటి, గోడలకు నిలువెత్తు రవివర్మ చిత్రాలు, ఊదొత్తుల పరిమళం టేబిలు మీద పళ్లు, మిఠాయి.

మంచానికి ఎదురుగా పెద్ద నిలువుటద్ద ముంది. జీవితంలో ఈరాత్రి చాలా మధు రమైంది. దీని జ్ఞాపకాలు బతికున్నన్నాళ్లు మదిలో మెదుల్తూనే ఉంటాయి.

"బుచ్చన్నబావా, రా! మంచంమీద కూర్చో!"

ఆ మనిషి జవాబు చెప్పలేదు. అలా గోడకు అంటుకునే నిలుచున్నాడు. మెల్లిగా

చెయ్యిపట్టుకొని తీసుకొచ్చి మంచంమీద కూర్చోబెట్టాను. అతను ముఖం దించుకునే కూర్చున్నాడు.

"బావా! కార్యంనాడు మొగుడు పెళ్లాన్కి తీయటి మాటలు చెప్పి లోబరుచుకుం టాడు. నువ్వు నాభర్తవి, నా శరీరానికి నువ్వు అధిపతివి. నీకు నేను బిడ్డలను కనాలి. నీకు బిడియం దేనికి? అలా అద్దంలో చూడు. నా పక్కనువ్వు..."

బుచ్చన్న అద్దంలోకి చూడలేదు. నావేపు కూడా చూడలేదు. ఏదేనా పనిచేయమని బతిమాలితే అతనాపని చేయనేచేయడు. రాత్రి మాచేత పరమాన్నం ముట్టించారు కానీ అతను గిన్నెడూ తాగేశాడు. అతని కళ్లలో నిద్రముంచుకొని వస్తున్నది. సాధార ణంగా తిండి తిని రాత్రి తొమ్మిదికే నిద్రపో తాడు. అప్పుడే తొమ్మిదిన్నరయింది. బుచ్చన్న పడుక్కుంటే మళ్లీ ఉదయం ఏడుకే లేస్తాడు.

ఏం చొరవ తీసుకున్నా నేనే ముందుకు రావాలి.

ఏదైనా బుచ్చన్న మగాడు. అతనిలో కామం ఉండి తీరుతుంది. స్త్రీ శరీరాన్ని కొంచెం నిదానించి చూస్తే అతనికి తప్ప కుండా కోరిక కలిగి తీరుతుంది.

కాని దేనికీ తొందరపడకూడదు.

"బుచ్చన్నా, ఈపండు వొలిచిపెట్టమ న్నావా?"

జవాబు లేదు.

"బుచ్చన్నా! నోరు తెరువు. ఈ దూద్ పేడా మన బండారువాళ్ల దుకాణంలో స్పెషల్‌గా చేయించి తెచ్చారు. చిన్నముక్క తిని చూడు"

నా పయ్యెద జారిపోతుంటే, సరిచేసుకో కుండా అతని మీదికి వాలి నోటిలో మిఠాయి పెట్టాను. అది తినలేదు సరికదా, నావంటిమీద ఉమ్మేశాడు.

ఏం చేయడం? నా రవికమీద ఉమ్మేశా డని దానిని తొలగించాను. నా శరీరం నిలు వుటద్దంలో కనిపిస్తోంది. పదహారేళ్ల ప్రాయం. లోకంలోని సౌందర్యమంతా నా శరీరంలోనే ఉందా? అనిపించింది. నేనె ప్పుడూ సాకాంక్షగా నా శరీరాన్ని చూసుకో లేదు. ఇప్పుడు నా అందం నన్ను వెక్కిరి స్తోంది.

చీర పూర్తిగా తీసి మంచం మీద పెట్టాను.

పావడతో, బుచ్చన్న పక్కకు జరిగి అతని భుజాలమీద చేతులు వేసి అన్నాను.

"బుచ్చన్నా! నీకోమంచి కథ చెప్పేదా! అనగా అనగా ఒక రాజకుమారుడుండే వాడు. అతను అడవికి వేటకెళ్లాడు. అక్కడో పదహారేళ్ల రాకుమారిని తోడేళ్లు వేటాడుతు న్నాయి. నువ్వే ఆరాజకుమారుడివనుకో నేను ఆ రాజకుమారిననుకో అప్పుడు నువ్వేం చేస్తావు?"

బుచ్చన్న జవాబు చెప్పలేదు. ఆవలిస్తు న్నాడు. పక్కమీదికి వాలిపోతున్నాడు.

"బుచ్చన్న బావా! ఇవాళ మనిద్దరికి కార్యం. కార్యంనాడు నిద్రపోకూడదు, తెలుసా?"

ఆ మొద్దు వినడంలేదు. నేనేపూర్తిగా కావలించుకొని లేపి కూర్చోబెట్టాలి.

"బావా! పాట పాడనా? కథలంటే నీకిష్టంలేదు"

అతను మాట్లాడితేనా!

క్రమంగా పావడ విడిచి అతనిని బాహువులలో బంధించాను. బుగ్గలమీద ముద్దులు పెట్టుకున్నాను. కితకితలు పెట్టాను. లాలించాను. కవ్వించాను. చల్లని నీళ్లతో కనురెప్పలు రాశాను బుచ్చన్న నిద్ర పోకుండా.

క్షణక్షణానికి నేను వెనుకబడుతున్నాను. నేను సర్వాంగ సుందరినని, ఎటువంటి మగాడైనా నా శరీరాన్ని చూస్తే చలించకుండా ఉండలేడని గర్వించేదానిని. ఈ జడ్డి బుచ్చన్న, నిర్దాక్షిణ్యంగా నా గర్వం అణచివేస్తున్నాడు.

అర్థరాత్రి గడిచిపోయింది.

పైన గాలివాన విజృంభిస్తోంది.

లోపల ఉన్న దీపాలు వెలవెల పోతున్నాయి.

బుచ్చన్న పడుకోవడానికే ప్రయత్నిస్తున్నాడు.

ఇంతవరకూ అతనిని బతిమాలుతూ, బుజ్జగిస్తూ ఒకదారికి తేవడానికి ప్రయత్నం చేశాను. నా ఓరిమి తగ్గిపోతోంది. నేను అపజయం పొందుతానని కలలోకూడా అనుకోలేదు. బుచ్చన్నమీద కోపం ముంచుకొని వచ్చింది. కోళ్లు కూసే వేళయింది. ఆ మనిషి నిర్లిప్తంగా ఉన్నాడు. బలవంతంగా అతని చొక్కా చింపి పారేశాను. కట్టినపంచ తొలగించాను. లోపల డ్రాయరు ముక్కలు చేశాను. అతనిని బలంగా కౌగిలించుకున్నాను.

అప్పుడు నాకో పరమసత్యం గోచరించింది. మతిస్థిమితం లేనివాళ్లలో కొంత మంది మగతనం లేనివారుంటారు. ఈ జడ్డిబుచ్చన్న, ఈ వెర్రి బుచ్చన్న, ఈ పిచ్చి బుచ్చన్న ఆ కోవకు చెందినవాడు.

నేను పూర్తిగా మోసపోయాను. నా బతుకు చేజేతులా నాశనం చేసుకున్నాను. మానవత్వంపేర మా అత్త అల్లిన వలలో చిక్కుకున్నాను. తల మోదుకున్నాను. ఏడ్చాను.

నా జడ్డి మొగుడు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

కిటికీ తలుపుసందులలోంచి గాలి లోనికి ప్రవేశించడానికి తీవ్రమైన ప్రయత్నం చేస్తోంది. ఆ చప్పుళ్ళు అపశ్రుతుల్లా వినిపిస్తున్నాయి. ఆ కిటికీ తలుపులు సరిగా మూసుకోవు. వాటికి కర్ర చిడత మాత్రమే ఉంది. అదికూడా అంతంత మాత్రమే పని చేస్తోంది.

ఒక్కసారి, మహా తీవ్రమైన గాలి పెద్ద శబ్దంతో కిటికీ తలుపులు విరుచుకుంటూ లోపలికి ప్రవేశించింది. దానితో పెనువాన వెంటవచ్చింది. గోడలకు వేలాడదీసిన నిలువెత్తు చిత్రాలు, నిలువుటద్దం నేలమీద పడి పోయాయి. మంచంమీద పడుక్కున్న బుచ్చన్న పెద్ద అరుపు అరిచి మంచం కిందికి దూరిపోయాడు.

నేనేం చేయలేని పరిస్థితి ఎదురయింది. కిటికీ తలుపులు మూసి వర్షాన్ని, గాలిని ఆపే ప్రసక్తే లేదు. తలుపులు విరిగిపోయాయి. పటాలు నేలమీద పడి గాజుపెంకులు గది నిండిపోయాయి.

నేను బుచ్చన్న వలన ఏ సుఖం ఆశించనని, మానవత్వపు దృష్టితో అతనిని కాపాడుకుంటానని మా అత్తకు మాట యిచ్చాను. బుచ్చన్నమీద జాలివేసింది. ఆ చలిగాలిలోను, వర్షంలోను నేను చేయవలసింది ఒకటే పని మిగిలింది. నేను కూడా మంచంకిందికి దూరి వణుకుతున్న నా భర్తను బాహువులలోకి తీసుకున్నాను.

కొద్ది సేపటిలో నా శరీరంలోని వేడికి అతని వణుకు తగ్గింది.

నా ధర్మం ఆవిధంగా నెరవేర్చుకున్నాను.

బాగా వెలుగు వచ్చిన తరువాత నేను బట్టలు వేసుకొని, బుచ్చన్నకు పంచకట్టి, ఇద్దరం కిందికి దిగిపోయాం. ఆవేళ మధ్యాహ్నం మా అత్త నాకు జడవేస్తుంటే నేను దుఃఖం పట్టలేకపోయాను.

"అత్తా! నాకెందుకింత దారుణమైన శిక్ష విధించావు? నా బతుకు నిరర్థకం చేశావు" అన్నాను ఏడుస్తూ.

ఆమె ఒక పావుగంటవరకు జవాబు చెప్ప లేదు. పిమ్మట మెల్లగా అంది.

"నారాయణీ! నా తొలి రాత్రి అనుభవం కూడా అటువంటిదే. నేనూ చాలా ఏడ్చాను. ఒకనాడు నేను స్నానంచేసి తడి బట్టతో వంటింట్లోకి వస్తుంటే మీ మామగారికి నాలో ఏమి కనిపించిందో, మీదపడి బల వంతం చేశారు. పడక గదిలోకి అతనిని తీసుకువెళ్లడం కష్టమయింది. అప్పుడే బుచ్చన్న నా కడుపులో పడ్డాడు. కాబట్టి, నువ్వు నిరాశకు లోనుగాకు. ఆ మంచిరోజు కోసం ఎదురు చూద్దాం"

ఆ రాత్రి నా మొగుడు మా అత్త పక్కనే పడుకున్నాడు. ఒక రాత్రి ఆమె మరో గది లోకి పోతే, నేనా గదిలో జడ్డిబుచ్చన్న పక్కన పడుకున్నాను. నామనసు మట్టిము ద్దయి ఏమీ పనిచేయలేదు. వెంటనే నిద్ర పట్టింది. ఉదయం వేగంగా లేచి రెండో రాత్రి అయిందని అనిపించాను.

అలా చాలా రాత్రిళ్లు గడిచాయి. మా అమ్మ నా గురించి ఆలోచించడం మానే సింది. మా అక్కయ్య వస్తుందేమోనని ఎదురు చూశాను.

మూడు నెలల తరువాత మేము స్టేషను మాస్టరుకు రాసిన ఉత్తరానికి జవాబుగా ఒక కార్డు వచ్చింది. మా అక్కయ్య మూడు నెలలకిందే చనిపోయింది. మా బావ పరా రయ్యాడు.

పరంపరగా వచ్చే కష్టాలకు ఎంతకని బాధపడేది. పగలు వీలులేకపోయినా రాత్రి జడ్డి బుచ్చన్న పక్కన పడుకుని కళ్లు కాయలు కాచేటట్లు ఏడ్చేదానిని.

క్రమంగా నా హృదయం గట్టిపడింది.

అన్ని పనులు యథాక్రమంగా సాగుతు న్నాయి.

ఒక అయిదు సంవత్సరాలు ఈవిధంగా గడిచాయి.

ఏనాడూ బుచ్చన్నకు నన్ను చూసి కోరిక కలగలేదు. మా అత్తయ్య కలలు పండ లేదు. ఆమె మాత్రం ఒకనాడు నిశ్చింతగా కళ్లు మూసింది.

మా అత్తయ్య పోయిన ఆరు నెలల్లోనే మా అన్నయ్యకు పెళ్లయింది. మా అన్న య్యను రైతులందరూ చినబుగతగారని పిలి చేవాళ్లు. చనిపోయిన మా మామయ్యగారు పెదబుగతగారు.

ఒకరోజు కార్తీకమాసంలో ఉదయమే నేను ఏటికి స్నానానికి పోయాను. తిరుగు దలలో ఈశ్వరాలయానికి వెళ్లి ఇంటికి వచ్చే సరికి తొమ్మిదయింది. వీధిలో పెద్దగొడవ జరుగుతోంది. అడుక్కునే బిచ్చగత్తెను బుచ్చన్న కర్ర పట్టుకొని చావబాదాడు. దాని చుట్టూ మనుషులు మూగి ముఖంమీద నీళ్లు జల్లుతున్నారు. చాలా శ్రమ పడ్డ తరువాత అది పదకొండు గంటలకు లేచి కూర్చుంది. అప్పుడు దానిచేతిలో ఓ పాతిక రూపాయలు పెట్టి, ఒడినిండా బియ్యంపోసి పంపేసరికి దేవుడు దిగివచ్చాడు.

ఈమధ్య బుచ్చన్న పరిస్థితి మారిపో యింది. రోజురోజుకీ అతని చూపులు చాలా నిశితమయాయి. ఇంట్లో నాతో ఏమీ అనడు. మిగిలిన వాళ్లను చూసి ముఖం

అదోవిధంగా పెడతాడు. తనలోతానే మాట్లాడుకుంటాడు. తల్లిచాటున పెరిగిన వాడు. ఆమె చనిపోవడంతోనే ఎదగడం మానేశాడు. పోనీ, ఎదిగిన మేరకు స్థిరంగా ఉంటే బాగుండేది.

మరో మూడుసార్లు బుచ్చన్న వీధిని పడ్డాడు. ఇరుగుపొరుగువాళ్లు భయపడి కలెక్టరుగారికి అర్జీ పెట్టుకున్నారు. ఆయన నన్ను పిలిపించి బుచ్చన్నను విశాఖపట్నం పిచ్చాసుపత్రిలో చేర్పిస్తే బాగుపడతాడని, ఒకవేళ బాగుపడకపోయినా అతనివలన మిగిలినవాళ్లకి హాని కలుగదని నచ్చజెప్పారు. కలెక్టరుగారే పోలీసు బందోబస్తు చేశారు.

మా అమ్మ నాతో విశాఖపట్నం వచ్చింది. చినవాల్తేరులో ఓ మంచి ఇల్లు అద్దెకు తీసుకున్నాం. ప్రతిరోజూ బుచ్చన్నను మేము చూసి వచ్చేవాళ్లం.

కొన్ని సంవత్సరాలుగా బుచ్చన్నతోనే దివారాత్రాలు గడుపుతున్నాను. అతనిమీద జాలికానీండి, అభిమానం కానీండి ఏదో ఒకటి నా మనసును బాధిస్తూనే వుంది. ఆస్పత్రి వాళ్ల చేతుల్లో ఆ మనిషి దెబ్బలు తింటుంటే నా హృదయం ద్రవించిపోయేది. బుచ్చన్న మా అత్త బతికున్న రోజుల్లో ఉన్నట్లే సాధువుగా ఉంటే, నా జీవితమంతా అతనిని కంటికి రెప్పవలె చూసుకునేదానిని.

ఇప్పుడేం చెయ్యడం?

పరిస్థితులు చేయిదాటిపోయాయి.

నాకూ, బుచ్చన్నకూ నాలుగేళ్లు తేడా. నాకు ఇరవై నాలుగు, అతనికి ఇరవై ఎనిమిది. ఇరవైఎనిమిదేళ్ల వాడి మేధ పన్నెండేళ్ల కుర్రాడి మేధవరకు ఎదిగింది. మరొక్క రెండుమూడేళ్లలో పదహారేళ్ల కుర్రాడిలో యవ్వనపు కోరికలు కలిగినట్లు బుచ్చన్నలో కూడా కామం మొలకెత్తితే నా కడుపు పండి మా అత్త మాటలు నిజమవుతాయని అనిపించింది. కాని అతని మేధ రోజురోజుకు కుంచించుకుపోతున్నది. తల్లిలోనే అందరినీ చూసుకున్న అతనికి, ఆమె పోవడంతో లోకమే శూన్యమయింది.

మరొక్క ఆరు నెలలలో అతను మరీ కుంగిపోయి చనిపోయాడు.

అతని శరీరాన్ని స్వంత ఇంటికి తెచ్చి ఘనంగా కర్మ జరిపిస్తే కూడా అతడు లేని లోటు తీర్చడం అవదు.

బుచ్చన్న బతికినంతకాలం కనిపించని నలుగురు వారసులు ఒక్కసారి రంగంమీదికివచ్చి, భార్యల మెళ్లల్లో పుస్తెలు తాకట్టు పెట్టి నామీద వారసత్వం దావావేశారు. మా అత్తకు చాలా ముందుచూపుంది. మంచి వ్యవహార జ్ఞానముంది. ఈ ఆస్తి మా మామయ్య పిత్రార్జితంకాదు. మా అత్తకు వాళ్ల అమ్మమ్మ వలన సంక్రమించినది. నా పెళ్లయిన తరువాత ఆమె ఒక వీలునామా రాసింది. ఆమె తదనంతరం ఆస్తి బుచ్చన్నకి బుచ్చన్న తరువాత నాకు చెందాలని ఆమె రాసింది. కోర్టులో వారసులు నిలువలేకపోయారు. ఖర్చులు కూడా లేకుండా దావా కొట్టేశారు.

దావా గెలిచిన తరువాత నేనొక నిశ్చయానికి వచ్చాను. పట్టణంలో కాపురం అచ్చి రాలేదని అనిపించింది. లంకంత ఇల్లు భయంకరమైన జ్ఞాపకాలనే కలిగిస్తున్నది. రైతులు కూడా తెలివి మీరి సరిగా అంబారాలు కొలవడంలేదు. అందుచేత ఇళ్లూ వాకిళ్లూ భూములు అన్నీ అమ్మివేశాను. మా అన్నయ్యకూ, మా అమ్మకు పట్టణం విడిచివెళ్లడం ఏమాత్రం ఇష్టంలేకపోయింది. నేను మాత్రం భీష్మించుకొని ఉండడంచేత వాళ్లేమీ అనలేకపోయారు.

మేము ఇల్లు ఖాళీ చేసేముందు మా అత్తగారి దూరపు చుట్టమొకామె నన్ను చూడడానికి వచ్చారు. మాటల సందర్భంలో ఆమె నాకో రహస్యం చెప్పారు.

"అమ్మడూ, నీతో మీ అత్త చెప్పిందోలేదో ఈ సంగతి. ఒకసారి ఏమయిందనుకున్నావ్! మీ పిచ్చిమామకి నట్టింట్లో పనిచేసుకుంటున్న మీ అత్తమీదికి మనసు పోయింది. మరి ఓర్చుకోలేకపోయాడు. నట్టింట్లోనే దానిమీదపడ్డాడు. ఆడకూతురు అదేంచేస్తుంది. అప్పటికి నీ మొగుడు పన్నెండేళ్లవాడు. నట్టింట్లో తల్లి మీదపడ్డ నాన్నను చూశాడు. దానిని పీక నులిమి చంపుతున్నాడని వాడికి అనిపించింది. మూల నున్న రోకలి తీసుకొని తండ్రి తల మీద మోదాడు. ఈ పిచ్చి వెధవలకి, వెర్రి పీనుగులకి ఏనుగంత బలం. తల వెనుక భాగంలో తగిలిన దెబ్బకు మీ మామ, అత్త ఒంటిమీదే ప్రాణాలు విడిచిపెట్టాడు. ఎంత మంది నోళ్లో మూసి మీ మామయ్యను దహనం చేశారు. నువ్వు చాలా అదృష్టవంతురాలివి. నీ మొగుడి చేతిలో చావలేదు"

నాకు విచారం లేదు. కన్నీళ్లు మరి రాలేదు. పరామర్శకు వచ్చినవాళ్ల ముందు మౌనంగా కూర్చున్నాను. తల చెడినవాళ్ల జాబితాలో చేరి, నాకోరికలను, కలలను అగ్నికి ఆహుతి చేశాను.



బహుశా నాకు అర్ధరాత్రి కాకముందే పీడ కల వచ్చినట్లుంది. అన్నీ తెరమీద ఒకటి తరువాత ఒకటి వచ్చినట్లు జ్ఞాపకాలు వచ్చి, ఏడ్పించి బలహీనమయి, మొండికెత్తిన నన్ను మరేం చేయలేక పారిపోయాయి.

నేను బాగా అలిసిపోయాను. కోళ్లు కూశాయి, దాహం వేసింది. అప్పుడు లేచి మంచినీళ్లు తాగే ఓపిక కూడా లేకపోయింది.

ఎప్పుడు నిద్రపట్టిందో, కలలో చక్కని వాతావరణం మా పెరడు చాలా తేమగా ఉంది. సాలలో మా ఆవుంది. ఆవుపక్కనే, కార్యసాఫల్యం పొందిన తృప్తితో కళ్లు సగం మూతలు పడి, సాధువులాగా ఆబోతునిలుచుంది. ఆవు చాలా ఆత్మీయతతో ( నాకు తెలీదు పశువులు ఒకటి నొకటి ప్రేమిస్తాయని) ఆబోతుని నాకుతోంది. అలా చూస్తుంటే ఆవు ముఖంలో మార్పు వచ్చింది. శరీరమంతా పశువుదే. కాని, దాని ముఖం నాదే. అలా ఆబోతు ముఖం వేపు చూస్తున్నాను. ఆ ముఖంలో కూడా మార్పు వచ్చింది. అది రామదాసు ముఖం.

ఒక్కసారి నాకు తెలివి వచ్చింది.

భళ్లున తెల్లవారింది.

మా అమ్మ అంతకుముందే లేచినట్లుంది.

పెరట్లోకి వెళ్లాను. రామదాసు మొక్కలలో పనిచేస్తున్నాడు. మా అమ్మ వీధి గుమ్మం కడిగి ముగ్గులు పెట్టడానికి వెళ్లింది. రామదాసు వీపు నాకు కనబడుతోంది. అతని జబ్బలు కాయకష్టంవలన కండలు తిరిగి ఉన్నాయి. అతని వీపు, పైభాగంలో చాలా విశాలంగా ఉండి, నడుము దగ్గిర సన్నబడింది. అతను తలకు గావంచా చుట్టుకున్నాడు. చాలా చురుకుగా పనిచేస్తున్నాడు.

ఇంతలో మా అమ్మ పెరటిలోకి వచ్చింది.

"నేను స్నానం చేసి మడి కట్టుకుంటాను.

నువ్వు వంకాయలు కోసి తెస్తావా, లేక రామదాసుతో చెప్పి కోయిస్తావా? " అంది మా అమ్మ.

తొందరగా పళ్లు తోమడం ముగించి, ముఖం కడుక్కొని, బుట్ట పట్టుకొని వంకాయలు, పచ్చిమిరపకాయలు కోయడానికి వచ్చాను.

రామదాసుకు చాలా దగ్గిరలో ఉన్న చెట్టు నుండి వంకాయలు కోస్తూ ఉంటే అతని శరీరం నుండి ఏదో వాసన వచ్చి నేను మత్తెక్కిపోయాను. ఇంకా కొంచెం వంగితే అతని దృఢమైన చేతులకు నా శరీరం తగిలి పులకలు లేచాయి.

తొందరగా అక్కడనుండి తప్పుకున్నాను. మా అమ్మ మళ్లా పెరట్లోకి బియ్యం కడగడానికి వచ్చింది.

రామదాసు ఏమీ గుర్తించినట్లు లేడు.

ఇదేదో కొత్త అనుభూతి.

మధ్యాహ్నం భోజనాలవేళ, నేనే రామదాసుకి వడ్డన చేశాను. అతను యథాప్రకారం తడిగావంచా కట్టుకున్నాడు. నుదుట కుంకుమ పెట్టుకున్నాడు. అతని ఫాలం చాలా వెడల్పుగా ఉంది. కళ్లు విశాలంగా ఉన్నాయి. వక్షం చూడచక్కగా ఉంది.

వడ్డన చేస్తూ, రోజూ వేసే కూరకన్న మరికొంచెం హెచ్చువేశాను. అతను తలెత్తి నాకళ్లలోకి చూశాడు.

"రామదాసూ, నువ్వు కష్టపడి పండించిన వంకాయలివి. మా అమ్మ ఈ కూర వండడంలో చాలా పేరు పొందింది. నీకీ కూర చాలా యిష్టం. కాబట్టి మనసుతీరా తిను" అన్నాను.

రామదాసు అడిగి వేయించుకొని, తినడం నేను చూడలేదు. రోజూ మజ్జిగ పోసేవాళ్లం. ఇవాళ పెరుగువేశాను. ఉన్నవాళ్లం ముగ్గురం. పొద్దుట రెండుశేర్లు, రాత్రి రెండుశేర్లు పాలు పోయించుకుంటున్నాం. ఆవుండేటప్పుడు ఇంకా హెచ్చే ఇచ్చేది. మా జ్ఞాతుల కుటుంబాలన్నీ మజ్జిగ కోసం మామీదే ఆధారపడ్డాయి. ఆవును మేతకు పంపించిన తరువాత గురవయ్య పాలు పోస్తున్నాడు. వాడికి మూడావులున్నాయి. నెలకో రెండు పుట్ల ధాన్యం పాలకోసమని వాడికి కొలుస్తున్నాము. నమ్మకంగా పొదుగు దగ్గిర పాలే వాడు పోస్తున్నాడు. వాటిలో ఒకటి తరిపి ఆవు ఉందికాబోలు, పాలు చిక్కగా వుండి మంచి వెన్న వస్తున్నది.

దినం విడిచి దినం మీగడలు తిప్పి వెన్న చేయడం మా వదినవంతు. వదిన వెళ్లిపోయిన దగ్గిర నుంచీ రామదాసే వెన్న కూడా తీస్తున్నాడు. మా వదిన తీసిన దానికి రెండు రెట్లు వెన్న వస్తున్నది. వైద్యులు సీతారామయ్యగారి ఔషధాలలోకి, మా జ్ఞాతులకు, కాచిన ఆవునేయి కూడా పంచేవాళ్లం.

ఒకరోజు మధ్యాహ్నం పెరుగువేసేటప్పుడు, మా అమ్మ చూడకుండా రామదాసుకి ఇంత పెరుగు మీద మీగడ పడేశాను. అతను నావంక తలెత్తి చూడలేదు. అతని ముఖం కొంచెం కదిలి కృతజ్ఞత చెప్పుకుంది.

ఆ రాత్రి పడుకుంటే ఎంతకీ నిద్రపట్టలేదు. రోజురోజుకీ నాకు రామదాసుపట్ల శ్రద్ధ అధికమవుతున్నది. అతడు దేనికీ బయటపడకపోయినా, మా అమ్మ మాత్రం ఒక కంట నన్ను కనిపెడుతూనే వుంది.

క్రమక్రమంగా రామదాసుకి పనులు హెచ్చయ్యాయి. ఇంట్లో పక్కలమీద వేసిన దుప్పట్లు, ఒక్కొక్కపుడు బొంతలు, మా అమ్మ చీరలు అతను ఏటికి తీసుకుపోయి ఉతికి తెస్తున్నాడు. రోజూ విధిగా మా అమ్మ పక్క దులిపి, దుప్పటీ సరిచేస్తున్నాడు. ఏదో కారణంచేత నా పక్క

మాత్రం ముట్టుకునేవాడుకాదు. ఒకప్పుడు దుప్పటీ మార్చవలసి వచ్చినా, మడత దుప్పటీ నామంచం మీద ఉంచేవాడుకాని, చొరవ తీసుకొని మార్చేవాడుకాదు.

మామిడితోట చూడడానికి మరో పదిరోజుల తరువాత వెళ్లాను. నాతో నారాయడు వచ్చాడు. రామదాసుని కూడా రమ్మన్నాను. కాని, అతను ఎందుచేతనో రాలేదు. నేను లేనప్పుడు మా చుట్టాలు మా అమ్మను చూడడానికి వచ్చారు. రామదాసు నేను ఇంట్లోలేని లోటును రాకుండా చూసుకున్నాడు. వచ్చిన పెద్దవాళ్లకి మర్యాదలు చేయడానికి మా అమ్మకు చాలా సాయపడ్డాడు. ఊళ్లోకి ఎవరు వచ్చేవారో, ఎవరు వెళ్లేవారో రామదాసుకి లెక్కే. అతను చాలా విషయాలు ఇట్టే గ్రహిస్తాడు. నేను ఇంటికి వచ్చేసరికి మా చుట్టాలందరూ ఉన్నారు. ఒకవేళ నేనే రామదాసుని నావెంట తోటకు తీసుకుపోయి, అతనితో తిరిగి వస్తే, మా చుట్టాలు ముక్కులమీద వేళ్లువేసుకొని, బుగ్గలు నొక్కుకొని, పదివిధాలుగా కల్పించి నాకు, రామదాసుకి రంకులు కట్టేవారు.

ఉన్నట్టుండి మా అమ్మకు అతిసారం పట్టుకుంది. చాలా నియమబద్ధమైన జీవితం ఆమెది. రెండు రోజులలో విరోచనాలు తగ్గుతాయని అనుకున్నాం. కాని రోజురోజుకి ఆమె క్షీణించసాగింది. మరి ఆలోచించకుండా వైద్యులు సీతారామయ్యగారిని పిలిపించాను. ఆయన పరీక్ష చేసి మందులిచ్చారు. విరోచనాలు కట్టాయి. కాని చాలా నీరసించి ఆమె లేవలేకపోయింది. మంచం పట్టింది. రామదాసు మా అమ్మకు చాలా సేవ చేశాడు. మా అన్నయ్య కూడా అంత ఓర్పుతో ఆమెకింత పాటుబడేవాడుకాదు. మందులు వేడిచేశాయేమో, వారం రోజులయేసరికి మా అమ్మకు రాత్రి పూట నిద్ర పట్టడం మానేసింది. సీతారామయ్యగారితో ఈ సంగతి చెప్తే ఆయన స్వయంగా వచ్చి రోగిని పరీక్షచేశారు. ఆహార విహారాల్లో కొంచెం శ్రద్ధ పడితే చాలునన్నారు. అంతకుమించి మరి మందు లక్కరలేదన్నారు. ఆమెకు వయసు అరవై దాటింది. అందుచేత నిద్ర సరిగా ఉండదన్నారు. అంతగా నిద్రపట్టకపోతే చిన్న సులువుందిగాని, అది అలవాటయితే మరి మాన్పించలేమన్నారు. రెండుమూడు రాత్రులు ఆమె ఏ మందులు ఇవ్వకుండా నిద్రపోతుందేమోనని చూశాను. ఆమెకు నిద్రపట్టలేదు. ఆమెతోపాటు నాకూ నిద్ర లేకుండా పోయింది. ఉదయమయేసరికి ఆమె చాలా నీరసపడేది. నేను ఆలస్యంగా లేచి ఇంటి పనులలో సర్దుకునేసరికి జాము పొద్దెక్కేది

ఆ నిద్ర మందు మరేదీకాదు. మినపబద్దంత ప్రమాణంలో నల్లమందు వేస్తే ఆమెకు హాయిగా నిద్రపట్టింది. దానితోపాటు ఒక గ్లాసునిండా పాలు కూడా తాగించాలి. పాలలో చాలా పంచదార వెయ్యాలి. ఈ విధంగా రోజూ రాత్రిపూట చేయడంవలన ఆమెతోబాటు నేనూ హాయిగా నిద్రపోయి ఇంటిపనులు మామూలుగా చేసుకోడానికి అనుకూలించింది.

మా అన్నయ్య వాళ్లు యాత్రలకు పోయి ఇరవైరోజులయింది. వాళ్లు మద్రాసు చేరిన తరువాత ఒక ఉత్తరం, రామేశ్వరం చేరిన తరువాత మరో ఉత్తరం రాశారు. సంపూర్ణ భారత దర్శనం పథకం కింద యాత్రలు మూడు నెలలు పడతాయి. ముందు దక్షిణ భారత యాత్రలు, అటుపిమ్మట బొంబాయి, గుజరాత్ ప్రాంతాలు. ఈవిధంగా ప్రయాణాలు చేసివస్తారు వ్రాసిన రెండు ఉత్తరాలలోను మా అన్నయ్య ప్రత్యేకంగా రామదాసు గురించి వ్రాసి, అతనిని బాగా చూసుకోమన్నాడు. అతడు ఇంటిపట్టున ఉండడం నుంచి నిర్విచారంగా యాత్రలు చేస్తున్నామని రాశాడు.

మా అమ్మ వంటికివచ్చి, నేను ఆమె సప ర్యలలో ఉన్నప్పుడు రామదాసు చివరకు వంటింటి పనిలో కూడా నాకు సాయప డ్డాడు. వంటిల్లు తుడిచి, అలికి, పొయ్యి రాజేసి, బియ్యం కడిగి, కూర తరిగి, ఒక ప్పుడు అంట్లూ, ఎంగిళ్లు కూడా శుభ్రంచేసేం దుకు ముందుకొచ్చాడు. దినమంతా శ్రమప డినా అతనికి అలుపులేదు. ఉదయం నాలుగు గంటలకే లేస్తాడు. యోగాభ్యాసం చేసేవాడుకాబోలు, పొట్ట లోపలికి పోయి శరీరం కర్రకట్టి తేలికగా పనులు చేసుకుపో యేవాడు. మా అమ్మకు వంట్లో బాగులేదని తెలిసిన మా జ్ఞాతులు చూడడానికి వచ్చారు. వారం పదిరోజులలో ముసిలిది జండా ఎత్తివేస్తుందని నిర్భయంగా మా యింట్లోనే అనడం మొదలుపెట్టారు. వాళ్లు మా అమ్మకి సేవచేస్తారని ఎలా అనుకు నేది?

రాత్రి చాలా సేపటివరకు నాకు నిద్రపట్ట లేదు. ఈమధ్య మూడు నాలుగు రోజుల్లో జరిగిన సంఘనలు నన్ను మరీ అల్లరి పెడుతున్నాయి. మా అమ్మకు వంటికి వచ్చిన దగ్గిరనుంచీ, పనుల్లో రామదాసు శరీరాన్ని అనుకోకుండా తాకడం జరుగుతు న్నది. ఒకప్పుడు ఏదో ముఖ్యమైన సంగతి చెప్పవలసి వచ్చినప్పుడు నేనే అతని భుజం మీదకొట్టి నావేపు తిప్పించి మాట్లాడుతు న్నాను. అతనికి స్పష్టంగా అన్ని మాటలు ఇప్పుడు వినబడుతున్నాయి. కొంచెం నిదా నంగా ఆలోచించి చూస్తే నేనే పైచేయి తీసుకొని అతన్ని తాకుతున్నాను. ప్రతి శని వారం ఇల్లంతా పట్లు దులిపి గదులన్నీ కడిగి ఒత్తడం ఆనవాయితీ అయింది. మా అన్నయ్య వాళ్లు వెళ్లిన దగ్గిరనుంచీ వాళ్ల గదికి తాళంవేసే ఉంది. కనీసం కిటికీ తలుపులు కూడా తీసి ఉండకపోవడంచేత గది అదోవిధంగా ఉంది. అందుచేత ఆ శనివారం ఉదయం కడగడానికి అవకపోతే మధ్యాహ్నం కడిగాం. ఇంట్లో పెద్ద నౌకర్లం ఇద్దరమేగదా! మా అమ్మకు మడి, ఆచారం. దానినుంచి పనిమనిషిని కూడా పెట్టుకో లేదు. రామదాసుకి ఒంట్లో బాగున్న దగ్గిర నుంచీ పనిమనిషి అవసరమే లేకపో యింది. ఈ ఇరవై రోజులకు గదినిండా బూజులు పట్టాయి. మా అన్నయ్య పడు కునే గది చాలా పెద్దది. గోడకు చేరువగా పెద్దపందిరి మంచముంది. దానిమీద రెండు పరుపులున్నాయి. మా వదిన పర చిన ఎర్రదుప్పటి ఆ రంగంటే ఆమెకు ఎంత ఇష్టమో! మాసిందో లేదో తెలియకుండా ఉంది. మనుషులు మెసలుతుంటే ఇల్లు కల కలలాడుతూ ఉంటుంది.

రామదాసు మా అన్నగారి గదిలో తప్ప మిగిలిన ఇంటి అంతటిలోను పనిచేశాడు. ఎందుచేతనో ఈ గదిలోకి అతను అడుగు పెట్టలేదు. కాబట్టి ఇదే అతనికి మొదటిసారి. ఒక గోడకి దగ్గిరలో టేబులు, నిలువుటద్దం ఉన్నాయి. టేబిలు దగ్గిర రెండు కుర్చీలు ఉన్నాయి. గోడలకు నాలుగు రవి వర్మ చిత్రాలు. నా కార్యంనాడు పోయినవి పోగా మిగిలినవి ఈ చిత్రాలు, నిలువుటద్దమూ, గదిలో ఉన్న సామానంతా నాదే.

పట్లు దులపడమయింది. నేను కొంచెం సేపు టేబులు ఎదురుగా నిలువుటద్దం ముందు నిలబడ్డాను. నా పైట జారిపో యింది. ఎదురుగుండా అద్దంలో చూచు కుంటే, నా వెనుకనే రామదాసు కనిపిం చాడు.

రెండురోజులకింద మరో సంఘటన జరి గింది.

ఇంట్లో రెండు హరికేన్ లాంతర్లున్నాయి. ఒక కోడిగుడ్డు చిమ్నీ దీపం ఉంది. రెండు కిరసనాయిలు బుడ్డీలు ఉన్నాయి. చిమ్నీలు తుడవడం, చమురు పొయ్యడం, దీపాలు వెలిగించడం రామదాసు పనులే. మరు నాడు కొత్త అమావాస్య- తరువాత ఉగాది.

ఉగాదికోసం మామిడి పిందెలు, కొత్త చింత పండు, వేపపువ్వు తేడానికి ఉదయమే రామ దాసుని పంపించాను. అతను వచ్చేసరికి కొంచెం పనైనా అతనికి చేసిపెట్టాలని చిమ్నీలు తుడిచి, చమురు పోయడానికి కూర్చున్నాను. ఒక లాంతరు చిమ్నీ శుభ్రంగా తుడిచాను. ఏదో ఆలోచిస్తూ రెండో చిమ్నీ తుడుస్తుంటే అది చేతిలోంచి జారి నేలనుపడి ముక్కలయింది. గాజుము క్కలన్నీ జాగ్రత్తగా పెరటిలో గోడదగ్గర పారేసి ఆ చోటు శుభ్రంగా తుడిచాను. రామదాసుతో చెప్పి దుకాణం నుంచి కొత్త చిమ్నీ తెప్పించాలనుకున్నాను. ఇంతలోనే స్నానంచేసి మడికట్టుకొని పనులలో పడి ఆ సంగతే మరచిపోయాను. రామదాసుకి కూడా సాయంకాలం దీపాలు పెట్టేవరకు ఈ సంగతి తెలుసుకోడానికి వీలు చిక్క లేదు. ఆ రాత్రి ఒక్క హరికేన్ లాంతరునే నట్టింట్లోకి, సావడిలోకి, మా అమ్మ గదిలోకి తిప్పవలసివచ్చింది.

ఒంటికి వచ్చిన దగ్గరనుంచీ మా అమ్మకు రాత్రివేళల్లో జావకాచి, మజ్జిగ పోసి యిస్తు న్నాను. ఆ జావకోసం ఆమె నట్టింట్లోకి రావడంలేదు. పడకగదిలోనే వెండిగిన్నెలో జావ, మజ్జిగ కలిపి తెచ్చాను. నాతోపాటు హరికేన్ దీపం కూడా గదిలోకి తెచ్చి కిటి కీలో పెట్టాను.

మా అమ్మ, జావకొంచెం చప్పరించి అంది.

"నారాయణి! జావలో ఉప్పు వెయ్యడం మరచిపోయావా? "

నిజంగానే మరచిపోయాను.

నట్టింట్లో ఆరోజు హరికేన్ దీపం లేదు. కిరసనాయిలు బుడ్డీ పొగతో వెలుగుతూ నట్టింటి మధ్య ఉంది. మా అమ్మకు జావ యిచ్చిన తరువాత నేను, రామదాసు భోజ నాలు చేయాలి. అందుకోసం అతను కంచా లుపెట్టి, మంచి నీళ్ళు పెడుతున్నాడు. నేను ఉప్పు తేడానికి నట్టింట్లోంచి వంటింటివేపు నడుస్తూ ఉంటే పెద్దగాలి వచ్చి దీపం ఆరి పోయింది. వంటింట్లోంచి వస్తున్న రామ దాసు, వంటింటిలోకి పోతున్న నేను ఒకరి నొకరు ఢీకొన్నాము. నేను పడిపోకుండా అతను నన్ను తన బలమైన చేతుల్లోకి తీసు కున్నాడు. నేను ఒకక్షణం చైతన్యరహితంగా ఉండిపోయాను. పరిస్థితిని గ్రహించి అత నిని గాఢంగా కౌగలించుకున్నాను. ఆ పురుష స్పర్శకి నా వంటిని లేచిన పులకలు అయిదునిమిషాల తరువాత నన్నతడు మెల్లిగా విడిపించుకున్నా తగ్గలేదు. ఆప ళంగా మా అమ్మ దగ్గిరికి ఎలా వెళ్ళిపోను?

రామదాసు తడుముకుంటూ గూటిలో దాచిన అగ్గిపెట్టె తెచ్చి దీపం వెలిగిస్తే, నేను వంటింటిలోంచి ఉప్పు పట్టుకొని మా అమ్మ దగ్గిరికి పోయాను. అంతవరకూ మా అమ్మ ఉప్పు కోసం కూర్చుంది.

"ఎందుకే ఇంత ఆలస్యం? "

ఆమె నన్ను పరిశీలనగా చూస్తూ అడి గింది.

ఏమిటి చెప్పడం?

"తీస్తుంటే బుట్టకిందకి పడి ఉప్పంతా నేలను ఒలికిపోయింది. ఎత్తుకొని వచ్చేస రికి ఆలస్యమయింది"

అది అబద్ధమని ఆమె గ్రహించినట్లుంది. మరేం మాట్లాడకుండా జావ తాగి చాలా సేపు మేలుకొని కూర్చుంది.

ఆ రాత్రి రామదాసు ఏం తిన్నాడో, నేనేం పెట్టానో భగవంతుడికే తెలుసు. వంటింటి పని రామదాసు మీద విడిచిపెట్టి భోజన మైన వెంటనే నేను మా అమ్మ దగ్గిరికి వెళ్ళాను.

★ ★ ★

ఇవాళ ఉగాది. ప్రతి సంక్రాంతికి రైతు లకు బట్టలు పెట్టినట్టే సంవత్సరాదికి జ్ఞాతు లకు బట్టలు పెడతాం. ఈసారి వాళ్ళకు

బట్టలు పెట్టేటప్పుడు రామదాసు సంగతి నేను మరచిపోలేదు.

జ్ఞాతులకు కొంచెం ఖరీదైన బట్టలు పెట్టాను. వారితో సమానంగా రామదాసుకి జరీఅంచు పంచలు పెట్టలేదు. నేను చాలా మంచి పంచ ఎంచినా రామదాసే చాలా సాధారణమైనదానిని తీసుకున్నాడు. అది నా మంచి కోసమే అన్నాడు. జ్ఞాతులు తనను చూసి ఏడుస్తారన్నాడు.

ఉగాదినాడు తీరుబడిలేకుండా పగలంతా గడచిపోయింది. మా అమ్మ చాలా విలువైన కొత్తచీర కట్టుకుంది. నేను కూడా ఖరీదైన చీరే కట్టుకున్నాను.

రాత్రి మా అమ్మ జావ తాగడం అయింది. రోజంతా విశ్రాంతి లేదేమో పడుక్కోడానికి తొందరపడింది. రోజూ నల్లమందు మినప గింజ ప్రమాణంలో వేసేదానిని. ఇవాళ వేసిన మోతాదు కందిగింజంత కనిపించింది. మా అమ్మ దానిని మింగిన తరువాత జరిగిన పొరపాటు గుర్తించాను. దీని వలన వచ్చే ప్రమాదం లేదు. రేపటి నుంచి ఈ మోతాదులో వేస్తేనేగాని ఆమెకు సరిగా నిద్రపట్టదు.





వీటన్నిటి వెనుక ఏదో కారణముంది. నా మనసు నిలకడగా ఉండడంలేదు. గదిలో దీపమార్పి పడుక్కున్నానే కాని నిద్ర రావడంలేదు.

నేను ప్రతి ఉగాదినాడు కొత్త నిర్ణయాలు తీసుకుంటాను. కొన్ని కుటుంబాలకు సంవత్సరంలో సాయంచెయ్యాలని, కొన్ని భూములను బాగుచేయించాలని, మితంగా మాట్లాడి మనఃక్లేశం కలిగించే విషయాల్లో జోక్యం కలిగించుకోనని తీర్మానించే దానిని. ఇవాళ ఉగాది. ఈ ఉగాదినాడు నేనింకా కొత్త నిర్ణయాలు తీసుకోలేదు.

నన్ను బంధించిన శృంఖలాలను తెగగొట్టి స్వేచ్ఛగా, నా మనసు, నా శరీరం కోరినట్లు ఆచరించడానికి నిశ్చయించుకున్నాను. దాని ఫలితాలు ఎలా ఉంటాయో? ఈ సందేహం వెంటనే కలిగింది. ఇన్ని సంవత్సరాలబట్టి నా సందేహాలకే విలువనిచ్చాను. అందరికీ ఒదిగి జీవించాను. ఇప్పుడు నా నిర్ణయాన్ని గౌరవిస్తాను.

మా అమ్మ మంచి నిద్రలో ఉంది. ఆమె బాగా తెల్లవారేవరకు నిద్రలేవదు. నేను మంచం దిగి సావడిలోకి వచ్చాను. ఎందుకేనా మంచిదని గది తలుపు గొళ్లెం పెట్టాను. సావడిలో చిన్న కోడిగుడ్డు దీపం వెలుగుతోంది. వీధి తలుపు గడియలు భద్రంగా వేసి ఉన్నాయి. గోడకు కొంచెం దగ్గరగా చాపమీద రామదాసు నిద్రపోతున్నాడు. ఎడం చేయి తలకింద పెట్టుకున్నాడు. పలుచని పంచ కప్పుకున్నాడు. ఒక్క పది నిమిషాలు అతని పక్కను కూర్చొని మరోసారి ఆలోచించాను. నాలో కోరిక బలమయి మరే ఆలోచనకు తావులేకుండా పోయింది.

రామదాసు చాలా గాఢమైన నిద్రలో ఉన్నాడు. నన్ను ఆ రాత్రి చీకటిలో కౌగిలించుకున్నాడు. ఆ మధురమైన అనుభూతిని అతను తలచుకోడంలేదా?

అతనికి, నాకు చాలా అంతరముందని, తన పరిధిలో తాను ఉండాలని, మనస్సును కోరికలనుండి వేరుచేసుకొని, నిద్రపోతున్నట్లు ఉంది.

రామదాసును తట్టిలేపాను. త్వరలోనే లేచి కూర్చున్నాడు. మెల్లిగా అతనిమీద వాలి చెవిలో అన్నాను.

"నాతో పడకగదిలోకి రా!"

గదిలో తగ్గించిన హరికేన్‌లాంతరు పెద్దదిచేశాను. గది తలుపులు వేశాను. చీకటి పడకముందే తెల్లటి మడత దుప్పటి తలగడ కింద పెట్టాను. సాయంకాలం కోసిన సన్నజాజి మొగ్గలు గిన్నెనిండా తెచ్చి టేబులుమీద ఉంచాను. మా అమ్మ సాయంకాలం నుండీ తన గదిలోనే ఉండడంచేత ఈ పనులన్నీ సాధ్యమయాయి.

రాత్రి రామదాసుకు పరమాన్నం వండిపెట్టకపోయినా, అన్నంలో పాలు పోశాను. మరో గ్లాసుడు పాలు గదిలో టేబులుమీద ఉంచాను. మా వదినగారి ఎర్రదుప్పటీ తీసి మూలను పెట్టి పాలమీగడవంటి తెల్లదుప్పటీ పాన్పుమీద పరచాను.

రామదాసు నేను చేస్తున్న పనులన్నీ చూస్తున్నాడు. అన్నీ సరిచేసి, చేయిపట్టుకొని అతనిని మంచంమీద కూర్చోబెట్టాను.

"రామదాసూ! నువ్వు పురుషుడివి. నేను ప్రకృతిని. మన యిద్దరి మధ్య యుగాల నుండి సంబంధముంది. ఇంతవరకు నాకు యోగ్యుడైన పురుషుడు లభించలేదు. నువ్వు నాకన్న కొద్దిగా, వయసులో పెద్దవాడివి. కాని, అన్నివిధాల సంపూర్ణుడవైన పురుషుడివి?"

అతని కళ్లలోకి చూస్తూ మృదువుగా నేను పలికిన మాటలకు అతను నవ్వి తన అభిప్రాయం సంజ్ఞలలో తెలిపాడు.

"నువ్వెలా చెప్పగలవు?"

"నా శ్రేయస్సును నువ్వు ధ్యేయంగా పెట్టుకున్నావు. నన్ను మెప్పించడానికి నువ్వు ప్రయత్నించలేదు. కాని, నన్ను నీకంటికి రెప్పగా కాపాడుకుంటున్నావు. నీకంటే ఉత్తమమైన పురుషుడు నాకెక్కడ లభిస్తాడు?"

అతని కళ్లల్లోకి చూస్తుంటే మరేమీ చెప్పడానికి నాకు సిగ్గువేసింది. ధైర్యంచేసి అతనితో అన్నాను.

"నేను అక్షతను. ఇది నా ప్రథమ సమాగమం"

అతను నవ్వుతూ నన్ను తన చేతులలోకి తీసుకున్నాడు. ఎన్ని సంవత్సరాలనుండో ఎదురుచూసిన శారీరకమైన సౌఖ్యాన్ని నాకు ప్రసాదించాడు.

అతనిలో ఉద్రేకమున్నా తొందరపాటు లేదు.

స్త్రీ హృదయం సంపూర్ణంగా తెలిసిన రసికుడతడు.

నా శరీరసౌందర్యం తనివితీరా చూసి ఆనందపారవశ్యం చెందిన కళారాధకుడు. తొలికలయికలో హృదయాన్ని దోచుకున్న ప్రణయమూర్తి.

అతనితో కామశాస్త్రాధ్యయనం చేసిన నెల రోజులు, ముప్ఫై నిమిషాలవలె గడచిపోయాయి.

"నేను నీ రాధను. ఓ మురారి! నా కుచ కలశాలమీద మకరికా పత్రాలు రచించు"

"నేను నీ అహల్యను. నువ్వు నా సంక్రందనుడివి"

"నువ్వు చంద్రుడివి- నేను నీ తారను"

ఎన్ని మాటలు అతని చెవిలో చెప్పానో!

అతని విశాలమైన కళ్లల్లో, అతను నా వలన పొందిన సుఖానుభూతులను చదువుకుంటూ, అతనితో ప్రపంచపుటంచులకి పోడానికి కూడా సిద్ధమని చెప్పాను.

మా అమ్మకు నల్లమందు మోతాదులు పెంచుతున్నాను.

పగలు మేమిద్దరం ఎవరో తెలియని వాళ్ళలా వ్యవహరించి, ఎప్పుడు రాత్రి వస్తుందా అని ఎదురు చూసేవాళ్ళం.

మా అమ్మకు అనుమానమని, చూసిన వాళ్ళు అపవాదులు అంటగడతారని భయపడడానికి అవకాశమివ్వకుండా రామదాసు నడిచేవాడు.

వసంతం నా జీవితంలో మొదటిసారి ప్రవేశించింది. పెరటిలో మల్లెమొగ్గలు దండలు గుచ్చి, రాత్రి మార్చుకుంటే, వాడిపోయిన వాటిని మరునాడు ఎవరూ చూడకుండా గొయ్యిలో పాతిపెట్టవలసి వచ్చేది.

మనసారా అతనికి అభ్యంగనం చేయించి, అలంకరించడానికి వీలులేకపోయింది.

అంతటితోనే నేను సంతోషించాను.

పరిణామం గురించి ఒకనాడు కూడా నేను ఆలోచించలేదు. అటువంటి ఆలోచనలకు పోతే అనుభవించే ఆనందం చేదవుతుందని తెలుసు.

ఉన్నట్లుండి ఒకరోజు ఉదయం స్టేషనుకు వెళ్ళిన రామదాసు ఎంతకూ తిరిగిరాకపోతే నా సంతోషం ఒక్కసారి బురదలో పారబోసినట్లయింది.

అతనికోసం చూసిచూసి పగలు భోజనం చెయ్యలేదు. రాత్రి కూడా భోజనం చెయ్యకపోతే మా అమ్మ అనుమానాలు నిజమవుతాయని నాలుగు మెతుకులు తిన్నాను. ఆ రాత్రి రామదాసు పడుక్కునే చోటు ఖాళీగా ఉంటే, ధారలుగా కారే కన్నీరు కొంగుతో తుడుచుకుంటూ, నిప్పువంటి దుఃఖాన్ని గుండెల్లో నిభాయించుకున్నాను.

మంచంమీద పడుకున్నాను. రాత్రంతా కంటిరెప్పలు మూతపడలేదు. బలవంతాన మూసుకుంటే రామదాసుతో గడపిన మధు

రమైన క్షణాలు జ్ఞాపకానికి వచ్చి, కన్నీళ్ళు ధారలుగా కారి నా కొంగుతడిపి వేశాయి.

ఏం చేయను?

ఆ రోజు మధ్యాహ్నం నారాయడోవార్త తెచ్చాడు.

స్టేషనులో ఎవరో యిద్దరు రైల్వేవాళ్ళు రామదాసుకు కనిపించారని, వాళ్ళను చూసి అతను తప్పుకోబోతుంటే వాళ్ళు అతనిని బలవంతంగా తమతో తీసుకుపోయారని వాడు చెప్పాడు.

వాళ్ళెవరు? ఎందుకు రామదాసుని తీసుకుపోయారు? అతనిని ఏమీ చెయ్యరు కదా?

ఎందుకు నాకీ ఆందోళన?

నాకు ప్రేమంటే ఏమిటో తెలియదు.

శరీరసౌఖ్యం కోసమని అతనితో సంబంధం ఏర్పరచుకున్నాను. అతనివల్ల తనివితీర నాకోరిక తీరింది. అంతటితో ఈ సంబంధం తెంపుకోవచ్చు కదా!

రామదాసు శాశ్వతంగా నాతో ఉండిపోతాడని ఎలా అనుకోను!

ఈ ఆలోచన రాగానే ఎందుకో నాకు దుఃఖం కట్టలు తెంచుకొని వచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చాను. మా అమ్మ నా ఎదుట ఉందని కూడా నేను గమనించలేదు.

ఆవిడ మెల్లగా అక్కడనుంచి వెళ్ళిపోయింది.

ఆమె నా దుఃఖం గురించి అడుగనూలేదు, నేను చెప్పనూలేదు. నేనెవరికీ చెప్పే స్థితిలోలేను.

రామదాసు లేని ఇల్లు చలిగాలులకి ఆకులన్నీ రాలి మోడయిన చెట్టులా కనిపించింది.

చిన్న పిల్లతెమ్మెర కిటికీలోంచి వీచింది.

వసంతానికి మోడులన్నీ చిగిర్చాయి. కిటికీలోంచి చూస్తే బాదం చెట్టు చిగురుటాకులు తొడిగింది.

మళ్ళీ కొత్త జీవితం.

ఈ ఆలోచన నాలో ధైర్యాన్ని కలిగించింది.

నా రామదాసుతో దిగంతాలకు పోడానికి కూడా నేను సిద్ధంగా ఉన్నాను. వీధి తలుపు తోసి పోస్టుమాను పిలిచాడు.

ఉత్తరం వచ్చింది.

మార్చి మొదటివారంలో మావాళ్ళు యాత్రలకు వెళ్ళారు. ఏప్రిలు నెలంతా రామదాసుతో గడచింది. మే నెల ఆఖరువారంలో మావాళ్ళు తిరిగి వస్తున్నారు. చాలా పెద్దఎత్తున గంగా సంతర్పణ చేయడానికి మా అన్నయ్య సంకల్పించాడు. ఊరు చేరిన వారం రోజులలోనే అటు కాశీప్రయాగల నుండి, ఇటురామేశ్వరంనుండి తెచ్చిన జలాలను కలిపి పెద్ద సమారాధన చేయదలచుకున్నాడు. కనీసపక్షం నూరుమంది బ్రాహ్మణులకు భూరి దక్షిణలిచ్చి, బట్టలుపెట్టి, తాలుకా అంతా మారుమోగేటట్లు, భోజనాలు పెట్టాలని వాడు రాశాడు. అన్ని ఏర్పాటులు చేయమన్నాడు. రామదాసుని, నారాయడుని పట్టణం పంపించి వంట బ్రాహ్మళ్లను ముందుగానే కుదర్చమన్నాడు.

ఆ ఉత్తరం మా అమ్మ ఊరివాళ్ళందరినీ పిలిచి చదివి వినిపించింది. సుపుత్రుడు చేస్తున్న ఘనకార్యానికి ఆవిడ ఎంతో సంతోషిస్తున్నది.

రామదాసు లేడుకదా!

నారాయడితో పనులవుతాయా?

మగసహాయం కావాలి. నేనెక్కడికీ పోనని ఆవిడకు తెలుసు.

మా జ్ఞాతులలో కాశీపతి అని ఒకాయన ఉన్నాడు. అతనికి ఏభై సంవత్సరాలున్నాయి. సకలగుణాభిరాముడతడు. ఆపద్బాంధవుడుగా అతను మా అమ్మకు దొరి

కాదు.

"ఒరే కాశీపతి! నీ మేనగోడలిదగ్గిర ఎంత అవసరమైతే అంత డబ్బు తీసుకో! దేనికీ లోటులేకుండా అన్నిటికీ ఏర్పాటుచెయ్యి. మన యింట్లో ఇంత గొప్ప సమారాధన ఇంతవరకు జరగలేదు" అంది అతనితో.

"అక్కయ్యా! నీకేం బెంగలేదు. ఎల్లుండి బుధవారం మంచిరోజు. మందు బ్రాహ్మళ్లకు చెప్పుకోవాలి. భోజనాలకి, పౌరోహిత్యానికి వాళ్ళు అవసరం. పెళ్ళిళ్ళ సీజనుకదా! అడ్వాన్సులిస్తేగాని వాళ్ళు రారు"

నేనో వెయ్యి రూపాయలు కాశీపతికిచ్చాను.

ఒక వారంరోజులవరకు అతని జాడ తెలియకుండా పోయింది. అతను చిరిగిన బట్టలతో తిరిగివచ్చాడు. అడ్వాన్సులు చాలవని, మరో రెండువేలు యిస్తేగాని అసలు, పనే జరగదని కాళ్ళుచాచి కూర్చున్నాడు.

ఈసారి నారాయడు చేతికి డబ్బిచ్చి పంపించాను.

కాశీపతి ఎత్తులు సాగలేదు. మొదటి వెయ్యి రూపాయలతో అతను తప్పతాగి, ఆడవాళ్లతో ఖుషీచేసి వచ్చాడు. ఆ సంగతి నారాయడే చెప్పాడు.

నేను ఖర్చుపెట్టే డబ్బుతో కొన్ని బీదకుటుంబాలు ఒక నెల్లాళ్ళపాటు హాయిగా బతకవచ్చు ఈ దౌర్భాగ్యులపాల ఇంత డబ్బు పోయవలసి వచ్చింది కదా అని విచారించాను. మా అమ్మని సంతోషపెట్టడానికి ఈ పని చేస్తున్నానా? బహుశా నా డబ్బుకు విలువ లేదనిపించింది.

క్రమక్రమంగా ఏవో పనులలో కల్పించుకున్నా ఏ రాత్రో జ్ఞాపకాలు నన్ను తరిమి బాధిస్తున్నాయి.

రోజులు చాలా కష్టంతో గడుపుతున్నాను.

అనుకున్న రోజుకి మా అన్నయ్యవాళ్ళు గ్రామం చేరుకున్నారు. నారాయణరావు కూడా వాళ్ళతో వచ్చాడు. ప్రపంచయాత్ర ముగించుకొని వచ్చినట్లు వాళ్ళు ముగ్గురూ మురిసిపోతున్నారు. తమ అనుభవాలు, చూసిన విశేషాలు, ఊరివాళ్ళనందరినీ పిలిచి వినిపిస్తున్నారు. మా వదిన ప్రియుడిని నా యింటి గుమ్మంతొక్కొద్దని అన్నాను. ఈ సంగతి మా వదినకి, మా అన్నయ్యకు బాగా తెలుసు. వాళ్ళు చాలా తేలికగా నా ఆజ్ఞను ఉల్లంఘించారు. ఆ మనిషిని వీధిలో నిలబెట్టడానికి ఇది తరుణం కాదు.

ఈసారి వీడికి ధైర్యం హెచ్చయి, మా వదినను విడిచిపెట్టి, నా వెంటబడుతున్నాడు. బహుశా, ఈ యింట్లో తిష్టవెయ్యడానికి ముగ్గురూ ఆలోచించి వేసిన పథకం వాడు అమలు చేస్తున్నాడు.

మా అమ్మతోసహా అందరూ మా అన్నయ్య పక్షమే. నేను ఒంటరిదాన్ని మునుపు రామదాసుని చూసుకొని ధైర్యంగా ఉండేదానిని.

ఇప్పుడు నేనెవరిని నమ్మడం?

రామదాసును తిరిగి కలిసేవరకు నన్ను నేనే రక్షించుకోవాలి.

తిన్నగా ప్రవర్తించకపోతే పాలికాపులతో బైటికి ఈడ్పిస్తానని నారాయణరావును హెచ్చరించాను.

అనుకున్నట్లు వారంరోజులలో సమారాధన జరగలేదు.

పదిహేను రోజులతరువాత గంగపూజ జరిగింది. నూరుమంది బ్రాహ్మణులు, మరో నూరుమంది బంధువులు స్నేహితులు వచ్చారు. వీధిలో చాలాపెద్ద పందిరి వేయించారు.

వంటలయిపోయాయి.

విస్తళ్ళు వేస్తున్నారు.

నాకు రెండురోజులైై నిద్ర సరిగాలేదు. నీరసంగా ఉంది. ఏ పనిమీదా ఉత్సాహంలేకున్నా యాంత్రికంగా పనిచేస్తున్నాను. ఏవీ తాగాలనీ, తినాలనీ అనిపించడంలేదు.

విస్తళ్లలో వడ్డిస్తున్నారు.

నేను, వరండాలో నిలబడ్డదానిని, పెద్ద వాంతి చేసుకొని ఉన్న చోటునే తెలివితప్పి పడిపోయాను.

నన్ను లేవనెత్తి, మంచంమీద పడుక్కోబెట్టారు.

ఇంతలో వైద్యులు సీతారామయ్యగారు వచ్చారు. నన్నో పావుగంట పరీక్షచేసి, చాలా కోపంతో, నాడిచూస్తున్న నా చెయ్యి తటాలున తోసేసి, ఏటిలో సచేలస్నానం చేయడానికి వెళ్ళిపోయారు.

మా అన్నయ్య అతనివెంట పరుగెత్తి, ప్రళయకాలరుద్రుడివలె గర్జిస్తూ వచ్చాడు.

"ఓసి కులటా! రంకులాడి! ఎవడితో పోయావే? "

అందరూ అతని చుట్టూ చేరి ప్రశ్నలు వేస్తున్నారు.

నేనేం జవాబు చెప్పడం?

కార్చిచ్చులా ఈ వార్త వ్యాపించింది.

బ్రాహ్మలందరూ హాహాకారాలు పెడుతూ విస్తళ్ళనుంచి లేచిపోయారు. వడ్డించేవాళ్ళు పళ్ళాలు విసిరేశారు. పెద్ద సంకులం. అంతా చిందరవందర అరుపులు, గోలలు.

అందరూ ఇల్లు విడిచి పందిట్లోకి పోయారు.

మా అన్నయ్య బ్రాహ్మలకాళ్ళమీద పడుతున్నాడు. తాను తప్పుచేయలేదని ప్రాధేయ పడుతున్నాడు. తన చెల్లెలు చేసిన తప్పుకు తనను శిక్షించవద్దంటున్నాడు.

ఈ బ్రాహ్మలందరి చేతుల్లో వజ్రాయుధ మొకటుంది. దానిని ప్రయోగించడానికి వాళ్లు ఇటువంటి తరుణం కోసమే ఎదురు చూస్తారు.

మమ్మల్నందరిని వాళ్లు వెలివేస్తామని చేతుల్లో నీళ్లు పోసుకొని శపించడానికి కూర్చున్నారు.

అభోజనాలతో బ్రాహ్మణశ్రేష్ఠులు శపిస్తే మేమేమిటి లోకమంతా భస్మమవుతుందని వాళ్లంతా చెప్పుకుంటున్నారు.

ఆ తరుణంలో కాశీపతి, నారాయణరావు ముందుకొచ్చారు.

మా అమ్మను, మా అన్నయ్యను, మా వదినను ఏటికి తీసుకుపోయి ఇంట్లో మనిషి పోయినట్లు స్నానం చేయించి, కాశీపతి ఇంటికి తీసుకుపోయారు. బ్రాహ్మళ్లందరినీ వెండి చెప్పుతో కొట్టారు. భోజనం చెయ్యనందుకు ఇవ్వవలసిన దక్షిణకంటే మరో యాభై రూపాయలు హెచ్చు ఇప్పించి అందరినీ తృప్తిపరచి పంపించారు.

ఇంట్లో నేను తప్ప మనుషులెవరూ లేరు. కుక్కలు స్వేచ్ఛగా లోపలికి ప్రవేశించి కొట్లాడుకోకుండా తిని వెళ్లిపోయాయి. ఎంతమందికో సరిపడే భోజనపదార్థాలు పది కుక్కలు ఎంత తినగలవు?

నేను సావడిలో మంచం మీద అలానే పడుకున్నాను. ఏ జడ్డి మొగుడో, పిచ్చి మొగుడో నాకుంటే వాడి కళ్లు కప్పి నేను వేయిమంది రామదాసులతో పోయినా, నాకు కడుపోకాలో వచ్చినా ఈ సభ్యసమాజం చాలా సంతోషించి నా మొగుడిని కొనియాడి నన్ను కన్న మా అమ్మ, నా వేవిళ్లకు అమ్మలక్కలందరూ నాకు హారతులు పట్టి, నన్ను నెత్తిమీద పెట్టుకునేవాళ్లు.

నేనలాగే పడుకున్నాను.

క్రమంగా సాయంకాలమయింది.

చీకటి వచ్చింది.

ఎవ్వరూ నా గురించి పట్టించుకోలేదు.

వేవిళ్లు వచ్చిన ఆడమనిషి పరిస్థితి తెలిసిన ఒక్క తల్లి కూడా నా దగ్గిరికి వచ్చి ఒక గ్లాసుడు మంచినీళ్లు కూడా ఇవ్వలేదు.

ఎంత రాత్రయిందో నాకు తెలియదు.

నీరసంచేత ఒకొక్కసారి తెలివి తప్పు తోంది.

ఒకసారి తెలివివచ్చి దాహం వేసింది. నాలుక పిడచగట్టుకుపోయింది. ఎండాకాల మేమో చెమటపట్టి బట్టలు తడిసిపో యాయి.

నేను లేవబోయాను. శక్తిలేక మంచం మీద పడిపోయాను.

నేనిలా ఎంతకాలమో ఉండనక్కరలేదు. తెల్లారేసరికి చచ్చిపోతే మా వాళ్లంతా ఎంతో సంతోషిస్తారు.

నాకీ కుక్క చావు మీద కోరికలేదు.

నేను జీవించాలి.

నాలో పెరుగుతున్న రామదాసు బిడ్డ కోసం నేను తప్పకుండా బతికి ఉండాలి. ఈ ప్రజలందరూ నన్ను బలవంతంగా చంపాల నుకుంటున్నారు. నాతో రామదాసు బిడ్డ కూడా నశిస్తాడని వాళ్లకు తెలుసు.

ఒకే దెబ్బతో రెండుపిట్టలు.

నేను చాలా మొండిదాన్ని.

నేను పడుకున్న మంచం అంత ఎత్తుగా లేదు. మెల్లిగా నేలమీదికి దిగాను. నట్టింటి వేపు పాక్కుంటూ పోయాను. నిలబడలేను. ప్రయత్నం చేసినా పడిపోతాను.

నట్టింట్లోకి వెళ్లడానికి మండువా దాటాలి.

చంద్రుడు ఆకాశం మధ్యకు వచ్చాడు.

మండువాలో వెండిచాప పరచినట్లు వెన్నెల పాకింది.

మండువా నుండి పెరటివేపు చూశాను.

ఈ కొసనుండి ఆ కొసవరకూ తలుపు లన్నీ బార్లా తీసే ఉన్నాయి. వడ్డించిన విస్తళ్లు, కుక్కలు చింపిన ఆకులు విరజిమ్మి నట్లు ఉన్నాయి.

మెల్లిగా నట్టింట్లోకి పాక్కుంటూపో యాను.

ఊరల్లా సద్దుమణిగింది.

కాశీపతి, నారాయణరావు ఇత్యాదులు మా వాళ్లకు తిళ్లు పెట్టినట్లున్నారు. ఎవ్వరి మాటలు వినిపించడంలేదు. దూరాన్న తోటలో ఏదో పిట్ట నావలెనే తెలివొచ్చి కూసింది.

నట్టింట్లో పాలు దొరకలేదు. ఒక పెరుగు కుండ, పక్కన మంచినీటి బిందె మసక వెలుతురులో కనిపించాయి. గ్లాసుతో ముందుగా మంచినీళ్లు తాగాను. కళ్లు తిరిగి నట్లయింది. కొద్దిసేపటి తరువాత పెరుగు ఒక గ్లాసుడు తాగాను.

నట్టింట్లోనే ఒక అరగంట కూర్చున్నాను. నా శరీరంలోకి బలం వచ్చినట్లయింది. మెల్లిగా లేచి గోడలు పట్టుకుంటూ సావ డిలో మంచంవరకు నడిచాను.

మంచంమీద ఒక క్షణం కూర్చున్నాను.

కడుపులో చల్లగా ఉంది.

రోజూ రామదాసు పడుకునే చోటే ఆ మంచముంది. ఆ స్థలం విక్రమార్కుడి సింహాసనం వంటిది. దానిమీద కూర్చున్నా పడుక్కున్నా నా మనసు నిశ్చలంగా ఉండి భయం దూరమవుతుంది.

మంచంమీద నడుం వాల్చాను.

ఒకవేళ రామదాసు ఎక్కడికోపోకుండా మా ఇంట్లోనే ఉన్నప్పుడు ఈ ఆపద సంభ విస్తే. మావాళ్లూ, వచ్చిన నూరు మంది బ్రాహ్మణులూ నర రూప రాక్షసులు ఆ నోరులేని అమాయకుడిని చెట్టుకు వేలాడగట్టి కింద మంటలు పెట్టి సజీవ దహనం చేసి ఉండే వాళ్లు. ఎంతకైనా నా వాళ్లు తగుదురు.

ఈ సంగతి తలుచుకుంటే రామదాసుని

తిరిగి కలుసుకోగలననే ఆశ నాలో స్థిరపడింది.

ఎప్పుడో నిద్రపట్టింది.

తెలివివచ్చేసరికి బాగా ఎండవచ్చింది.

నిన్న రాత్రి నట్టింటి తలుపులు అలవాటు ప్రకారం వేసి వచ్చాను. మంచం మీద పడుకునేటప్పుడు వీధి తలుపులు కూడా వేశాను.

లేచేసరికి బాగా నీరసంగా ఉంది.

నీరసాన్ని లక్ష్యం చెయ్యకుండా సావడి, నట్టిల్లు ఊడ్చి, నీళ్లు జల్లి శుభ్రం చేశాను. నూతి దగ్గిర స్నానం చేస్తే ప్రాణం లేచివచ్చింది. రామదాసు మళ్లు తీసి సంరక్షించిన మల్లె మొక్కలు విరబూచి వాటి పరిమళం నాకు స్వాగతం పలికింది.

చీర మార్చుకున్నాను. పొద్దున్న ఎవరూ పాలు పొయ్యలేదు. కనీసం తలుపు తట్టి నేను బతికున్నానో లేదో చూడడానికి కూడా రాలేదు.

పెరుగు పులిసింది. దానిలో నీళ్లు పోసుకొని కొంచెం ఉప్పు కలుపుకొని తాగాను.

మంచంమీద నడుమువాల్చాను.

నా చేతులకి ఒక జత బంగారు గాజులున్నాయి. మెడలో ఒక ఒంటిపేట గొలుసుంది. ఈ రెండూ మా పుట్టింటివారుకాని అత్తింటి వారుకాని పెట్టినవికావు. నా పెళ్లికి మా బావ, అక్క చేయించినవి.

గంటలు క్రమంగా ఒకటీ ఒకటీ సాగుతున్నాయి. ప్రతి రెండు గంటలకు గ్లాసుడు మజ్జిగ తాగుతున్నాను. మిట్టమధ్యాహ్నం జ్యేష్ఠమాసం. ఎండ నిప్పులు చెరగుతోంది.

ఎవరూ మా ఇంటి తలుపు తట్టలేదు.

అపరాహ్నం దాటిపోయింది.

మా అన్నయ్య మొదలైనవాళ్లందరూ విశ్వాసఘాతకులు. వాళ్లు నా గురించి నిర్లక్ష్యం చేయడంలో అర్థముంది. నారాయుడు, స్కూలు హెడ్మాస్టరుగారు, చాలా మంది చెప్పుకుంటే ఊరిలో ప్రతిమనిషి నా సహాయం పొందినవాళ్లే. సాటి ఆడకూతురు అవమానంతో కుంగిపోయి పడరాని హింసలు పడుతుందని తెలిసి కనీసం ధైర్యం చెప్పడానికి కూడా ఒక తల్లీ రాలేదు.

ఊరిలో ప్రతిమనిషికి వచ్చిన బాధలు నావిగా భావించి అన్నివిధాలా మా అన్నయ్యను ఒక పక్కకు పెట్టి సహాయం చేశాను.

అందుకోసమే నేను బాధపడుతున్నాను.

వాళ్లందరూ హాయిగా ఉండనీ!

వాళ్లందరూ సుఖంగా ఉండాలంటే నేనీ ఊరు విడిచి వెళ్లిపోవాలి. ఈ ఆలోచన నా మనసులోకి రాగానే లేచి కూర్చున్నాను. మరో రెండు గ్లాసుల మజ్జిగ తాగాను. పైన ఎండగా ఉందని ఒక చీర మడతపెట్టి తల మీద పెట్టుకున్నాను.

వీధి నిర్మానుష్యంగా ఉంది.

ఏటివేపు నడిచాను. రేవులోకూడా ఎవరూ లేరు. ఏరు ఎండిపోయింది. చెమ్మగా ఉన్న ఇసుకలో నడిచాను. వంతెనవేపు నుండి చల్లని గాలి వస్తోంది. అటువేపే సముద్రముంది. ఏరుదాటి, తోట దాటితే స్టేషను వస్తుంది. ఎక్కడికిపోవాలి? ఏం చెయ్యాలి? అన్న ఆలోచనలే లేవు. మా వూరు వదిలి వెళ్లిపోవడమే ధ్యేయం.

తోటలోంచి నడుస్తున్నాను. అంటు మామిడి చెట్టుకు బంగినపల్లి పండు బంగారం రంగులో వేలాడుతోంది. ఎండకి తోటమాలీ కూడా నిద్రపోతున్నాడు కాబోలు.

ఏటి ఇసుకలో నడిస్తే నా పాదాలు బొబ్బలెక్కాయి.

ఆ మామిడి చెట్టు కింద కూర్చొని అందుకొచ్చిన పలకబారిన పండు తెంపి కొరికాను.

చిన్న పులుపు, చిక్కని తీయదనం నా హృదయాన్ని ఆనందంతో నింపాయి.

సేదదీరి స్టేషనువేపు నడిచాను.

ఎవరో ప్రయాణికులు రైలుకోసం చూస్తున్నారు. నాకు తెలిసిన వాళ్లున్నారా లేదా అని నేనాలోచించలేదు.

ఇంతలో రైలు వచ్చే గంట కొట్టారు.

కొద్దిసేపటిలోనే రైలు వచ్చింది.

నా దగ్గిర ఒక పైసా కూడా లేదు.

ఎక్కేవాళ్లు, దిగేవాళ్లు వాళ్లవాళ్ల తొందరలో ఉన్నారు.

నేను ఆలోచిస్తూ ముందుకు నడుస్తున్నాను.

ఇంతలో రెక్కవాలింది. గంటకొట్టారు.

గబగబ ఏదోపెట్టి ఎక్కబోతుంటే వెనుక నుంచి ఎవరో నారాయణీ అని పిలిచారు.

నన్నెవరు పిలుస్తారు?

నన్ను పిలువవలసిన రామదాసుకి మాటలురావు.

రైలు కదలబోతుంటే ఒక పెట్టెలోకి తొందరగా ఎక్కిపోయాను.



**శంకరం చెప్పినది**

"హలో! నేను సీనియర్ రైల్వే ఇనస్పెక్టరు శంకరాన్ని"

"... ..."

"నమస్కారం, దొరగారు! నావంట్లో బాగానే ఉంది"

"... ..."

"మెడికల్ ఆఫీసరుగారు ప్రయాణం చెయ్యవద్దన్నారు. చాలా నీరసంగా ఉంది"

"... ..."

"ఇవేం మాటలు దొరగారు! ఈ రైల్వే అంతటిని నేను భుజాలమీద మోస్తున్నానా! నేను ముందుకు రాకపోతే రైళ్లు నడవవంటారా!"

"... ..."

"మీరనే అనుభవం ఎలా వస్తుంది? ఒకసారి పనిచేస్తేకదా రెండోసారికది అనుభవమవుతుంది"

"... ..."

"దొరగారు! మీరన్నట్లు ఇటువంటి తీవ్రమైన పరిస్థితులలో నిలకడగా పనిచేసి రైళ్లు నడిపించేవాళ్లు కావాలి. నా శరీరానికి నీరసం కాని నా మనసు మాత్రం పనివేపే ఉరకలేస్తుంది"

"... ..."

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్. నేను పోయి సెక్షనులో రైళ్లను భద్రంగా నడిపిస్తాను. అన్నివిధాల కమ్యూనికేషన్లు దెబ్బతిన్నాయి. ప్రయాణికులకు ప్రమాదం కలుగకుండా గమ్యం చేర్చడానికి ప్రయత్నిస్తాను. మరో అరగంటలో ఎక్స్‌ప్రెస్ బయలుదేరుతుంది. దానిలో నేను ప్రయాణం చేసి తీసుకోవలసిన ముందు జాగ్రత్తలు తీసుకుంటాను. మీకు నాయందు అంత విశ్వాసమున్నందుకు ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. మీరు నా సెక్షన్ గురించి నిశ్చింతగా ఉండవచ్చు"

దొరగారితో ఇలా అన్నానేకాని పరిస్థితులు మాత్రం సుముఖంగా లేవు. మళ్లా

రేడియోలో వార్త గాలి రెండు వందల కిలో మీటర్ల వేగంలో వీస్తోంది. రాత్రి మూడు గంటలవేళ తుఫాను మోసుబందరు కళింగ పట్నం రేవుల మధ్య తీరాన్ని దాటవచ్చు అలలు తాటిచెట్టుఎత్తున లేచి, తీరంలో పల్లపు భూములను తుడిచిపెడతాయి. గాలివేగానికి చెట్లు చేమలు, ఎలక్ట్రిక్ స్తంభాలు విరిగిపోతాయి. నేలను పడిన తీగలను ఎవరు తాకరాదు. చేపలు పట్టే వారు ఎట్టి పరిస్థితులలోను సముద్రంలోకి పోరాదు.

సాయంకాలం బయలుదేరవలసిన రైలు ఇంకా స్టేషనులో ఉంది. చాలా కొద్దిమంది ప్రయాణికులు మాత్రమే అందులో ఉన్నారు. ఫస్టు క్లాసులో ఎవరూ ప్రయాణికులు లేరు.

నేను స్టేషను చేరుకొని రైలెక్కేసరికి బాగా తడిసిపోయా. వారం రోజులబట్టి జ్వరం వస్తోంది. దానిని లెక్కచెయ్యకుండా పనిచేస్తున్నాను. ఏదో ఆఫీసు పని కాబట్టి సరిపోయింది. ఈవిధంగా లైను మీదికి వెళ్లవలసి వస్తుందని నేను అనుకోలేదు.

నాతోపాటు సోములు కూడా స్టేషనుకు వచ్చాడు. సాధారణ బంగళా ప్యూన్‌ను లైను మీదకు తీసుకెళ్లాలి. కానీ వాడి పని ఇంట్లో ఉండడం చేత పాయింట్స్‌మన్ సోములును నాతో తీసుకెళ్లక తప్పింది కాదు.

స్టేషను చేరుకున్న ఒక గంటవరకు రైలు కదలలేదు. పది నిమిషాలలో రైలు విడిచి పెడుతుందనగా, సోములు కొడుకు మమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాడు. సోములు తల్లికి ఉన్నట్లుండి పక్షవాతం వచ్చింది. వాడిని ఇంటికి పంపించాను.

రైలు కదిలేసరికి నేనొక్కడినే నా బోగీలో ఉన్నాను. ప్రతి స్టేషనులోను బండి ఆగుతోంది. పళాసానుండి ఒక్కరైలు కూడా విశాఖపట్నం రాలేదు. కంట్రోలు, టెలిగ్రాఫ్ లైనులు అన్నీ పోయాయి. ఆ పరిస్థితులలో రైలును విడిచి ఇంజనొక్కటే పక్క స్టేషనుకుపోయి, అన్నీ బాగుంటే తిరిగివచ్చి రైలును ముందుకు తీసుకుపోతుంది. ఈ పద్ధతిమీద, ఇరవై నిమిషాలలో చేరవలసిన పక్క స్టేషనుకు గంటపైగా పడుతుంది.

ఆ రోజు రైలు నడుపుతున్న డ్రైవరు మునిస్వామి. అతను ఆరడుగుల పొడవు మనిషి. ఎటువంటి పరిస్థితులలోను తొందరపడడు. ఇంజను మరి ముందుకు నడపలేని అవస్థ సంభవించినప్పుడు నా దగ్గిరికి వస్తానన్నాడు. అంతవరకు విశ్రాంతి తీసుకోమన్నాడు.

బెర్తుమీద నా పక్క పరిచాడు సోములు. పొడి బట్టలు వాడు తీసియిస్తే కట్టుకున్నాను. తడిసిపోయినవి వాడు ఆరవేశాడు. నా భోజనానికి ప్లేటు, చంచాలు, కారియర్ అన్నీ సిద్ధంగా ఉంచాడు.

సోములు వెళ్లిపోవడంతో నాకో పెద్ద వెలితితోచింది. లోకంలో ఎవరూ అంత విశ్వాసపాత్రులైన మనుషులు మనకు లభించరు. కాని నేనేం చేయగలను? వాడుంటే ఏదో మాట్లాడుతూ నా మనసు పక్కకి మళ్లించి నేను నిద్రపోయేటట్లు చేసేవాడు. ఇప్పుడు నిద్ర అన్న ప్రసక్తేలేదు.

ప్రతి నిమిషం తుఫాను విజృంభిస్తుంది. కిటికీల సందులలోంచి గాలి బుసకొడుతుంది. రైలు చాలా నెమ్మదిగా పోతుంది. తెచ్చుకున్నది తిని పళ్లెం కడుక్కొని పక్క మీద తిరిగి కూర్చునేసరికి రాత్రి పది గంటలయింది.

పక్క మీద పద్మాసనం వేసుకొని రగ్గు వెచ్చగా కప్పుకున్నాను. మా పెద్ద దొరగారు చెప్పకపోయినా నేను ఈ రాత్రి తప్పనిసరిగా బయలుదేరేవాడిని. మరో మూడు రోజులలో మా మనవడి బారసాల. వారం రోజులకింద నా భార్యకు పదివేల రూపా

యలిచ్చాను, అన్ని ఖర్చులు దానితో సరిపెట్టమని. అప్పుడామె ఏమీ అనలేదు. ఇవాళ మధ్యాహ్నం మూడు గంటలకు ఒక వార్త చెప్పింది. ఆ డబ్బు చంటివాడి బంగారు మొలతాడుకి, చేతులకు పెట్టే మురుగులకు సరిపోయిందని. ఆ పదివేల రూపాయలే కాక ఒక పంచదార బస్తా, రెండు బియ్యం బస్తాలు, కందిపప్పు, నేతిడబ్బా, నూనె డబ్బాలు ఇంకా ఇంకా ఎన్నో వస్తువులు పది రోజులకిందే తెచ్చి ఇంట్లో పడేశాను. చాలా పెద్ద శాంతి జరుగుతుందని ఏభై మందికి భోజనాలు, సాయంకాలం మహిళా సమాజం సభ్యురాండ్రకు తేనీటి విందు, అల్లుడికి, అతని తల్లిదండ్రులకు పట్టుబట్టలు వీటన్నిటికీ కనీసం మరో అయిదు వేలేనా కావాలనీ, ఆ డబ్బు లేకపోతే చాలా రసాభాస అవుతుందని ఆమె నిష్కర్షగా చెప్పింది.

మామగారు పిల్లనిచ్చి పెళ్లి చేసినప్పుడు నాతో ఒక సంగతి చెప్పారు.

"నువ్వు చూస్తే చాలా ముందాలోచన కలవాడివిగా తోస్తుంది. సంసారంలో సుఖమున్నా, లేకపోయినా, సాఫీగా సాగిపోవడానికి ఒక ముఖ్యసూత్రం భార్యాభర్తలు పాటించాలి. భార్య మాట భర్తేనా వినాలి, భర్తమాట భార్యేనా వినాలి. ఇక నా కూతురి విషయం నీకు ముందే చెప్పడం మంచిది. ఇప్పటివరకు మా అమ్మాయి మాటే మా ఇంట్లో పాటిస్తాం. పొరపాటున దాని మాట వినకపోతే పది రోజుల వరకు ఎవరికీ తిండీ తిప్పలు, నిద్రలు ఉండవు. నువ్వు మాత్రం ఇటువంటి ఇబ్బందికి లోను కావద్దు"

మాకు పెళ్లయి పద్ధెనిమిది సంవత్సరాలయింది. ఇప్పటివరకు మా మామగారి సలహా పాటిస్తూ వచ్చాను. రాబోయే మూడు రోజులలో చాలా పెద్ద కార్యమొకటి ఇంట్లో జరగవలసి ఉన్నప్పుడు ఆమె మాటను కాదనే శక్తినాకులేదు.

ఆవిడ సులువుగా అయిదువేలు తెమ్మని చెప్పింది. ముందు తెచ్చిన పదివేల కోసం చాలామంది స్నేహితులను కలిశాను. బ్యాంకులో అప్పుతెచ్చాను. ఇప్పుడు డబ్బు సంపాదించడానికి మరే ఆధారం కనిపించలేదు.

రాజగోపాలనాయుడు నాకు చాలా ఆత్మీయుడైన స్నేహితుడు. వాడు కూడా అదే మాట అన్నాడు. మరే ఆధారం లేనప్పుడు తన దగ్గిరికి రమ్మన్నాడు. అందుకే నిర్విచారంగా వాడి దగ్గరికి ప్రయాణం చేస్తున్నాను.

చిన్నచిన్న గాలివానలను లెక్కలోకి తీసుకోకుండా ఉంటే ఇది నా జీవితంలో మూడో పెద్దగాలివాన.

నాకు మొదటి గాలి వాన బాగా జ్ఞాపకం ఉంది.

అప్పుడు నేను పన్నెండేళ్లవాడిని. మా అమ్మమ్మగారి ఊరు సెలవులలో వెళ్లాను. ఆ గ్రామం నదీ తీరాన్న ఉన్నా ఇళ్లన్నీ చాలా ఎత్తయిన చోట కట్టుకున్నారు. మా చుట్టాల కుటుంబమొకటి అక్కడికి పదిమైళ్ల దూరంలో ఉంది. మా అమ్మమ్మ వేలు విడిచిన చెల్లెలిగారిదా కుటుంబం. మా చిన్నమ్మమ్మ కోడలు గారెలు, పరమాన్నం నంది కేశుడి నోము చేసుకుంటోంది. దానికి మమ్మల్నందరినీ ఆవిడ స్వయంగా వచ్చి పిలిచింది. పెద్దవాళ్లు రాలేకపోయినా కనీసం పిల్లలనేనా పంపమంది. చివరకు ఆ వూరికి పదిమంది పిల్లలం మాత్రమే వెళ్లగలిగాము.

నోము చేసుకునే రోజుకు ఒకవారం రోజులు ముందుగా మమ్మల్ని పిలవడం జరిగింది. అప్పటికి ఎండగా ఉంది. వాతావరణం నోముకు చాలా అనుకూలంగా ఉంది. కాని నోము రెండు రోజులుందనగా

చిన్న జల్లు ప్రారంభమయింది. మేము బయలుదేరే నాటికి అడపాదడపా వర్షం పడుతూనే ఉంది. ఎటువంటి పరిస్థితిలోనైనా నోము ఆపమని ఆవిడ చెప్పడంచేత కనీసం పిల్లలనైనా పంపించారు.

ఇంత వర్షంలోను గాలిలోనూ ఉదయం తొమ్మిది నుంచి గారెలు, పరమాన్నం ఆరగించడానికి పిన్నలు, పెద్దలు వస్తూనే ఉన్నారు. మేము కూడా తొమ్మిదింటికి చేరుకున్నాం. వచ్చేవాళ్ల రద్దీ కొంచెం తగ్గిన తరువాత పదకొండు గంటలకు వేడివేడి గారెలు, ఆవు పాల పరమాన్నం కడుపు నిండా తిన్నాం. సాయంకాలం మూడు వరకు పెట్టుపోతలు అవుతూనే ఉన్నాయి.



మా చిన్నమ్మమ్మగారి ఇల్లు పెద్దదైనా చొప్పతో నేసినది. దానికో మంచి మిద్దె ఉంది. మిద్దెమీద కొన్ని పెట్టెలున్నా, అక్కడ మా మామ ఒకడు మధ్యాహ్నం పూట పడుకోడానికి చాప, పరుపువేసి ఉంచాడు. మిద్దె ఎక్కడానికి గోడకి ఆన్చి ఒక వెదురు బొంగులనిచ్చెన ఉంది. రమారమి రెండు గంటలవుతుంటే మీద హాయిగా పడుకోవచ్చని మిద్దె ఎక్కిపోయాను. ఎవరో గారెల ఫలహారానికి వస్తే దిగువన చోటు చాలడం లేదని, నిచ్చెన కూడా మిద్దెమీదికి లాక్కున్నాను. పరుపుమీదపడుకొని జమిలినేత దుప్పటి ముసుగుపెట్టుకున్నాను. చాలా వెచ్చగా ఉంది. పదిహేను నిమిషాలలో నిద్రపట్టింది.

హఠాత్తుగా నాకు తెలివి వచ్చింది.

గాలి విపరీతంగా వీస్తోంది. పైకప్పుకునేసిన చొప్ప ఎగిరిపోయింది. వర్షం పడి దుప్పటి పూర్తిగా తడిసిపోయింది. కళ్లు విప్పి చూసినా మూసుకున్నా చీకటిగానే ఉంది.

"అత్తా!" గట్టిగా పిలిచాను.

గాలివాన హోరులో నా అరుపే నాకు వినిపించకుండా పోయింది. వర్షంలో తడుస్తూ లేచి కూర్చున్నాను. తడుముకుంటూ నిచ్చెన చేతిలోకి తీసుకున్నాను. మెల్లిగా కిందికి దింపితే ఆ నిచ్చెన నేలకి తగలడానికి బదులు, నీటిలో తేలుతోంది. ఎంత ప్రయత్నించినా ఎంత నీరు ఇంట్లోకి వచ్చిందో తెలియలేదు. ఆ నీటి మట్టం క్రమంగా హెచ్చుతోంది. నిచ్చెన నాకు కొలబద్ద అయింది.

పైకప్పు మీద చాలావరకు చొప్ప ఒక వేపు ఎగిరిపోయింది. వర్షం కుంభవృష్టిగా ఉంది. క్రమంగా అడుగునీటిమట్టం మిద్దెవరకు వచ్చింది. ఇంటిగోడలు మట్టితో కట్టినవి. గాలి, వర్షం, వరద. వేటికవి నానిపోయాయి. క్రమంగా గోడలు ఒక్కొక్కటీ కూలిపోయాయి.

జల్లెడవలె కనిపిస్తున్న పైకప్పు మీదికి ఎగబ్రాకాను. రెండు సన్నటి వెదుళ్లు విరిచి, వాటిలోంచి తలపైకి పెట్టి చూశాను. నా చుట్టూ నీరు. గ్రామమంతా నీటిలో మునిగిపోయింది. ఉన్నట్లుండి ఇంటిపైకప్పు ఆ వరద నీటిలో కదలడం మొదలుపెట్టింది. చాలా శ్రమపడి శరీరంపైకి తోసుకొని పైకప్పు శిఖరం పట్టుకొని కూర్చున్నాను.

క్రమంగా తూర్పువేపు తెల్లబడుతోంది. గాలి, వర్షం తగ్గాయి. పైకప్పు నీటిలో తేలుతూ సముద్రంవేపు ప్రయాణం చేస్తోంది.

నాకు ఒక్కటే జ్ఞాపకం. దూసి దగ్గిర రైలు వంతెన, శ్రీకాకుళం దగ్గిర రోడ్డుబ్రిడ్జి ఉన్నాయని. ముందు వంతెన వరకూ తేలి వెళ్లినా అక్కడ వంతెన స్తంభాలకు తగిలి చెట్లు, ఇళ్ల కప్పులు అన్నీ అడ్డుకుపోయి ఛిన్నాభిన్నమవుతాయి. కాబట్టి నామరూపాలు లేకుండా నదిలో కొట్టుకుపోవడం తప్పదనిపించింది.

ఆ ఇంటికప్పు కొంతసేపు మెల్లిగా తేలి క్రమంగా ఏటి మధ్యకు ప్రయాణం చేసింది. వర్షం, గాలి తగ్గిపోయినా కొండల్లో కురిసిన వర్షం వరదలై ముంచెత్తింది.

ఏం చేయడం? చూస్తూ ఉంటే నీటిలో కొట్టుకుపోతున్న పెద్ద నాగుపాము పైకప్పు మీదికి పాకింది. నీటిలో బాగా అలిసినట్లుంది అక్కడే ఉండిపోయింది.

చావుకి చాలాదార్లు తెరచుకున్నాయి.

దూరంగా దూసివంతెన కనిపిస్తోంది.

గుండెలు కొట్టుకుంటున్నాయి. పైకప్పు ఈసారి గట్టుకు కొద్ది దూరంలోనే ముందుకు పోతోంది.

ఎవరో పెద్దకేక వేశాడు. ఇంటిపైకప్పు మీదకో పెద్ద తాడు పడింది. గట్టుమీద చెట్టుకి దానిని బలంగా కట్టి ఒకాయన, దాని రెండవ కొస నా మీదికి విసిరాడు. ఆ చివరకో కొక్కెముంది. ఆకొక్కెం పైకప్పు వెదుళ్లకట్లకు తగుల్తోంది. పైకప్పు మరి ముందుకు పోలేదు. అతను చాలా బలంగా దానిని ఒడ్డుకు లాక్కుంటున్నాడు.

పైకప్పు ఒడ్డుచేరుకుంటుంటే పాముని చూసి నాకు నోట మాటరాలేదు.

"ఫరవాలేదు బాబూ! నీ ప్రాణం నీకెంత తీపో దాని ప్రాణం కూడా దానికంతే. ప్రాణావసాన సమయాన ఎవరి బతుకువారిదే. మరొకరిని చంపాలనే ఆలోచన కూడా ఎవరికీ ఉండదు"

అతను నన్ను జాగ్రత్తగా అందుకున్నాడు. కొంతదూరం ఈదుకొని, తరువాత నీటిలో నడిచి నన్ను గట్టుచేర్చాడు. అక్కడ తన మనుషులున్నారు. పొడి గుడ్డలతో నా శరీరం పూర్తిగా తుడిచి, ఒక గావంచా నాకు చుట్టబెట్టి కంబళికప్పి, ఎడ్ల బండి పొణకలో కూర్చుండబెట్టారు. కొంచెంసేపు తాపీపడ్డ తరువాత వేడి పాలు ఒక గ్లాసుడు తాగడానికిచ్చారు. పాలు తాగిన తరువాత నా ఒళ్లు నాకు తెలియకుండా పొణకలోనే పడుకున్నాను.

సాయంకాలమయ్యేసరికి అతను మొత్తం ఇరవై ఇద్దరిని రక్షించాడు ఈ విధంగా నాలుగు బళ్లల్లో మమ్మల్ని తన వూరు తీసుకొని పోయాడు. అతనే రామయ్య నాయుడు. ఎంత గొప్ప ఈతగాడో, అంత గొప్ప ఉదారస్వభావుడు. ప్రాణాలను రక్షించే పనిగా పెట్టుకున్న మహానుభావుడు.

అతను రక్షించిన ఆడవాళ్లు, మగవాళ్లు మూడో రోజే వాళ్ల వాళ్ల గ్రామాలకు వెళ్లిపోయినా, నేను మాత్రం అతని ఇంట్లో వారం రోజులుండిపోయాను.

రామయ్యగారికి రాజగోపాలం ఒక్కడే కొడుకు. ఆ అబ్బాయి నా ఈడువాడే. నన్ను చూడగానే ఆ కుర్రాడికి నా మీద చాలా అభిమానం కలిగింది. నేను బ్రాహ్మల్ల అబ్బాయినని తెలుసుకొని పూజారి గారింట నాకు భోజనం పెట్టించాడు. ఒక వారమయేసరికి మేమిద్దరం ప్రాణ స్నేహితులమయ్యాము.

రామయ్యానాయుడుగారు నన్ను మా బంధువుల గ్రామం తీసుకుపోకుండా తిన్నగా విజయనగరం దగ్గిర ఉన్న మా గ్రామానికి తీసుకుపోయి మా అమ్మకు

నాన్నకు అప్పజెప్పాడు. వాళ్లకు నేనొక్కడినే కొడుకుని. మా అమ్మ కాపురానికి వచ్చిన పన్నెండు సంవత్సరాలకు పుట్టినవాడిని. నేను పునర్జన్మ ఎత్తినట్లే మా తల్లిదండ్రులు సంతోషించారు.

"బాబూ! రామయ్యా! నీకు ధనానికి లోటు లేదు. మాకు నువ్వు పుత్ర భిక్ష పెట్టావు. మనః పూర్వకంగా మా దంపతులం నిన్ను ఆశీర్వదిస్తున్నాం" అన్నాడు మా నాన్న.

రామయ్యగారు వంగి నమస్కారం చేసి అన్నారు.

"అంతకన్నా సంపద వేరే ఉందా! అదే మాకు శ్రీరామరక్ష"

తరువాత తరువాత తెలిసింది మా అమ్మమ్మ, మా చిన్నమ్మమ్మ కలుసుకున్న తరువాత నేను వరదలో కొట్టుకుపోయినట్లు నిర్ధారణకు వచ్చి ఏడిచి మా అమ్మకు ఆ సంగతి ఎలా చెప్పడమో తెలియక బాధప డుతుంటే నేను క్షేమంగా ఇల్లు చేరిన సంగతి తెలిసింది. వాళ్లు మొక్కిన మొక్కు లకు లెక్కలేదు.

రాత్రి ఎనిమిది గంటలకు వాల్తేరు వది లిన రైలు పన్నెండు గంటలకు విజయన గరం చేరుకుంది. అటు పిమ్మట విజయన గరంలో బండిని ఆపేసి ఉంచడమా లేక పోతే ఆ ప్రకారమే ముందుకు నడపడమా అన్న సంగతి తెల్లియక బండిలో నేనున్నా నని స్టేషను మాస్టరు తెలుసుకొని నన్ను కలిసి ఆర్డర్లు జారీచెయ్యమన్నాడు.

ఆ ప్రకారమే బండిని ముందుకు పోని య్యమన్నాను.

డ్రైవరు మునిస్వామి కూడా నా అభిప్రా యాన్నే బలపరిచాడు. మళ్లా బండి కద లడం మొదలు పెట్టింది. తలుపు సందు లోంచి గాలి ఈళ పెడుతోంది.

బండి ఊగుతూ నడుస్తోంది.

తొందరపడి ఈ నిర్ణయం తీసుకున్నా నేమో అనిపించింది. దారి మధ్యలో రైలు ఆపేస్తే ప్రయాణికులకు చాలా ఇబ్బందులు కలుగుతాయి. ఒకవేళ రైలు లైను కొట్టుకు పోతే అంతకన్నా తీవ్రమైన ప్రమాదం సంభవించి ప్రాణాలకే ముప్పు వస్తుంది. విజయనగరం స్టేషనులో రైలు నిలిపివేస్తే అన్నివిధాల బాగుండేది.

కాని ఒక్క సంగతి ఎప్పుడూ నన్ను వేధి స్తుంది. గాలివానలకు భయపడి రైలు ఆప కూడదు. చక్రాలు తిరుగుతూ ఉండాలి.

మరి వెనక్కు తిరగడం లేదు.

ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసుకొని తాగాను.

మేము ఒకప్పుడు సంపన్నులమే. మా నాన్న నిరతాన్నదాత. అతనిని అన్నివిధాల అనుసరించింది మా అమ్మ. వచ్చిపోయే వారికి ఆమె వండి పెట్టడానికి మా నాన్న గుప్తదానాలు చేయడానికి సరిపోయింది. ఈవిధంగా మా ఆస్తి కర్పూరకళికలవలె హరించుకుపోయింది. దానికి నాకేం విచా రంలేదు. మా నాన్న ఇంగ్లీషు చదువుకో లేదు. కాని నన్ను మాత్రం చదివించాడు. విజయనగరం కాలేజీలో బియ్యేవరకు చదు వుకోడం నా ఆస్తిగా భావించాను.

ఆస్తి లేకపోవడం నుంచి ఉద్యోగం గురించి ప్రయత్నం చేయవలసి వచ్చింది.

నాకంటే ఆస్తులులేవు. మరి రాజగో పాలం నాయుడు ఎందుకు ఉద్యోగం కోసం ప్రయత్నించాడు?

శ్రీకాకుళం హైస్కూలు చదువులు ముగించి వాడు విజయనగరం వచ్చి మహా రాజావారి కాలేజీలో చేరాడు. వాడు కాలే జీలో చేరిననాడు నేను అపరిమితంగా ఆనందించాను. రామయ్యా నాయుడుగారు విజయనగరం వచ్చినప్పుడల్లా మా ఇంటికి వచ్చేవారు. రాజగోపాలాన్ని కాలేజీలో చేర్చి ననాడు మా ఇంటికి వచ్చి నాతోపాటు వాడిని కూడా చూసుకోమని మా నాన్నకు

అప్పజెప్పారు. కళ్లంట ఆనందబాష్పాలు కారుతుంటే వాడిని స్వీకరించారాయన.

రామయ్యగారు దాసన్నపేటలో కొడుకు కోసం ఒక మంచి ఇల్లు అద్దెకు తీసుకున్నారు. వండిపెట్టడానికి ఒక పెద్దావిడను, ఇంట్లో పనులు చేయడానికి ఒక నమ్మకమైన పాలికాపును నియమించారు.

ఈవిధంగా మేమిద్దరం కలిసి చదువుకోడానికి అవకాశం కలిగింది.

నాలుగు సంవత్సరాలు చాలా తొందరగా గడిచాయి.

రాజగోపాలం చాలా చక్కనివాడు. చేయెత్తు పొడుగు మనిషి, చక్కటి ఛాయ, సూదిముక్కు, విశాలమైన కళ్లు. రైతు కుటుంబం నుండి వచ్చాడేమో శరీరం కండలుదేరి ఉంది. క్లాసులో కూడా అందరితో స్నేహంగా ఉండి మంచి పేరు తెచ్చుకున్నాడు.

వాడికి చదువైన తరువాత ఏం చేయాలనే సమస్యలేదు. వందలకొలది ఎకరాల పంట భూములు. తండ్రికి ఒక్కడే కొడుకు.

నా విషయంలో ఉద్యోగం చేయకతప్పదు. రైల్వేలో చిన్న మాస్టరు ఉద్యోగం కోసం వీలయినప్పుడు టెలిగ్రాఫీ నేర్చుకోవడానికి స్టేషనుకు వెళ్లేవాడిని.

మాకు బియే ఫైనలు పరీక్షలు అయిపోయాయి. పరీక్షల తరువాత ఒక నాలుగు రోజులు రాజగోపాలం గారింటికి వెళ్లలేదు. అయిదో రోజు వెళ్లేసరికి వాడులేడు. ఆఖరి పరీక్ష అయిన రాత్రి నుండీ వాడు ఎక్కడికోవెళ్లాడని ఇంటి దగ్గిర కూడా చెప్పలేదని తెలిసింది. ఏమయి ఉంటాడు? కనీసం నాతో చెప్పేవాడే!

మరునాడు కూడా వాడు రాలేదు. ఇంటికి వస్తూ నేను స్టేషనులో దూరి ఒక గంట టెలిగ్రాఫీ అభ్యాసం చేయాలనుకున్నాను.

సిగ్నలరు సుబ్బారావుగారు మరేదో స్టేషనుతో ఇన్స్ట్రుమెంటు మీద మాట్లాడుతున్నారు. మధ్యమధ్య నవ్వుతూ ప్రశ్నలు వేస్తున్నారు.

దాని సారాంశం నేను వెంటనే గ్రహించాను.

రాజగోపాలం ఆముదాలవలస స్టేషనులో పోలీసులకు దొరికిపోయాడు. టెంపుల్ స్ట్రీట్ పిల్లని లేవదీసుకొనిపోయాడు. అతని తండ్రిగారు రామయ్యనాయుడుగారు అంతటి పేరున్నవాడు ఆ ప్రాంతాలలో లేడు. తండ్రి కడుపున చెడబుట్టాడు రాజగోపాలం.

ఇక మరి వినలేకపోయాను. ఇంటికి పోయి నాలుగు మెతుకులు కతికి స్టేషనుకు పరుగెత్తుకొని వచ్చాను. అప్పుడే మెయిలు వస్తోంది.

ఆముదాలవలసలో దిగేసరికి సాయంకాలం నాలుగు గంటలయింది. రాజగోపాలం, వాడు లేవదీసుకుపోయిన పిల్ల వెయిటింగ్ రూములో ఉన్నారు. లోపల ఇద్దరు పోలీసులు, ఆ పిల్ల తల్లి కూడా ఉన్నారు. ఆ అమ్మాయి ఎంత అందంగా ఉందో చెప్పలేను. రాజగోపాలం ఆమెకు సరియైన ఉజ్జీ. ఇద్దరూ ఎలా దగ్గిరికి వచ్చారో తెలియదు. గుంపులు గుంపులుగా మనుషులు గుమ్మం దగ్గిర నిలబడి చూస్తున్నారు. కొందరు నవ్వుతున్నారు. కొందరు ఊహించరాని కథలను అల్లుతున్నారు. రామయ్యనాయుడు గారికి కబురు వెళ్లింది.

మనుషులను తోసుకొని లోపలకు వెళ్లాను. రాజగోపాలం నిన్న రాత్రి ఆ అమ్మాయితో కూడా స్టేషనులో పోలీసులకు దొరికిపోయాడు. ఆ అమ్మాయి తల్లి పొద్దున్న పదకొండు గంటలకు విజయనగరం నుండి వచ్చింది. ఆ అమ్మాయికింకా పదిహేడు ఏళ్లేనని, మైనరుని బలవంతంగా

రాజగోపాలం లేవదీసుకుపోయినట్లు ఆమె పోలీసు రిపోర్టిచ్చింది. పోలీసులు సర్కిల్ ఇనస్పెక్టరుగారి కోసం ఎదురు చూస్తు న్నారు. అతను ఏ క్షణంలోనైనా వచ్చి నిందితుడిని నిర్బంధంలోకి తీసుకోవచ్చు

వాడితో ఒక అయిదు నిమిషాలు మాట్లా డడానికి పోలీసుల అనుమతి తీసుకు న్నాను.

ఎక్కడికో ఇద్దరూ పారిపోయి పెళ్లిచేసు కుందామనుకున్నారు. వాళ్లిద్దరికీ రెండు సంవత్సరాల స్నేహముంది. ఆ వచ్చిన తల్లి ఆమె స్వంత తల్లికాదు, పెంపకం తల్లి. ఇంతకాలం ఆమె వాళ్లు కలుసుకోడానికి అభ్యంతరం చెప్పలేదు. పెళ్లికి మాత్రం ఆవిడ అంగీకరించడంలేదు. వాడికి చాలా అవమానంగా ఉంది. మనుషులు ద్వారం దగ్గిర నిలబడి వాళ్లవేపు చూస్తూ నవ్వడం వాడు భరించలేకపోతున్నాడు. ఇద్దరినీ తప్పించమన్నాడు. ఆ అమ్మాయి తల్లి రాక పోతే వాళ్లిద్దరిని విడిపించేవాడిని. రామయ్య నాయుడుగారు అత్యవసర పరిస్థి తులు వచ్చేటప్పుడు పనికొస్తాయని నాకో వెయ్యి రూపాయలిచ్చారు. ఆ డబ్బుతో తన తండ్రి రాకుండా తనను విడిపించమని వాడు ప్రాధేయపడ్డాడు.

ఇద్దరినీ విడిచిపెట్టమని అమ్మాయి తల్లిని ప్రార్థించాను. , ఆమె ఆకాశంమీద కూర్చుంది. లక్షలు తేవలసిన పిల్లను విడిచి పెట్టనంది. నాకు గత్యంతరం లేకపో యింది. రామయ్య నాయుడు వస్తున్నారన్న వార్త తెలిసింది. పోలీసులకు వేయి రూపా యలిచ్చి రాజగోపాలాన్ని అక్కడనుంచి పంపివేశాను.

రామయ్య నాయుడుగారిని కలిసి సంగ తంతా చెప్పాలనుకున్నాను. కానీ వాడు మాత్రం ఆ పిల్లను పెళ్లాడేవరకు తండ్రిని కలియవద్దని బతిమాలుకున్నాడు.

మరొక్క పావుగంటలో పోలీసులు వెళ్లి పోయారు. పిల్లా, తల్లి దారిబట్టారు. రాజ గోపాలం పరారయాడు. నాయుడుగారి ఎదురుపడవలసి వస్తుందని నేను కూడా మెల్లిగా జారుకున్నాను.

తరువాత మరికొన్ని సంవత్సరాల వరకు రాజగోపాలాన్ని చూడలేదు. నేను విజయన గరం మరలిపోయాను. ఆరు నెలల వ్యవ ధిలో మా నాన్న, అమ్మ పోయారు. నాకు పేరుకు మాత్రం ఇల్లు మిగిలింది. పొలాలు మా తల్లిదండ్రుల దినకార్యాలకు అమ్ముడు పోయాయి.

నాకు కొద్దిరోజులలోనే రైల్వేలో ఉద్యోగం దొరికింది. పనిలో చేరిన సంవత్సరానికి పెళ్లయింది. పెళ్లయిన మూడు సంవత్సరా లకు ఒకనాటి ఉదయం నేను పనిచేస్తున్న స్టేషనులో రాజగోపాలం దిగాడు. వాడు కూడా నా వలెనే చిన్న మాస్టరుగా ఉద్యో గంలో చేరాడు. మా ఇంటి పక్కనే వాడికి కూడా ఇల్లిచ్చారు.

వాడు చాలా మారిపోయాడు. తాగుడు అలవాటయింది. విజయనగరం అమ్మా యిని వాళ్ల తల్లి నిర్బంధంలో ఉంచుతే ఆ పిల్ల ఉరిపోసుకొని చనిపోయింది. రాజగో పాలం ఈ సంగతి తెలిసి పిచ్చివాడయాడు. ఒక సంవత్సరంపాటు ఇక్కడ అక్కడ తిరి గాడు. ఇంటి గుమ్మం తొక్కలేదు. పరీక్షలు పాసయి చివరకు ఉద్యోగంలో చేరాడు. వాడిని నేనుండే ఊరిలో వేయడం నా అదృష్టం. చాలా ప్రయత్నంచేసి వాడు అక్క డికి వచ్చాడు.

కాని వాడు వచ్చిన ఆనందం నాకు అట్టే కాలం నిలవలేదు. వాడు రాత్రుళ్లు తాగి పడుకుంటే నా డ్యూటీ వాడి డ్యూటీ నేనే చేసేవాడిని. తాగుడు తగ్గించమన్న కొద్దీ అది మరీ హెచ్చించేవాడు. వాడికి ఏ నీతులు బోధించకపోతే తోచినప్పుడు విని ఉద్యోగం చేసేవాడు. విజయనగరం

అమ్మాయి వాడిని అంతగా వశపరచుకు న్నందుకు నాకు అబ్బురమనిపించలేదు. తొలిసారి చూసినప్పుడే నాకామె ఒక అప్సర సవలె కనిపించింది. ఆమెలో యవ్వనంతో చిన దగ్గిరనుంచీ ఆమెతోనే రాత్రిళ్లు గడుపు తున్న రాజగోపాలంలో అటువంటి మార్పులు రావడంలో ఆశ్చర్యంలేదు.



రైలాగిపోయింది.

అది గరివిడి స్టేషను.

టైము చూస్తే ఒటిగంట అయింది. డ్యూటీలో ఉన్న చిన్న మాస్టరు వచ్చాడు. మొదటి లైను మీద ప్లాట్‌ఫారంపై ఉన్న చెట్టొకటి విరిగిపడడంనుంచి రెండో లైను మీదకు బండిని తీసుకున్నట్లు చెప్పాడు.

గాలి బుసకొడుతోంది.

వర్షం కుండపోతగా ఉంది.

చిన్న మాస్టరు పంపించిన టీ తాగాను.

బండి ముందుకు వెళ్లకుండా అక్కడే స్టేషనులో నిలబెడితే మంచిదేమోనని అతను చెప్పినా నేను వినిపించుకోలేదు. నేను గమ్యం చేరుకోవాలి.

మరి కూర్చోలేక పక్కమీద నడుంవాల్చి రగ్గుమీదకు లాక్కున్నాను. పైన ప్రళయం తాండవిస్తున్నా నాకు మాత్రం చాలా హాయిగా ఉంది. సాధారణంగా నేను ఇంటి పట్టున ఉండడంకన్నా రైళ్లలో ప్రయాణం చేయడానికే ఇష్టపడతాను. ఇంట్లో ఉన్నంత సేపు స్వతంత్రంగా ఆలోచించడానికి నాకు అవకాశం దొరకదు. ఎవరో ఏవో చెప్తుంటే వాటిని వినడం, ఆ ధోరణిలో ఆలోచించడం తప్పదు. ఇక రైలులో... ఇది నా స్వర్గం. నా మనసుకు నేనే అధికారిని. జీవితంలో నేను పొందిన ఆనందాన్ని పునశ్చరణ చేసు కోడానికి ఇంతకన్నా ఏకాంతమైన చోటు లేదు. ఇది నా రాజ్యం. ఈ చివరినుండి ఆ చివరివరకు ఉన్న పనివాళ్లు నా బంధు వులు. నేనంటే వాళ్లందరికీ గౌరవం. వాళ్లంటే నాకు చాలా ఆత్మీయత. కష్టాలు, సుఖాలు వాళ్లతోపాటు పంచుకుంటే నాకు చెప్పలేని ఆనందం కలుగుతుంది. ఎవరే మంటేనేం, ఇది మాత్రం నిజం.

ఇవాళ సోములు నాతో రాలేకపోయాడు. వాడు వచ్చి ఉంటే ఈసరికి నిద్రలో ఉందును. ఈ స్టేషనులో ఒక అరగంట. రేపు పది గంటలకేనా గమ్యం చేరుకుంటే అదృష్టమే.

ఎప్పుడు నిద్రపట్టిందో నాకు తెలియదు.

కానీ తెలివి మాత్రం హఠాత్తుగా వచ్చింది.

ఇంజను చాలా కీచుగా అరుస్తోంది. బలంగా రైలును లాగుతోంది. బ్రేకులు సరిగా విడలేదేమో! బండి ముందుకు పోవ డానికి మొరాయిస్తోంది. ఆ గడబిడలో నేను బెర్తు మీదనుండి కిందకు పడవలసిన వాడినే. లేచి కూర్చున్నాను.

ఏ పీడకలనైతే నేను మరచిపోడానికి వేయి విధాల ప్రయత్నిస్తుంటానో అదే నన్ను వెంటబెట్టి తరుముతోంది.

అది నా జీవితంలో రెండో గాలివాన.

★ ★ ★

నేను పెద్ద కొండ శిఖరం మీద నిలుచు

న్నాను. జీవితంమీద నాకు కొంచమైనా ఆస క్తిలేదు. ఎవరికోసం బతకడం? ఎందు కోసం బతకడం?

గాలి తీవ్రంగా వీస్తోంది. వర్షం కుంభవృష్టిగా కురుస్తోంది. ఒకే గెంతు, నాలుగు వందల అడుగుల లోతులో ఉరకలు వేస్తూ పారుతున్న నదిలో పడితే నా కోరిక ఫలిస్తుంది. గెంతడానికి ముందుకి వంగాను. ఎవరో బలవంతంగా నా కాళ్లు పట్టుకున్నారు. ఎదుట నుంచి తీవ్రంగా వీస్తున్న గాలి మమ్మల్ని యిద్దరినీ వెనక్కు తోసివేసింది. కొంతవరకూ ఇద్దరం దిగువకు జారుకుంటూపోయాం.

నా పంచ చిరిగిపోయింది. నా చొక్కా పీలికలయింది. నా చర్మం చెక్కుకుపోయింది. ఒకచోట యిద్దరం ఆగిపోయాం.

నన్ను పట్టుకున్నవాడు మరెవడో కాడు.

రాజగోపాలం.

వాడెలావచ్చాడు?

"నువ్వెందుకొచ్చావు? " అడిగాను.

"పనివాళ్ళందరూ నీమీద కక్షగట్టారు. నీయింటి తలుపులు రాళ్ళతోను, గొడ్డళ్ల తోను విరుగగొడుతున్నారు. హాయిగా బతుకుతున్న వాళ్ళమధ్య అంటువ్యాధిని పైనుంచి తెచ్చి విరజల్లావని అరుస్తున్నారు. ఈ వ్యాధి ప్రతియింటికి సోకింది. నీ ఇల్లు కాల్చి, నిన్ను చంపుతేనేకాని గ్రామంలో ఒకరు కూడా బతకరని భూతవైద్యుడు చెప్పాడు" అన్నాడు రాజగోపాలం.

"పద! వాళ్ళముందు నిలబడతాను. నదిలో పడి చావడానికి బదులు వాళ్ళ చేతులలో చస్తాను. నేను మృత్యువును కోరుతున్నాను. ఏ రూపంలో అది దర్శనమిచ్చినా నేను స్వీకరిస్తాను"

"శంకరం! నువ్వు పస్తులుండి గొప్పగొప్ప పుస్తకాలు కొన్నావు. వాటిని వాళ్ళు కాల్చేయడానికి తొందరపడుతున్నారు. వేలకొలది రూపాయలు పోసి నువ్వు కొన్న తైలవర్ణ చిత్రాలు వాళ్ళు అగ్ని కర్పిస్తున్నారు. నువ్వు మొదలుపెట్టిన సాహిత్య వ్యాసంగం కాని, చిత్ర లేఖనం కాని చిగుళ్ళు తొడిగి మొగ్గపెట్టకముందే విరక్తుడవై ప్రాణాలు తీసుకోడానికి సిద్ధపడుతున్నావు. ఇదేమైనా బాగుందా? నీ ఆశయాలు, నీ ఆదర్శాలు రూపుదిద్దుకోకముందే తోకముడిచి, రంగం నుండి నిష్క్రమించడానికి ఉద్యుక్తుడవవుతున్నావు"

నాకు ఎంత ఆపుకుందామన్నా ఏడుపు ఆగలేదు. వెక్కివెక్కి ఏడుస్తున్నాను. ఆ చిత్రాలు, ఆ పుస్తకాలు నా ప్రాణాలకన్న అధికమైనవి. అరుదైన పుస్తకం ఎక్కడో ఉందంటే, దానిని సంపాదించేవరకు నేను నిద్రపోలేదు. ఒక అయిదు సంవత్సరాలు చేయరాని త్యాగాలు చేసి సంపాదించిన రెండువేల పుస్తకాలు, పది తైలవర్ణ చిత్రాలు అన్నీ ఎందుకూ కొరగాకుండా వాళ్ళు నాశనం చేస్తున్నారు.

"పద! వాళ్ళకి ఆ పుస్తకాలను కాల్చే అధికారం లేదు. వాళ్ళతో పోరాడుతాను. బతిమాలుతాను. నా ప్రాణాలేనా తీసుకోనీ! అటువంటి అరుదైన సంపదను మాత్రం ధ్వంసం చెయ్యనివ్వను. పద!"

ఇద్దరం తొందరగా కొండ దిగుతున్నాం. కాళ్ళు జారిపోతున్నాయి. ఒకడుగు నిలదొక్కుకోడానికి పదడుగులు తూలిపోతున్నాం. మమ్మల్ని గాలి కూడా వెనుక నుంచి తోస్తున్నది. అప్పటికే బాగా సాయంకాలమయింది. ఏదో ట్రెయిను దూరం నుండి కూస్తున్నది. మరికొద్ది దూరం దిగితే కొండ వాలు అంతమవుతుంది. మాకు స్టేషనుకు కనీసం అరమైలు దూరముంటుంది. స్టేషనుకు అటువేపు రైల్వేయిళ్లున్నాయి. నా ఇల్లు అన్నిటికన్న చివరది. ఆ యిల్లు ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నది. కిటికీ తలుపులు, వీధిగది తలుపులు తీసి

ఉన్నాయి. అంత వర్షంలోను మంటలు పైకి లేస్తున్నాయి. ఎన్ని గాలన్ల పెట్రోలు ఆ పుస్తకాలమీద పోశారో వాళ్ళు తగల బెడు తున్నది లంక కాదు. నేను నిర్మించుకున్న స్వర్గం వాళ్ళు దగ్ధం చేస్తున్నారు.

అప్పటికీ ఏదో ఆశ. కొన్ని పుస్తకాలేనా మిగలవా? ఇద్దరం స్టేషనువేపు పరుగెత్తు తున్నాం. అటునుంచి గూడ్సు బండి స్టేష న్‌లోకి ప్రవేశిస్తున్నది. ఎంత ప్రయత్నిం చినా దానిని దాటి ముందుకు పోలేక పోయాం.

మా ఇంటికి మాకు మధ్యన స్టేషను ప్లాట్‌ఫారం, రైలులైను, దానిమీద గూడ్సు బండి.

పెద్దకేకలు వినిపిస్తున్నాయి.

"శంకరాన్ని పట్టుకొని దేవికి బలిచె య్యాలి, వెదకండి"

దేనినేనా ఆపవచ్చుకాని ఉద్రేకంలో ఉన్న గుంపును ఆపలేం.

ఏం చెయ్యడం?

ఇంతలో రైలుకి సిగ్నలిచ్చారు.

బండి కదుల్తోంది.

బలవంతాన ఒక ఖాళీ వేగనులోకి నన్ను తోసి, రాజుగోపాలం స్టేషనువేపు వెళ్ళిపో యాడు.

గూడ్సుబండి పెద్దశబ్దం చేస్తూ ముందుకి పోయింది.

గాలినుండి, వర్షంనుండి రక్షించుకోడానికి ఒక మూలకు ఒదిగి పోయాను.

చచ్చిపోవాలనుకున్నవాడిని ఎందుకిలా వర్షానికి, గాలికి భయపడుతున్నాను?

భగవంతుడు ఎందుకు నన్నింకా బతికిం చాడు?

గాలివాన మరీ ఉధృతమయింది.

ఏ రాత్రి పదిగంటలకో అది వీరావేశంతో వాగన్‌ని ఊపివేసింది. ఎదో వంతెనమీద నుండి పోతుంటే రైలంతా నదిలో పడుతుం దేమో అనిపించింది.

ఆ గూడ్సుబండి విజయనగరంవేపు వెళ్ళ డంలేదు. మరునాటి మధ్యాహ్నానికి రాయ పూరు చేరుకుంది. రైలు ముందుకు పోతు న్నకొద్దీ గాలివాన పలచబడింది. రాయ పూరు చేరుకునేసరికి మబ్బులు తప్ప వర్షం లేదు.

ఎక్కడికిపోడం?

అన్ని ఊళ్ళు ఒకటే.

అక్కడనుండి కలకత్తా మెయిలెక్కాను.

కలకత్తానుండి వారణాసి చేరుకున్నాను.

ఘట్టాలతో తిరుగుతుంటే ప్రతి వాళ్ళు నన్ను బిచ్చగాడిగా తలచి డబ్బులు వేశారు.

ఒక సాయంకాలం అదేదో ఘాట్‌లో కూర్చున్నాను. అక్కడ అంత రద్దీలేదు. పై మెట్టుమీద కూర్చొని గంగానదిని, సూర్యాస్త మయాన్ని చూస్తూ పులకించిపోయాను. కనురెప్ప వాల్చకుండా ఆ సౌందర్యాన్ని ఆరాధించాను.

వెనుకన ఎవరో నిలుచున్నట్లు నాకు చాలసేపటి తరువాత తెలిసింది.

"బిడ్డా! నువ్వు కట్టిన బట్టలకి నువ్వు పద్మాసనం వేసుకొని సాయంసంధ్యా సౌందర్యం దర్శిస్తున్నవైనానికి ఏమీ పొంత నలేదు. నువ్వు చాలా సంస్కారమున్న వ్యక్తివి. జీవితంలో పెద్ద దెబ్బ తిన్నట్లు న్నావు. నువ్వు బాధలను మననం చేసుకొని దుఃఖించడంకన్న నారాయణసేవ చేస్తే మంచిది"

నా వెనుక నిలుచున్న మనిషి ఆజానుబా హువు. కాషాయవస్త్రాలు ధరించారు. ముఖంలో మందహాసం తాండవించుతు న్నది. చేతిలో పొడవుపాటి కర్ర మాత్రం ఉంది.

"నేను సాధూసమాజం కార్యదర్శిని. నీ

మనసు వికలమయినట్లు నీ బట్టలు, నీ ఆకారం చెప్తున్నాయి. నువ్వు నలుగురి మధ్య చెయ్యి చాపి, దొరికింది తిని, నీళ్ళు తాగి రోజులు వెళ్ళబుచ్చుతున్నావు. ఈ జీవితానికి నువ్వెంత తిన్నదనికాదు, నువ్వెంత పెట్టినదని ఆలోచించాలి. ఇతరులకు యివ్వడానికి నీ దగ్గిర ఏమీ లేదని చింతించనక్కరలేదు. భగవంతుడు అనుగ్రహించిన శరీరం, ఉదాత్తమైన మనసు నీకున్నాయి. వీటిని తోటి మానవుల సేవకు ఉపయోగించు"

నేను లేచి అతని ముఖంలోకి చూశాను.

అతని చూపులు నన్ను ఆకర్షించాయి. మానవసేవలో తాత్కాలికంగా నియుక్తుడనైనా, నా పరమార్థం మాత్రం సాహిత్యం, కళారాధన. వాటికి ఈ నారాయణసేవకు సరిపడదేమో?

ఆయన నా శంకలను అర్థంచేసుకున్నట్లున్నారు.

"నీ శరీరం, నీ మనసు మంచిదారి పట్టే వరకు నువ్వు మానవసేవ చెయ్యవలసిందే. తరువాత నువ్వు కోరిన దారిని వెళ్ళవచ్చు. సాధుసమాజం నీ గురించి శ్రద్ధతీసుకుంటుంది. ఉండడానికి వసతి, కట్టుకోడానికి బట్ట, తినడానికి తిండి సమకూర్చుతుంది. వాటికోసం ఇప్పటివలె నువ్వు వెతుక్కోనక్కరలేదు. ఏ మంచిపని చేయాలన్నా, నీ శరీరాన్ని, మనసును సరియైనస్థితిలో ఉంచుకోవాలి. ఈ రెండూ కుదుటబడితే నువ్వే నారాయణసేవ చేస్తావు. ఇది మానవ ప్రకృతి"

నేను వారి మాటలకు జవాబు చెప్పలేక పోయాను.

వారి పేరు స్వామీనిర్మలానంద. వారు నాకు ఒక జత కాషాయ వస్త్రాలిచ్చారు. ఒక పెద్దగదిలో ఎనమండుగురు సాధువులతో నన్నుండమన్నారు. నేలమీద పరచుకోడానికి ఒక తుంగచాప, కప్పుకోడానికి కంబళి, మంచినీటికి ఒక చెంబు యిచ్చారు. భోజనం ఆకులలో పెట్టేవారు. ఆశ్రమంలో వంటలు జరిగినా భిక్షాటనం చేసి తెచ్చిన భోజన పదార్థాలు వాటితో కలిపి పెట్టేవారు. అన్నం, పప్పు, ఒక కూర, మజ్జిగ పగటిపూట వడ్డించేవారు. రాత్రికి సుఖారొట్టెలు, వాటిలోకి పప్పో, పలుచని కూరో యిచ్చేవారు. నిద్రపోయేటప్పుడు ఒక గ్లాసు పాలు.

నాకు పెట్టేది సామాన్యమైన భోజనం కాదు. శరీరాన్ని, మనసుని నిలపడానికి సరియైన తూకంలో పెట్టిన సాత్వికాహారం.

తోటపని చేసే సాధువుకు జ్వరంగా ఉంటే, అతని జాగాలో పనిచేయమని నన్ను పంపించారు.

సాధూసమాజం ఆశ్రమంలో నాతో కలిపి నూరుమంది ఉన్నారు. ఒక ఎకరం జాగాలో, సగంభాగంలో ఆశ్రమముంది. మిగిలిన సగంలో పూలమొక్కలు, పాదులు ఉన్నాయి. కాయగూరలు పండించడం తప్పనిసరి అయింది. ఆ తోటను చూసే ముసలి సాధువుకు కాయగూరలు పండించడం తోటే కాలం గడిచిపోయేది. నేను ఆశ్రమంలో చేరిన తరువాత కాయగూరలు సమృద్ధిగా పండించడమేకాక, మళ్ళుకట్టి శ్రద్ధగా పూల చెట్లను పెంచాను.

ఆశ్రమ జీవితం నాకు ఊహకు అతీతమైన క్రమశిక్షణ యిచ్చింది. ఉదయం కాకుండా దినం ప్రారంభమయేది. ధ్యానం, యోగాభ్యాసం, స్నానసంధ్యలు, ప్రాతఃకాల అల్పాహారం, నిర్ణీతమైన పని, మధ్యాహ్నాభోజనం, కొద్దిసేపు విశ్రాంతి, సద్గోష్ఠి, తిరిగి పని, సాయంకాల ప్రార్థన, లఘువుగా రాత్రి భోజనం, నిద్రకు ముందు నారాయణస్మరణ ఇది దైనందిన కార్యక్రమం. ఈ విధంగా రోజు తరువాత రోజు ముందుకు సాగింది. అందుచేత పడిన శ్రమ మంచి ఫలితాలని

చ్చింది.

నేను వచ్చేసరికి వర్షాకాలం ముగిసింది.

ఆశ్రమంలో తులసిమొక్కలు, మందారం మొక్కలు, పూజకు పనికివచ్చే మరో రెండు రకాల మొక్కలు మాత్రమే చెల్లాచెదరుగా ఉండేవి. స్వామివారిని ఒకరోజు, గులాబీ మొక్కలు, చేమంతులు, మల్లెలు వీటిని పెంచవచ్చునా అని అడిగాను. ఆయన చాలా సేపు ఆలోచించారు. ఈ పూవులు మనసులో శృంగారభావాలు కలుగజేస్తాయ నడంలో ఎటువంటి సందేహంలేదు. నియమబద్ధమైన బ్రహ్మచర్యజీవితం గడుపుతున్న ఆశ్రమవాసుల మనసులలో సౌందర్య తృష్ణను పెంపొందించడం మంచిదా కాదా అని వారు సందేహించారు. తరువాత వారు సెలవిచ్చారు.

"భగవంతుడి సృష్టిలో వీటికి కూడా స్థానముంది. ఈ పుష్పాలు కనులకు యింపుగా ఉంటాయనడంలో అతిశయోక్తిలేదు. ఆ విధంగా మనసును కూడా అవి ఆనందింపజేస్తాయి. మనసు అన్ని ఇంద్రియాలను నడిపిస్తుంది. ఆశ్రమవాసులలో మనస్సంయమనం నేను గమనించాను. కాబట్టి ఈపాటి కొత్తదనం వారిలో ఏమార్పు తీసుకురాదు. కొందరి చేతులలో మొక్కలు చక్కగా పెరుగుతాయి. నీచేతి నీరు వాటికి యవ్వనం ప్రసాదిస్తున్నది. నువ్వీ పనిచేయడానికి నారాయణాశీర్వాదం కోరుతున్నాను"

చలికాలం మూడు నెలలూ శక్తివంచనలేకుండా తోటలో పనిచేశాను. రమారమి నాలుగోవంతు ఎకరం జాగాలో గులాబీ మొక్కలు, చేమంతి మొక్కలు, మల్లెమొక్కలు, దేవకాంచనం మొక్కలు, నందివర్ధనం మొక్కలు తెచ్చి నాటాను. గులాబీలు మూడు నాలుగు రకాలు తెచ్చివేశాను. గెత్తాం తెచ్చాను. ప్రాణంతో సమానంగా వాటిని పెంచాను.

నేను పడ్డ శ్రమ వసంతంలో పుష్పించింది. ఆశ్రమవాసులకు సమృద్ధిగా కూరలు దొరుకుతున్నాయి. బొప్పాయి పళ్ళు విస్తారంగా పండుతున్నాయి. అరటిపళ్ళు, గెలలు గెలలుగా దిగుతున్నాయి.

నేను కాశీలో ఏచోట్లకూ చాలా కాలంవరకూ వెళ్ళలేదు. వర్షాలు పడ్డతరువాత తోటపని అవసరంలేక, నాకు వ్యవధి దొరికితే అన్ని చోట్లకు వెళ్ళివచ్చాను. ఆశ్రమం, తోట, దేవాలయాలు సేవింపదగినవై, మరే ప్రాపంచిక చింతన నా మనసులో చోటుచేసుకోలేదు.

కాని, గులాబులు నన్ను మోసగిస్తూ ఉండేవి. ఏ పారసీక రాజకన్యల కపోలాల మీదో తమ సొగసును చూసుకోవలసిన ఆ పూవులు, బ్రహ్మచారుల పెరట్లో పెరిగి, రేకులు రాల్చడం చాలా కష్టంగా ఉండేది. ఇక చామంతుల మాట చెప్పనే అక్కరలేదు. గంగమట్టిలో ఆ గుణముంది. వేసవిలో, రాత్రి, గాలిపిల్లలు మల్లెల తావులను మోసుకొని వస్తే ఆశ్రమవాసులు పరవశించేవారు.

రోజురోజుకి నా ఆరోగ్యం మెరుగయింది. మనసు నిర్మలంగా ఉండేది. మళ్ళీ జీవితం మీద ఆసక్తి పెరిగింది.

నేను వచ్చి పదహారు నెలలయింది.

ఒకనాడు సాయంవేళ స్వామివారు ధర్మోపన్యాసం పూర్తిచేసిన తరువాత, వారిని గదిలో ఒంటరిగా కలిసి నాకు సెలవిప్పించమని కోరుకున్నాను.

"నాకీ సంగతి తెలుసు. నీమీద ఆశ్రమవాసులమందరం ఆశలు పెట్టుకున్నాము. ఒక సంగతి మాత్రం నిజం. ఆశలు మా వంటి వారికి తగవు. ఏదో రోజు నువ్వు వెళ్ళిపోతానంటే ఏంచేయాలనుకున్నాను. భగవంతుడు నిన్ను తెచ్చినట్లే మరొకరిని తెస్తాడు. ఈ కొద్దిపాటి ఆశ్రమజీవితం నీ శేషజీవి

తాన్ని ధర్మపథంలో నడిపిస్తుందని నేను విశ్వసిస్తున్నాను. నీకు నారాయణాశీర్వాదాలు"



రైలు పెద్ద కుదుపుతో ఆగిపోయింది.

సోములు లేకపోవడం నాకు కుడిచేయి విరిగినట్లే ఉంది. బయలుదేరేటప్పుడు కంపార్టుమెంటులో దీపాలు మినుకుమినుకుమంటూ ఉండేవి. రైలు నడుస్తుంటే అవి బాగుపడతాయని అనుకున్నాను. కాని బాటరీ పాడయి క్రమంగా అవి నీరసించిపోయి, అవి ఉన్నాలేకపోయినా, ఒకటే అన్న స్థితికి వచ్చాయి.

నేను కూర్చునే ఉన్నాను.

గాలి విపరీతమైన జోరుతో వీస్తోంది.

వర్షం క్షణక్షణానికి హెచ్చుతోంది.

రైలెందుకాగిపోయింది?

కిటికీ తలుపు పైకెత్తడానికి ప్రయత్నించాను.

సగంవరకు లేచి అది ఉండిపోయింది.

వర్షపు జల్లులు ఉప్పెనగా లోపలికి వచ్చి పక్క తడిసిపోయింది.

బైట గాఢమైన అంధకారం.

అప్పుడప్పుడు మెరసే మెరపుల వెలుగులో నేలకు తలలు మోదుకుంటున్న చెట్లు చేమలు కనిపించాయి.

నేను లేచి ఇంజనువేపు వెళ్ళాలని ప్రయత్నంచేశాను. కాని సాధ్యంకాలేదు. మరొక్క పదినిమిషాలలోనే డ్రైవరు మునిస్వామి నా దగ్గరికి వచ్చాడు. పెద్ద వర్షపుకోటు, పైన టోపీ, చేతిలో టార్చిలైటు- అతను నా దగ్గరకి వచ్చాడు.

"దొరగారు! కటింగులో ఒక పెద్దరాయి దొర్లి పట్టీల మధ్యన పడింది. పది పదిహేను మంది, గునపాలు గడ్డపారలు తెచ్చి దానిని కొంతదూరం దొర్లించుకుపోయి, అక్కడ పక్కకు తొలిగించాలి. అంతవరకు బండి ముందుకుపోదు"

ఇంజను కోసి ముందుకు పంపించడానికి దారిలేదు. ట్రెయినంతటినీ వెనక్కు నడిపించడానికి ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి. పని వాళ్ళు రావడానికి ఈ రాత్రి అవుతుందా?

"పొందూరు ఎంత దూరంలో ఉంది? " అడిగాను.

"రెండు మైళ్లు"

"రైలు లైనుకి ఎంత ఎత్తులో రాయి ఉంది? "

"అడుగున్నరయెత్తు"

"రాయి గుండ్రంగా ఉందా; లేక పలకలు దేరి ఉందా? "

"రమారమి గుండ్రంగానే ఉంది"

"ఒకప్పుడు నువ్వు రాతిని గుర్తించకుండా దానిని తాకితే ఏమయేది? "

"ఈ రాయి నల్ల సానరాయిలా కనిపిస్తోంది. అటువంటి పని జరిగినప్పుడు రైలులైను దెబ్బతిని, ఇంజను పట్టాలు తప్పి పడిపోతుంది"

"మునిస్వామి! నువ్వు చాలా ధైర్యంగలవాడివి. మంచి నేర్పుగలవాడివి. నీ మాటల

ప్రకారం ఒక ఇరవై అడుగులదూరం రాతిని దొర్లించినట్లయితే, లైను కుడివేపు వంపుతిరుగుతుంది. కొద్దిగా ప్రయత్నం చేస్తే అక్కడ రాతిని పక్కకు నెట్టవచ్చు"

"ఒకవేళ ఇంజను పట్టాలు తప్పితే? "

"మునిస్వామి! వేలకొలది ప్రయాణికులను గమ్యం చేర్చడం మన లక్ష్యం. నువ్వు చాలా అనుభవం కలవాడివి. నేను బాధ్యత వహిస్తున్నాను. తొందరగా ముందుకు నడుపు"

మునిస్వామి నేను చెప్పినట్లే చేశాడు. రాతిని జాగ్రత్తగా పక్కకు తొలగించాడు.

రైలు చాలా మెల్లగా నడిచింది.

ఒక ఇరవై నిమిషాల తరువాత వేగం హెచ్చింది.

మరొక్క పావుగంటలో రైలు పొందూరు స్టేషనులో ఆగింది.

ఈసారి చిన్న మాస్టరు, మునిస్వామి యిద్దరూ నా దగ్గిరికి వచ్చారు.

నా రిస్టువాచిలో రెండు గంటలయింది.

"మునుస్వామి! మూడుగంటలయేసరికి మనం మధ్యనున్న రైలు వంతెనదాటి దూసి స్టేషను చేరుకోగలమా? "

"మెయిలయితే పదినిమిషాలు, పాసింజరైతే పదిహేను నిమిషాల్లో పక్క స్టేషను చేరుకోవచ్చు ఇప్పుడెంతకాలం తీసుకుంటారో డ్రైవరుగారు? " అన్నాడు చిన్నమాస్టరు.

"అయ్యా! గాలి ఎన్ని మైళ్లవేగంతో వీస్తున్నదో? అది మన బండివెనుకనుండి వీచితే ముందుకు వేగంగా పోగలం. కాని, ఇది ఎదురుగాలి. ఈ ప్రకృతికి ఇంతశక్తి ఉందంటే ఎవరూ నమ్మరు. నేను ఎంత ప్రయత్నించినా గంటకు ఇరవైమైళ్ళు మించి ముందుకు పోలేకపోతున్నాను. ఈ రెండు స్టేషన్లమధ్య ఏడుమైళ్ళ దూరముంది. అందుచేత రెండున్నరకు పక్క స్టేషను చేరుకోవచ్చు"

అతను ఒకక్షణం ఆలోచించి మళ్ళీ అన్నాడు.

"కాని, దానికి కూడా ఒక అభ్యంతరముంది"

"చెప్పు" అన్నాను నేను.

"దారిలో ఆటంకాలు ఉండరాదు"

"గాలీవానావస్తే కథే లేదు" అన్నాడు నవ్వుతూ చిన్నమాస్టరు.

ఆ వచ్చింది గాలివాన.

అందుకే డ్రైవరు యింజను చేరుకొని, నడిపేసరికి మరో పావుగంట పట్టింది.

నా మనసు ఎందుకో తీవ్రంగా ఆందోళన చెందుతోంది.

ఇటువంటి సమయాలలో సోములుంటే చాలా బాగుండేది. సంకట పరిస్థితులలో వాడు చాలా మంచి సలహాలిచ్చేవాడు.

ఒక గంటసేపు నా మనసు స్వాధీనం తప్ప కూడదు. ఈ మూడో గాలివాన నా జీవితాన్ని నాశనం చేస్తుంది. నా అంతరాత్మ చెప్తున్నది. అంతకుపూర్వం రెండు గాలివానలలోను నేను చచ్చి బతికాను. ఈ మూడో గాలివాననుండి తప్పించుకుందామని డాక్టరుగారిని పిలిపించినా ఏమీ అనుకూలించలేదు. తప్పనిసరిగా నేను మృత్యుగహ్వారంలోకే ప్రయాణం చేస్తున్నాను.

సోములుంటే బాగుండేది.

వాడు చాలా సమయస్ఫూర్తిగా వ్యవహరిస్తాడు...

అసలు నాకు ప్రమోషను దొరికిన మొదటిరోజుల్లో సోములు ఒక సమస్యగా నిలిచాడు. అప్పటికి వాడు ఆరు నెలలయి సస్పెన్షన్‌లో ఉన్నాడు. వాడికి సగం జీతం యిస్తున్నారు. వాడు డ్యూటీలో ఉన్న

చిన్నమాస్టరును పదిమంది ఎదుట ముఖం మీద బలంగా పిడికిలితో కొట్టాడు. దానితో అతని ఎడంచెంప చిట్లిపోయింది. మూడు కుట్లు పడ్డాయి. దిగువ వరుస ముందు పళ్ళు మూడు ఊడిపోయాయి. డాక్టరుగారి సర్టిఫికెటు, పదిమంది సాక్షులు ఈ విషయం ధృవపరుస్తూ స్టేట్‌మెంట్లు ఇచ్చారు.

సోములు చాలా తలబిరుసు మనిషి. రైతుబిడ్డ. కండలు తేరిన శరీరం. వాడు సాధారణంగా తక్కువే మాట్లాడతాడు. (బహుశా నేనొక్కడినే దీనికి అతీతమైనవాడిని). నాతో వాడు గంటల తరబడి మాట్లాడుతాడు. వాడి పెళ్లాంతో కూడా అంత మాట్లాడడట. అబద్ధమాడడు. ఎవరి పనులలోను జోక్యం కలిగించుకోడు. ఇది నా అభిప్రాయం. చాలామంది వాడు తలబిరుసువాడని, రౌడీ అని అంటారు. ఏదయితేనేం వాడు ముద్రవేసిన నేరస్థుడు.

నేను సీనియరు ఇనస్పెక్టరుగా ప్రమోషను తీసుకున్న తరువాత ఒక్క వారంరోజులలో సోములు కేసు విచారణ పూర్తి చేయవలసిందని అధికారులు ఒత్తిడి తెచ్చారు.

జూన్ నెల ఆరో తారీకున సోములు అనబడే లాంప్‌మాన్ తన విధులు సరిగా నిర్వర్తించనందున ఆరు ట్రెయిన్లు ఫలానా స్టేషనులో చాలా లేటయ్యాయని, డివిజన్‌లో రైళ్ల రాకపోకలు బాగా దెబ్బతిన్నాయని ఫలానా చిన్న మాస్టరు రిపోర్టు చేశారు. ఆ విషయం మరునాడు తెలుసుకున్న సోములు, పదిమంది సాక్షులముందు, ఉద్యోగంలో ఉన్న ఫలానా చిన్నమాస్టరును నానా దుర్భాషలాడి, అతని ముఖంమీద బలంగా కొట్టాడు. చిన్న మాస్టరుగారి ముఖానికి దెబ్బలు తగిలి పళ్లూడడమే కాకుండా, చెంపలు చిట్లి మూడు కుట్లుపడ్డాయి. ముఖం చాలా వికృతంగా తయారయింది. అందరు సాక్షుల వాంగ్మూలాలు, చిన్నమాస్టరు రిపోర్టు, డాక్టరు సర్టిఫికెటు ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి. విధి నిర్వహణలో ఉన్న బాధ్యత గల ఉద్యోగిని కొట్టడం, అంగవైకల్యం కలిగించడం తీవ్రమైన అపరాధాలుగా ప్రభుత్వంవారు పరిగణించి సదరు సోములుని ఉద్యోగంనుండి తొలగించడానికి నిశ్చయించారు. సదరు సోములు ఈ విషయంలో తన అభ్యంతరాలు ఏవైనా ఉంటే ఒక నెలరోజులలో ప్రభుత్వానికి అతను తెలియజేయాలి. ఈ వ్యవధిలో జవాబు రాకపోయినా, జవాబు సరియైనది కాకపోయినా, సదరు సోముల్ని ఉద్యోగంనుండి తొలగించడం జరుగుతుంది.

ఈ ఛార్జిషీటుకు వాడు ఒక్కటే సమాధానమిచ్చాడు.

ప్రభుత్వంవారు నా ఉద్యోగం తీసివేయడానికి కృతనిశ్చయులై ఉన్నారు. కాబట్టి నేను జవాబు ఇవ్వడానికి నిరాకరిస్తున్నాను.

నిరపరాధిని శిక్షించడం, అపరాధిని విశృంఖలంగా విడిచిపెట్టడం శిక్షాస్మృతి ఆమోదించదు. నిందితుడికి అన్ని సౌకర్యాలు కల్పించి, విచారించి, దోషం నిరూపించిన తరువాత శిక్ష విధించాలి. ఇది ప్రాధమికంగా జరగవలసినపని.

సోములు కేసు నాకు పెద్ద సవాలుగా ఎదురయింది.

ఏ విచారణకైనా ముందు సాక్షులనందరినీ ప్రశ్నించి వివరాలు రాబట్టాలి. పదిమంది సాక్షులు, చిన్నమాస్టరు అందరూ ఒకేవిధంగా చెప్పారు.

నిందితుడి విచారణ ఆఖరున జరిగింది.

నేను విచారణ జరిపే అధికారిని. కాబట్టి నేను సోములుతో ప్రయివేటుగా మాట్లాడకూడదు. మరెవరిని కూడా వాడి గురించి అడగకూడదు.

విచారణ జరిపేటప్పుడు నిందితుడు తక్కువ ఉద్యోగి అయినా కుర్చీలో కూర్చోబెట్టాలి. ఈ పనికి సోములు ఒప్పుకోలేదు. బలవంతంచేసి కూర్చోబెట్టాను.

"సోములూ! ఆరునెలల కింద జరిగిన సంగతిది. వివరాలు నీకు బాగా జ్ఞాపకము న్నాయనుకుంటాను"

సోములు నవ్వాడు.

"ఇనస్పెక్టరుగారు! ఇందులో వివరాలేము న్నాయి. దీపాలు వెలిగించావా అని మీరడుగుతారు. వెలిగించానని నేను చెప్తాను. అంతకన్న వివరాలు మీకేం కావాలి? "

"అవునులే. అయినా నేను ఆ పరిస్థితులను పూర్తిగా అర్థం చేసుకోడానికి నిన్ను కొన్ని విషయాలడుగుతాను"

"దానికేం! మీరు అడగడానికే వచ్చారు. అయినా నేనొక ప్రశ్న వేస్తున్నాను. నేను చిన్న మాస్టరుగారి ముఖం బద్దలుకొట్టాను. అతను చాలా చక్కటివాడు. అతని ముఖం ఇప్పుడు మచ్చలతో చూడశక్యం గాకుండా ఉంది. నేను నేరం ఒప్పుకుంటున్నాను. ఇంకా విచారణ దేనికి? "

వాడలా అంటే నేనెలా తీర్పు రాయగలను?

అందరూ నామీదే కన్నుంచి నేనేం తీర్పు ఇస్తానో అని చూస్తున్నారు. కిందితరగతి పనివాళ్లకు సోములుమీద మంచి గౌరవముంది. మధ్యతరగతి ఉద్యోగులకు దెబ్బతగిలిన చిన్నమాస్టరుమీద మంచి అభిప్రాయముంది. ఎవరి పక్షాన తీర్పు ఇచ్చినా రెండవ పక్షంవారికి అవమానంగానే పరిణమిస్తుంది. సాధారణంగా, ప్రమాదాలు జరిగేటప్పుడు చిన్న తరగతి ఉద్యోగిమీద నేరం మోపి, వాడికి శిక్షవేసి, కేసు మూసేస్తారు. కాని, నాకిది నచ్చలేదు. నా సెక్షన్‌లో పని బాగా జరగాలంటే మధ్యతరగతి ఉద్యోగులెంత అవసరమో, కింద తరగతివాళ్లు అంతకంటే అవసరం.

అందరూ అనుకున్నట్లు నెలలకొలదీ విచారణ పొడిగించలేదు. పదిహేనురోజుల్లో ముగించి పై అధికారులకు రిపోర్టు పంపించాను. దానికి ముఖ్యకారణం సోములు చాలాకాలమయి సగం జీతంమీద ఉండడం. వాడు చేసిన తొందరపాటు పనికి వాడి కుటుంబం ఒక పూటతిని ఒక పూట పస్తులుంటున్నది.

నా తీర్పు ఈవిధంగా సాగింది.

సోములు లాంప్‌మాన్ ఉద్యోగం చేస్తున్నాడు. జూన్ నెల ఆరోతారీకు ఉదయం అతను సిగ్నలు దీపాలు అన్నింటిలోను కిరసనాయిలు నింపి సిద్ధం చేసి ఉంచాడు. సాయంకాలం వాటిని వెలిగించివచ్చాడు. ఆ దీపాలు రాత్రి పన్నెండుగంటలవరకు బాగానే వెలిగాయి. అటుపిమ్మట అన్నీ ఆరిపోయాయి. ఆ రాత్రి ఎగువకుపోయే మూడు రైళ్లు, దిగువకు పోయే మూడు బళ్లు రాత్రి ఒంటగంటనుండి ఉదయం నాలుగుగంటల మధ్య ఆ స్టేషనుమీద నుంచి పోయాయి. ప్రతిరైలు అరగంట లేటయింది. సోములు ఈ రైళ్లన్నిటికి కాషన్ ఆర్డర్లు ఇవ్వడానికి చివరి సిగ్నలువరకు నిర్విరామంగా నడిచాడు.

విచారణలో కొన్ని విషయాలు బైటపడ్డాయి. సోములికి సదరు చిన్నమాస్టరుకి ఏవిధమైన పాతపగలుకాని కొత్తపగలు కానీ లేవు. స్టోరు సామానులు ఆ నెల సకాలంలో చేరలేదు. ప్రభుత్వం సప్లయిచేసిన కిరసనాయిలు అయిపోయింది. పైనున్న దుకాణంనుండి కిరసనాయిలు కొని దీపాలలో పోశారు. సోములు ఆ ఉదయం ఆరుగంటలకు డ్యూటీకి వచ్చినవాడు, ఇరవైనాలుగు గంటలు పనిచేశాడు. అతను తరువాత ఛార్జీ తీసుకోవలసినవాళ్లు ఇద్దరూ గైరుహాజరయ్యారు. రాత్రి దీపాలు వెలిగించినప్పుడు, అప్పుడు డ్యూటీలో ఉన్న చిన్న

మాస్టరుకు, కిరసనూనె నాసిరకందని సోములు చెప్పాడు. కాని అతను వినిపించు కోలేదు. డ్యూటీకి పన్నెండు గంటలరాత్రికి వచ్చిన మరొక చిన్న మాస్టరుకు కూడా అదే చెప్పాడు. కాని అతను పట్టించుకోలేదు. అందుకు ఫలితంగా దీపాలు ఆరిపో యాయి. అయినా సోములు రాత్రంతా శ్రమపడి, రైళ్లు నడపడానికి సహాయం చేశాడు. ఏ ఉద్యోగీ అతని శ్రమను గుర్తిం చలేదు. పైగా రాత్రి డ్యూటీలో ఉన్న చిన్న మాస్టరు, నిర్దాక్షిణ్యంగా, ఆరు రైళ్లు సోములు అశ్రద్ధ కారణంగా ఆలస్యమయ్యా యని నాలుగుపేజీల రిపోర్టు వ్రాశాడు. మర్నాడు స్టేషనుకి వచ్చిన సదరు చిన్న మాస్టరుని ఈ విషయమే అడిగితే, సోము లుని నలుగురి ఎదుట నిందించి, దుర్భాష లాడి రెచ్చగొట్టాడు.

పౌరుషం గల సోములు దీనికి ప్రతిస్పం దించాడు.

తరువాత జరిగిన సంగతికి అందరూ సాక్షులే. ఈ నేరానికి సోములుని ఉద్యోగం నుండి తీసివేయాలి.

ఈ విషయం పునరాలోచించాను.

సోములు చాలా నమ్మకమైన పనివాడు. ఇతడు మెలకువగా ఉండడంచేత, అంతకు పూర్వం, నాలుగు రైలుప్రమాదాలు తప్పిపో యాయి. రైళ్లు సురక్షితంగా నడపడానికి ఇటువంటివాళ్లు చాలా ముఖ్యం. శిక్షించడం కన్న క్షమించడం చాలా గొప్పది. ఉద్యోగు లలో వర్గాలు ఏర్పడితే ఏడుగురు కోడళ్ల మచ్చు అవుతుంది. ఈ విషయం చిన్న మాస్టర్ల సంఘం కూడా ఒప్పుకుంది. నాలు గవ తరగతి ఉద్యోగుల సమాఖ్యవారు కూడా అంగీకరించారు. ఈ చిన్న నిప్పురవ్వ రాజీ కార్చిచ్చు కాకముందే ఆర్పడం అవ సరం.

సోములుని క్షమించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అతని తొందరపాటుకి ఒక సంవత్సరం ఇంక్రిమెంటు ఆపేసి, మరొక స్టేషనుకి బదిలీ చేయమని సిఫారసు చేస్తు న్నాను.

నా రిపోర్టు అన్నివర్గాలవారు సంతో షంతో స్వీకరించారు.

సోములుని మరొక స్టేషనుకి బదిలీ చెయ్యడాన్ని మాత్రం ఆ స్టేషనువాళ్లు ఒప్పు కోలేదు.

ఇది నా విజయమని చెప్పుకోవడంకంటే ఇది నాకూ నాతో పనిచేసేవారికి మధ్య ఒక ఉత్తమమైన అనుబంధాన్ని సృష్టించిందని చెప్పడం మేలు.

అందరితో కలిసి పనిచేసి, వాళ్ల చిన్న చిన్న సరదాలను గుర్తించి, లోపాలను సవ రించి, వారి కష్టాలలో భాగం పంచుకొని పనిచేశాను. ఈవిధంగా నా ఉద్యోగం ఒక భారంగా తోచక ఒక దివ్యమైన అనుభ వంగా రూపొందింది. నాకూ వాళ్లకూ మధ్య అంతస్తులు తొలగిపోయి అందరం ఒక కుటుంబానికి చెందిన వాళ్లమనే భావం నెలకొంది.



ఏదో గంభీరమైన నిశ్శబ్దం.

తుఫాను ఒక్కసారి ఆగిపోయింది.

చేతివాచీ చూసుకున్నాను.

సరిగ్గా మూడు గంటలయింది.

ఈవేళకు తుపాను తీరం దాటుతుందని రేడియోలో చెప్పారు. ఈ తుఫాను సర్పాకృతిలో ప్రయాణం చేస్తున్నదని, తీరం దాటేటప్పుడు గాలులు నూటఅరవైమైళ్ల వేగంలో వీచగలవని పల్లపు జాగాలలో ఉన్నవాళ్లు ఎత్తు ప్రదేశాలకు పోవాలని చెప్పారు. సముద్రంలో కెరటాలు రెండు తాటిచెట్ల ఎత్తులో లేచి తీరాన్ని ముంచివేస్తాయి.

ఇటువంటి తరుణంలో నేను ఎందుకు సోములు సంగతి మననం చేస్తున్నానో నాకే అర్థమవడంలేదు.

వాడుంటే చాలాపనులు తొందరగా చేసేవాడు.

రైలు, బ్రిడ్జిమీదికి వచ్చినట్లు శబ్దం.

ఫస్టుక్లాసు ఆరుబోగీల తరువాత ఉంది.

రైలు గంటకు రెండుమైళ్ల వేగం కంటె తొందరగా నడవడంలేదు. కానీ గాలి లేనప్పుడు వేగంగా నడిపి బ్రిడ్జి దాటవచ్చుకదా! ఎందుకు మునిస్వామి ఆలస్యం చేస్తున్నాడు?

నేను లేచాను.

నీరసంగానే ఉంది. తాగడానికి కాఫీ కొంచెమైనా ఫ్లాస్కులో లేదు.

పంచకట్టుకున్నవాడిని, అలాగే కిందికి దిగి ఇంజనువేపు వెళ్లి, మునిస్వామితో కూర్చుందామనుకున్నాను.

ఏపని చేయడానికి తోచడంలేదు.

రైలువంతెన పడమటినుండి తూర్పువేపుకు పోతున్నది. నది ఉత్తరంనుండి దక్షిణానికి పారుతున్నది. ఒక్క పదిమైళ్లు ప్రవహించి మోసుబందరుదగ్గిర సముద్రంలో కలుస్తుంది.

సాయంకాలం రేడియోవార్తలలో తుఫానుకేంద్రం మోసుబందరు కళింగపట్నం రేవుల మధ్య తీరం దాటుతుందన్నారు.

అది తొమ్మిదిగంటలకిందటి వార్త. ఈ తుఫాను ఒక పద్ధతిలో ప్రయాణం చెయ్యడంలేదు. తీరానికి నాలుగువందల మైళ్ల దూరంలో ఉన్నప్పుడు మద్రాసు నెల్లూరుల మధ్య, భూమిమీద ప్రవేశిస్తుందని అన్నారు. కొన్ని గంటల తరువాత మూడు వందల మైళ్ల దూరంలో ఉన్నప్పుడు నెల్లూరు మచిలీపట్నాల మధ్య దాటవచ్చునని అన్నారు. రెండువందల మైళ్లు వచ్చేసరికి మచిలీపట్నం కాకినాడ మధ్యకు ఆ స్థలం మారిపోయింది. కాకినాడ విశాఖపట్నం రేవుల మధ్య కూడా అది తీరం దాటలేదు. బహుశా ఇది చివరి మజిలీ కాబోలు. ముందు మోసుబందరు- తరువాత కళింగపట్నం. ఈ రెండిటి మధ్య దాటే సూచనలున్నాయని, అది కూడా రాత్రి పన్నెండు తరువాతనే బహుశా మూడు గంటలవేళకి ప్రళయం సంభవిస్తుందని వార్తలు చెప్పాయి.

ప్రళయం సంభవించినప్పుడు దిక్కులు కాలిపోతాయి. ఉల్కలు రాలిపడతాయి. తోకచుక్కలు తోస్తాయి. ఎన్నో విపరీతాలు సంభవిస్తాయి.

ఆలోచించాను. పేపర్లలో ఇటువంటి సంగతులేవీ రాలేదు. ప్రజలెవ్వరూ తోకచుక్కలు చూశామని చెప్పుకోలేదు. ప్రకృతిలో జరిగే అసాధారణమైన మార్పులకు మానవుడు భయపడనక్కరలేదు. ఈ గాలివానలు భూమి, సముద్రాలు, నదులు పుట్టిన నాటినుండీ ఉన్నాయి. దీనికి భయపడడంలో అర్థముందా?

నాకు జాతకాలమీద నమ్మకం లేదు. ఎవరో సాధువు, నేను రైలులో ప్రయాణం చేస్తుంటే తారసపడ్డాడు. నా ముఖంలోకి చూస్తూ 'నీకు ఆరు నెలలలో మరణం సంభవిస్తుంది' అని చాలా గంభీరంగా నిశ్చ

యంగా చెప్తుంటే ప్రశ్నలు వెయ్యడానికి కూడా నాకు మనస్కరించలేదు. ఏ జపాలు చేయించాలి, ఏ మంత్రాలు చదవాలి, ఏ రక్షరేకులు కట్టుకోవాలి? మొదలైన ప్రశ్నలు వేస్తానని అతను అనుకున్నాడేమో! కొంచెంసేపు అతను మౌనంగా ఉండి మళ్లీ అన్నాడు.

"బిడ్డా! దీనినుండి తప్పించుకోడానికి ఒక్కటే మార్గముంది. ఈ ఆరునెలలూ నువ్వు మృత్యుంజయ మంత్రం చదువు. అంతకుమించి మరేదీ నిన్ను రక్షించలేదు"

ఆ వారాంతంలో ఇంటికి తిరిగివచ్చాను. స్నానంచేసి సూర్యుడికి అభిముఖంగా నిలిచి మంత్రం చదవాలని ప్రయత్నం చేశాను. ఎవరో కలకత్తానుంచి టెలిఫోనులో పిలుస్తు న్నారంటే అన్ని మంత్రాలు వెనక్కు పెట్టి పరుగెత్తాను. పిమ్మట, ఆ సంగతి ఇప్పుడే జ్ఞాపకం వచ్చింది.

మరణం సమీపిస్తున్న సమయంలో ఏ మంచి సంగతులు తలచుకోవాలి? ఎవరిని గురించి తలచుకోవాలి?

అప్పుడు నాకు కాశిలో సాధూసమాజం ఆశ్రమంలో నేను వేసిన గులాబీతోట జ్ఞాపకం వచ్చింది. ప్రాతఃకాలవేళ మంచు బిందువులుపడి ఆ పూవు రేకులు సొగసులు పోతున్న వైనం జ్ఞాపకం వచ్చింది. స్వామీ నిర్మలానందగారి ముఖంలో ఒక దివ్యమైన కాంతి నాకు కనిపించింది. అన్నిటికన్న ముఖ్యంగా, నేను కొండశిఖరంనుంచి దూకి ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నం చేస్తుంటే, వెనుకపాటుగా వచ్చి నా కాళ్లు బలంగా పట్టుకొన్న రాజుగోపాలంనాయుడు ముఖం జ్ఞాపకం వచ్చింది.

రైలు పూర్తిగా ఆగిపోయింది.

ప్రమాదకరమైన పరిస్థితులలో రైలును ఆపవలసి వచ్చినప్పుడు, వంతెనలమీద ఎటువంటి తరుణంలోను ఆపరాదు. అన్ని రూల్సు క్షుణ్ణంగా తెలిసిన మునిస్వామి ఎందుకీవిధంగా రైలు ఆపాడు.

నది చాలా ఉధృతంగా ప్రవహిస్తోంది. వరదహోరు చాలా భయంకరంగా ఉంది. బ్రిడ్జి చాలా ఎత్తులోనే ఉంది. పైగా ఇది ఇనుపగర్డర్లతో నిర్మించినది. చాలా వరదలకు చెక్కుచెదరకుండా ఇప్పటివరకు నిలిచిన వంతెన ఇది. ఎంత వేగంతోనైనా దీని మీద రైలు నడపవచ్చు

మరెందుకు మునిస్వామి మధ్యంతరంగా బ్రిడ్జిమీద రైలు ఆపాడు?

ఈ సంగతి కనుక్కోడానికి పైంటు, చొక్కా తొడుక్కోవాలని అనుకున్నాను. పైన గాలి లేకపోయినా వర్షం ఒక మాదిరిగా పడుతున్నది. ఆ ఒక్క జతతో రైలెక్కాను. అది తడిసిపోతే మార్చుకోడానికి మరి తెచ్చుకోలేదు.

పంచ వెనక్కు మడిచి సైకిలు కచ్చుకట్టాను. చెప్పులు తొడుక్కున్నాను. గాలి లేదు. నా బోగీకి ముందు కొన్ని పెట్టెలు బ్రిడ్జిమీద ఉన్నాయి. నా బోగీలో సగం భాగం బ్రిడ్జిమీద, మిగిలినది బైట ఉంది. వెనుకనుండి దిగి పరిస్థితి చూసి జాగ్రత్తగా ఇంజనువేపు పోవాలి.

అత్యవసర పరిస్థితులలో ఎటువంటి సాహసమైనా చేయాలి.

దూరాన్న ఏదో శబ్దం.

ఆ శబ్దం రాళ్లు దొర్లించినట్లు వినిపించింది.

దక్షిణంవేపున్న తలుపు తెరవబోయి ఒక క్షణం ఆగాను. గాలి మళ్ళా మొదలుపెట్టింది. వర్షం హెచ్చుతోంది. ఆ తలుపు తీస్తే వర్షం, గాలి లోపలికి ప్రవేశించి తలుపు మూయడం కష్టమవుతుంది.

అక్కడనుండి ఉత్తరంవేపున్న తలుపు చేరుకున్నాను. చిడతతీసి, మెల్లిగా తలుపు తెరచాను. ఏమీ ఇబ్బంది కలగలేదు. చాలా జాగ్రత్తగా కిందికి దిగాను.

నది అంచులకు తగులుతూ పారుతోంది. నా దగ్గిర టార్చిలైటు కూడా లేదు. మెల్లిగా వంతెనవేపు అడుగులు వేశాను. ఆకాశం పెద్ద మెరుపు మెరిసింది. ఆ వెలుగులో ఏరు, వంతెన, ఇంజను అన్నీ కనిపించాయి.

వరదలో ఏదో మహావృక్షం కొట్టుకొని వచ్చింది. అది వంతెనను తాకి ఆగిపోయింది. దాని వెనుక ఇంకా మరికొన్ని చెట్లు చేరి దానిని వంతెన మీదకు తోస్తున్నాయి. ఆ చెట్టుకొమ్మలు కొన్ని రైలు దారికి అడ్డంపడ్డాయి.

మూడు గంటలకు ముందుగా పక్క స్టేషను చేరుకోగలమని అన్ని ప్రయత్నాలు చేశాం. కాని ఏదో అడ్డు.

నేను డ్రైవరును చేరుకోడం చాలా కష్టం. కాబట్టి భద్రంగా రైలుపెట్టెలో కూర్చుంటే ఈ ఉపద్రవం దాటిపోతుంది.

తిరిగి వెనక్కు వచ్చాను.

బోగీలోకి ఎక్కాను.

తలుపు వేయడానికి ముందు ఒకక్షణం ఆ చీకటిలో, గాలివానలో, ప్రకృతిని చూడాలని ద్వారం దగ్గిర నిలబడ్డాను.

అప్పుడొక మహాద్భుతం జరిగింది.

వెనుకనుంచి వస్తున్న శబ్దాలు ఇనుమడించాయి. కాదుకాదు, వేయిరెట్లు పెరిగాయి. ఆకాశాన్ని, అటు దక్షిణంనుంచి ఇటు ఉత్తరంవరకు విభజిస్తూ, కట్టలు కట్టలుగా మెరుపులు వ్యాపించాయి. అవి నాలుకలు చాచిన వెండితాచులు చుట్టలు చుట్టుకున్నట్లు కనిపించాయి. వెనుకనుంచి మహాశబ్దమొకటి వాటిని తరుముకొని వస్తోంది.

ఆ మహాతేజస్సులో ఒకగ్రామం నాకు కనిపించింది.

ఆ గ్రామం నేను కోరుకున్నట్లే నది పక్కనుంది. ముందూ వెనుకా పొలాలు- వాటి వెనుక తోటలు- బారులు తీర్చిన ఇళ్లు. వాటిలో చాలావరకు చొప్పవేసినవి. కొన్ని పెంకుటిళ్లు.

నేను వారణాసిలో ఆశ్రమంలో తోటమాలిగా పనిచేశాను. నారాయణసేవ చేయడానికి అవకాశం లేకపోయింది.

సాధారణంగా ఉరి తీయవలసిన నేరస్తుడిని అడుగుతారు. నీ ఆఖరు కోరిక ఏమిటని? నేను నేరస్తుడిని కాకపోయినా అటువంటి పరిస్థితులలో మృత్యువును చేరుకుంటున్నాను. దానినుండి తప్పించుకోడానికి నేను ప్రయత్నించడంలేదు.

అటువంటప్పుడు, మరణానికి ముందు నా చివరికోరిక కోరడంలో తప్పేముంది?

నేనా గ్రామం చేరుకోవాలి.

అప్రయత్నంగా నేను కిందికి దిగిపోతున్నాను.

నేను ఆ గ్రామం చేరుకోగలనా?

ఒకవేళ ఏదో విధంగా చేరుకున్నా, చచ్చిపోయేవాడిని నారాయణసేవ ఏం చెయ్యగలను?

కాని నా కోరిక చాలా బలంగా ఉంది.

నేలమీదికి దిగాను.

వర్షం, గాలి, పిడుగుల శబ్దాలు, మెరుపుల తళతళలు భూనభోంతరాళాలను కమ్ముకుంటున్నాయి.

అక్కడో బండిదారి ఉంది. దానిమీద తిన్నగా నడిస్తే ఆ గ్రామం చేరుకుంటాను.

ఆరోజు రైలులో కలిసిన సాధువు చాలా నిబ్బరంగా నేను ఆరు నెలల తరువాత చచ్చిపోతానని చెప్పాడు. సరిగా ఇవాళకి ఆరునెలలు నిండాయి. వాళ్ళకి భవిష్యత్తు తెలుసు.

మరణించేవాడిని నాకాగ్రామంమీద కోరిక దేనికి?

నేనక్కడ మానవసేవ చేయలేకపోయినా, ఆ మట్టిమీద చనిపోతే నా కోరిక తీరినట్లే.

ఆకాశం భూమి ఏకమవుతున్నాయి.

వర్తులంగా సుడితిరుగుతున్న జలాలు, జలజంతువులు, మేఘాలు మెరుపులు, పిడుగులు- ప్రళయఘోష- దిక్కులన్నీ దగ్ధమవుతున్నాయి.

ఇంకా నాకు జీవితంమీద ఆశపోలేదు.

ఆ సాధువు చావుకు విరుగుడు కూడా చెప్పాడు.

ప్రతిదినం మృత్యుంజయ మంత్రం చదువుతుంటే ఈ ప్రమాదం తప్పుతుందన్నాడు. అదేం కర్మమో! ఈ సంగతే నాకు జ్ఞాపకం లేకుండా పోయింది.

పోనీ ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది కదా!

మంత్రం చదువుతే!

ఏం చదవడం.

ఒకడుగు వేద్దామంటే పదడుగులు ముందుకు గాలినెట్టుతోంది. ఎవరో బలంగా వీపును చరచినట్లు వర్షం వెనుకనుంచి బాదుతోంది. ఒక చెప్పు జారిపోయింది. రెండో దానిని విసిరి వేశాను.

ఈ సంరంభంలో మంత్రం జ్ఞాపకం రాకుండా పోయింది.

ఆఖరి ప్రయత్నం చివరి పాదం జ్ఞాపకం వచ్చింది. ఇంకా ఇంకా తంటాలుపడితే రెండోపాదం, మూడో పాదం జ్ఞాపకానికి వచ్చాయి.

అడుగులలో అడుగులు వేస్తుంటే ఆమడలు ముందుకు పోతున్నాను. నాకే రెక్కలుంటే ఈ గాలి నన్ను ఎత్తుకుపోయేది.

ఎంత తొందరగా గ్రామం సమీపించాను!

అన్ని కాంతులు, శబ్దాలు వర్షం అన్నీ ఏకమయ్యాయి.

మృత్యుంజయమంత్రం మొదటి చరణం కూడా జ్ఞాపకం వచ్చింది.

మంత్రం చదువుతున్నాను.

ఓం త్రయంబకం యజామహే

సుగంధిం పుష్టివర్ధనం

ఉర్వారుక మివ బంధనాన్

మృత్యోర్ముక్షీయ మామృతాత్

ఆ మహాశబ్దంలో ఏ మంత్రం వినిపించడంలేదు.

తుఫాను కేంద్రబిందువు నామీద నుండి దాటుతున్నది.

మంత్రం పూర్తిచేశాను.

ఫెళఫెళమని చెట్టేదో విరుగుతోంది.

హరోంహర!



## విశాలాక్షి చెప్పినది

గాలివాన వస్తుందని భయందేనికి? దేనికేనా ముందు జాగ్రత్త కావాలి. నా మట్టుకు నేను సురక్షితమైన స్థలంలోనే ఉన్నాను. మా బంగళా ఎత్తుగా ఉన్నచోటే కట్టారు.

అందరూ అన్నివిధాల రేడియో వార్తలు వింటూ భయకంపితులౌతున్నారు. నాకు కొంచెమైనా ఆందోళనలేదు.

ఈ వర్షంలో ఎవరిదో జీపు మాయింటి ముందు ఆగింది. దానినుండి మెడికల్ ఆఫీసరు దిగారు. బెంగాలీవాడాయన. నన్ను

దీదీ అని పిలుస్తాడు.

చేతులు జోడించి అతనికి నమస్కారం చేశాను.

అతను హాలులోకి వచ్చి కూర్చున్నాడు.

"ఇనస్పెక్టరుగారెక్కడ? " అతను ప్రశ్నించాడు.

"ఎందుకు? " నేనడిగాను.

"అతనికి వారం రోజులై జ్వరమని టెలిఫోనులో చెప్పారు"

"ఇంట్లో పెళ్ళాన్ని, నాకు తెలియని సంగతి మీకెలా తెలిసింది? "

"దీదీ! నీకు నిజంగా తెలీదా? "

"తెలిస్తే ఈ జ్వరం ఇన్నాళ్ళెందుకుంటుంది? "

"మైగాడ్! ఇది పెద్దజోకే!"

"అతనికేం, మహారాజులా తింటున్నారు, తిరుగు తున్నారు, లైను మీద వెళ్ళడంలేదు"

"అయితే నేను వెళ్ళిపోవచ్చా? "





"ఇంత దూరం శ్రమపడివచ్చారు. నా బి.పి. చూసి వెళ్ళండి. మూడు రోజులతరువాత మా యింట్లో చాలా పెద్ద ఫంక్షన్ ఉంది. పొద్దున్న మనవడి బారసాల. పెద్ద హోమాలు- గొప్ప ఫీస్టు. రాత్రి మా లేడీస్ క్లబ్ మెంబర్లందరికీ డిన్నరు. నేను ఒళ్ళు తెలియకుండా పని చేస్తాను. నీరసంతో కొలాప్సవకుండా నాకేదేనా మంచి మందు రాయండి. అటువంటి పరిస్థితి రాకుండా కొబ్బరిబొండాలు, బత్తాయి పళ్ళు, గ్లూకోజ్ పాకెట్లు అన్నీ సిద్ధంగా ఉంచుకున్నాను. ఒక మనిషిని, గంట గంటకు ఏదో ఒకటి ఇవ్వడానికి ప్రత్యేకంగా నియమించాను. ముందు జాగ్రత్త మంచిది. లేకపోతే రసాభాస జరిగి నన్ను హాస్పిటలులో చేర్చవలసి వస్తుంది"

డాక్టరుగారు నా బీపీ చూశారు.

నాకు ప్రెషర్ లేదన్నారు.

అయినా నేను అడిగాను కాబట్టి మందొకటి రాశారు.

వారిని కూచోపెట్టి, టీ యిచ్చి, వద్దంటున్నా ఫీజు బలవంతాన చేతిలోపెట్టి మరీ పంపించాను.

మావారు పక్కగదిలో పడుకున్నారు. వంటలక్క చెప్పింది బాబుగారు సరిగా తినడంలేదని. నాకు బోలెడన్ని పనులు. ఈమధ్య గ్రౌండ్స్‌లో ఫెటే ఒకటి ఏర్పాటు చేశాం. మా పెద్దదొరగారి భార్య ఆ బాధ్యత అంతా నామీదనే పెట్టింది. ఫెటే మూడురోజులే అయినా, పదిరోజులుముందు, ముగిసిన తరువాత వారం రోజులు నేను చాలా శ్రమపడవలసి వచ్చింది.

పత్రికలలో నాలుగు ఫొటోలు వచ్చాయి.

రిపోర్టర్లకు మస్తుగా బజ్జీలు, స్వీట్స్ పెట్టానేమో నా గురించి చాలా బాగా రాశారు. ఇటువంటి పనులలో ఊపిరితీయడానికి కూడా నాకు తీరికలేనప్పుడు, టింగు రంగా అని ఆయన మంచంమీద పడుకుంటే ఏం తెలుస్తుంది?

నాకీ సంగతి తెలిస్తే నాలుగు కాప్సూల్స్ వేసి జ్వరాలనన్నిటినీ పంపించివేసేదానిని.

మధ్యాహ్నం మూడు గంటలకు నేనాయనను డబ్బు తెమ్మన్నాను. ఊళ్ళో చాలామంది దగ్గిర అప్పులు చేశాను, మరెవరిని కలిసినా లాభంలేదన్నారు.

ఈ మగాళ్ళకు మంచీ మర్యాదా ఏం తెలుస్తాయి?

ఉన్నదే ఒక్క అమ్మాయి. చాలా ఘనంగా కిందటియేడు పెళ్ళిచేశాం. ఈ యేడు పనసపండువంటి మనుమడు పుట్టాడు. వాడు పుట్టిన నక్షత్రం సరియైనది కాకపోవడంచేత హోమాలు, శాంతులు, దానాలు, భోజనాలు- ఇటు పక్క చుట్టాలు, అటుపక్క బంధువులు బాగుండాలంటే ఇవేవీ తప్పవుకదా! వీటికి డబ్బు లేనిదే ఎలా అవుతుంది. అంతకు ముందు ఆయన నాకు డబ్బిచ్చారు. అది పిల్లడికి బాలతొడుగు కొనడానికి సరిపోలేదు. ఇందులో తప్పేదేముంది? డబ్బు తిరిగి సంపాదించుకోవచ్చు కాని సమయానికి చేయవలసిన మర్యాదలు దాటిపోతే అపఖ్యాతే మిగులుతుంది.

ఊళ్ళో మరే స్నేహితులను కలియలేనన్నారు. మనకు కావలసినన్ని ఊళ్లున్నాయి. ఏ ఊరిమీద పడ్డా అవుసరం గడిచిపోతుంది. కార్యం దగ్గిర పడుతున్నదనే ధ్యాస కూడా ఆయనకి లేకపోయినందుకు నాకు చాలాకోపం వచ్చింది.

వాడెవడో పైఅధికారి అందుకే సహకరించాడు. లైను మీద వెళ్ళిరమ్మన్నాడు. గాలివానేం చేస్తుంది? గువ్వపిట్టలా ఫస్టు క్లాసు కూపేలో కూర్చోడమే కదా! ఏ స్టేషనులోనో దిగి హాయిగా కాలం గడిపి రావడం. అది అతనికి యిష్టమైన పనేకదా! వెంట సోములుగాడొకడు పోతున్నాడు. డబ్బు

విషయాలలో ఆయన బదులు వాడే అడిగి తెస్తాడు.

నేను పట్టుదలగల మనిషినని అందరూ అంటారు. అదే లేకపోతే ఏ పనీ జరగదు. దానికోసం నేను కటువుగా వ్యవహరించానని ఎవరి మనసులో బాధపడతాయని నేను అన్నిటితో రాజీపడితే ఈ ప్రపంచంలో నెగ్గుకొచ్చినట్లే.

ఇంతలో ఫోను వచ్చింది.

"ఎవరది? కంట్రోలరుగారా? "

"... ... ..."

"చాలా సంతోషం. మా అల్లుడుగారు వచ్చే రైలు ఎన్నిగంటలకు వస్తుంది? "

"... ... ..."

"రమారమి రెండవుతుందా? పాపం! అతనికి భోజనం ఉండదనుకుంటాను"

"... ... ..."

"చాలా థాంక్స్! చిన్న మాస్టరుగారు భోజనం ఏర్పాటు చేస్తామన్నారా? ... చిన్న రిక్వెస్టు"

"... ... ..."

"ఈ రాత్రి గాలివానలో మా శర్మ ఇల్లు చేరడానికి మీ ఎమర్జెన్సీ జీపు పంపండి. దొరగారు అర్జంటుగా లైనుమీద వెళ్ళిన సంగతి మీకు తెలుసు కదా! లేకపోతే ఆయనే వెళ్ళి రిసీవు చేసుకునేవారు"

"... ... ..."

"మరోసారి థాంక్స్ చెప్పుకుంటున్నాను"

ఈ కంట్రోలరు చాలామంచి కుర్రాడు. ఫెటేలో చాలా సహాయం చేశాడు. ఈ విధంగా పబ్లిక్ ఇమేజి పెంచుకోవాలి కాని, సన్యాసిలా ఏ ఆర్భాటాలు వద్దంటే ఎలా?

"కాత్యాయనీ!"

"వస్తున్నానమ్మా! పిల్లాడికి పాలిస్తున్నాను"

"మీ ఆయన వస్తున్నట్లు కంట్రోలరు చెప్పాడు. అన్నమాట ప్రకారం గాలివానను లక్ష్యపెట్టకుండా వస్తున్నాడు. అతను వచ్చే సరికి రెండవుతుంది. ఫ్లాస్కులో హార్లిక్సు సిద్ధంగా ఉంచు. సాధారణంగా నీ మొగుడు రాగానే స్నానం చేస్తాడు. వేడినీళ్ళకు ఏర్పాటుచెయ్. ఒసే రంగీ!"

"ఏవమ్మగారు? "

"చిన్నమ్మగారు చెప్పిన వన్నీ చెయ్యాలి. ముందు నాకు భోజనం వడ్డించమని పెద్దావిడతో చెప్పు"

మా వంటమనిషికి ఏభైయేళ్ళు. అయినా ఆమె విసుక్కోకుండా పనిచేస్తుంది. ఈవిడకు ముందు పదిమంది మారారు. ఏదో రోజు ఈమె కూడా వెళ్ళిపోతుంది. అనుకోకుండా నాకు కోపం వచ్చి కేకలేస్తాను. పౌరుషమున్న ఏ మనిషీ మరి ఉండలేదు

కాని, పురుషుడయి కూడా మారుమాట్లాడకుండా పక్కకు తప్పుకునే మా ఆయనను చూస్తే నాకొకప్పుడు చాలా అసహ్యం కలుగుతుంది. ఇంటిదగ్గిర పెళ్ళానికి ఎదురుచెప్పలేని మగాడు పై అధికారికి ఏంజవాబు చెప్తాడు?

నేనెంత ఆక్టివ్‌గా ఉంటానో, ఆయన అంత ఇనర్ట్!

అల్లుడుగారికి కావాలని మంచి కాయగూరలు తెప్పించాను. తీయటి పెరుగు తోడు పెట్టి ఫ్రిజ్‌లో ఉంచాను. అతను తిన్నగా రాయపూర్‌నుంచి వస్తున్నాడు. మా వియ్యంకుడు, వియ్యపురాలు, మా అమ్మాయి ఆడపడుచు రేపు పిఠాపురం నుంచి వస్తారు. అందరికీ ఏ లోటుపాట్లు రాకుండా మర్యాదలు చెయ్యాలి. పెళ్ళి బాగా చేశాం. బారసాల పెళ్ళికన్నా బాగా చెయ్యాలని నేను నిశ్చయించాను.

ఏదో భోజనం అయిందంటే అయిందనిపించాను. ఇన్ని ఆలోచనలు తలలో తిరుగుతూ ఉంటే తిండి ఏంసయిస్తుంది?

"రంగీ! కిటికీలు సరిగా వేశావా? ఈ చలి గాలి మరెక్కడినుంచి వస్తోంది? వెంటిలేటర్లు సరిగా మూశావా? నా మంచంమీద దుప్పటి మార్చు తెల్లటి దుప్పటీ పరువు. ఫారిన్‌నుంచి తెప్పించిన ఇంగ్లీషు రగ్గు బీరువాలోంచి తీసి కాళ్ళదగ్గిర పెట్టు. నేను బాగా రిలాక్సయితేనే కాని రేపటికి పనికి రాను. ఎందుకేనా మంచిది, నేను చదువుతున్న ఇంగ్లీషు నవల తలగడ పక్కన ఉంచు. చదువుతుంటే నిద్రవస్తుంది"

"అయితే అమ్మగోరు! నిద్రమాత్ర వొద్దంటారా? "

"అది కూడా బల్లమీద ఉంచు. గ్లాసుతో నీళ్ళు దానిమీద మూత- ఏవీ మరచిపోడానికి వీలులేదు"

ఈ రంగి పన్నెండేళ్ళ గుంట. విసుగు విరామం లేకుండా పనిచేస్తుంది. వంటావిడ, రంగి, ప్యూన్ సింహాచలం, వాళ్ళు లేకపోతే ఓ క్షణం కూడా నేను ఈ బంగళాలో ఉండలేను. లేని వాళ్ళకి ఎలాగూ లేరు. కలిగినవాళ్ళు అనుభవించడంలో తప్పేముంది?

గోడగడియారం తొమ్మిది కొట్టింది.

పందిరి మంచంమీద పడుకున్నాను.

న్యూస్‌లో గాలివాన గురించి చెప్పాడు.

ప్రతి గంటకి తుఫాను హెచ్చరిక వినిపిస్తున్నాడు.

వాళ్ళు చెప్తుంటారు, మనం వింటుంటాం.

తుఫాను వెలిసిన తరువాత మళ్ళీ నాకు చేతినిండా పని. తుఫాను బాధితులకు సహాయం, మళ్ళీ విశాలాక్షిగారి పేరు పేపర్లలో.

నాకు నవ్వొచ్చింది. నా పేరుకీ, ఈ బాధలకూ అవినాభావ సంబంధం ఏదేనా ఉందా? తామరాకుపై నీటిబొట్టులా బాధ అంటుకోకుండా పేరు తెచ్చుకోడం గొప్ప కాదా?

నాకు ఉండుండి చక్కని ఆలోచనలు వస్తాయి.

మంచంమీద పడుకొని రీడింగ్‌లైటు వేసుకొని, రగ్గు మీదకు లాక్కున్నాను.

"రంగీ!"

అది కళ్ళు నులుముకుంటూ వచ్చింది.

"డాక్టరుగారు రాసిచ్చిన టానిక్కు ఇచ్చావటే! పోనీ... రేపటినుంచి ఇద్దువుగాని! ఇవాళ సరిగా తిండి తినలేదేమో, నాకు కూడా ఫ్లాస్కునిండా హార్లిక్సు కలిపి బల్లమీద ఉంచు. అదేనా తాగకపోతే బలమెలా ఉంటుంది? "

నిద్రకోసం నేనెప్పుడూ ప్రయత్నించను. అది వచ్చింది మంచిదే. రాదుపో- ఒక మాత్ర వేసుకుంటే చాలు, దాసోహమని పాదాలమీద పడుతుంది.

నవల చదివాను. కాని, నా మనసులోకి ఒక వాక్యం కూడా ఎక్కడంలేదు. నవల పక్కకు పెట్టేశాను. ఇంట్లో అందరూ గాఢ నిద్రలో ఉన్నారు. నేను ఒంటరిగా, వెచ్చగా, హాయిగా.

నాకు చాలా విషయాలు జ్ఞాపకముంటాయి. నేను చిన్నప్పటినుంచి స్వతంత్రంగానే వ్యవహరించాను. నాకు నచ్చిన బట్ట కట్టుకున్నాను. నేను కోరిన నగ పెట్టుకున్నాను. మా నాన్నగారు చాలా పెద్ద ఆఫీసరు. నౌకర్లకు చాకర్లకు కొదవలేదు. మా వాళ్ళకు నేనొక్కతెనే ఆడపిల్లను. ముద్దు ముచ్చట్లకు లోటులేదు. నాకు వచ్చే మొగుడు కూడా పెద్ద ఆఫీసరే కావాలని అనుకున్నాను. అయిదారు సంబంధాలు వచ్చాయి. బి.ఏ. పాసయేదాకా నేనేవీ చూడలేదు. తరువాత వచ్చిన వాళ్ళు నాకు నచ్చలేదు. కట్నాలు మా వాళ్ళిస్తామన్నా నేను ఒప్పుకోలేదు. నా స్వభావం మా నాన్నగారికి ఏదో ప్రత్యేకంగా కనిపించింది. అందుచేత తొందరపడి ఆయన ఏ

సంబంధం నిశ్చయం చెయ్యలేదు.

చూస్తుంటే కాలం దొర్లిపోతున్నది. మా అమ్మ ఆరాటం చెప్పరాకుండా పోయింది. ఎవడో మంచివాడికిచ్చి ముడిపెడితే సంసారం సాగుతుందని, నా వంటి పెడసరం మనిషికి కట్టబెడితే బెడిసికొడుతుందని మానాన్నగారు గ్రహించారు. ఆ విషయం మా అమ్మతోను, నాతోను అనేవారు. మంచివాడు అతని దృష్టిలో పడడం ఆకస్మికంగా జరిగింది.

ఆరోజు బుధవారం. తలంటిపోసుకొని, కొత్తచీర కట్టుకున్నాను. ఆ దినమే నాకు ఇరవయ్యోయేడు వచ్చింది. రెండు ఏళ్ళయి కాళీగా కూర్చున్నాను. అప్పుడప్పుడు క్లబ్ మెంబర్సుతో కలిసి సహాయకార్యక్రమాలలో పాల్గొనేదానిని. ఫూర్ క్రీచర్స్ కొంచెం సహాయం చేస్తే కొండంత ఉబ్బిపోతారు. ఇటువంటి పనులకు మంచి పబ్లిసిటీ ఉంది. ఫలానా విశాలాక్షి వరద బాధితులకు నిధులు సేకరిస్తున్నారనో ఫలానా భవనం ప్రారంభోత్సవంలో కూమారి విశాలక్షి పాల్గొన్నారనో విదేశపర్యాటకులకు విశాలాక్షి తేనీటి విందు యిచ్చారనో వార్తలు వచ్చేవి. ఈ పత్రికలు కొన్ని లక్షలమంద ప్రజలను చేరుతాయి. అవి చదివేవారు ఎవరీ విశాలాక్షి చెప్మా? ఇన్ని కార్యక్రమాలలో ఈమె ఎలా పాల్గొంటున్నది? అని ముక్కుమీద వేలేసుకుంటారు.

ఈ గుర్రాన్ని ఎక్కినవాళ్ళు కిందికి దిగడానికి ఒప్పుకోరు.

ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవు.

నన్ను పెళ్ళాడేవాడు నా వలెనే పేపర్లలో వస్తే, నా స్థానం దిగువకు వస్తుంది. ఫలానా వాడి పెళ్ళామంటారు. నా పేరు మరొకరితో పంచుకోడం నాకు యిష్టంలేదు.

మా నాన్నగారికి నా స్వభావం పూర్తిగా తెలుసు.

అందుకే ఆరోజు సాయంకాలం మావీధి అరుగుమీద కూర్చొని మంచినీళ్ళడిగిన మగవాడికి మా నాన్నగారు నన్ను ఇవ్వడానికి నిర్ణయించారు.

"అమ్మాయ్! మన అరుగుమీద కూర్చున్న అతను మన కులం వాడే. మన శాఖవాడే. రెండో పెళ్ళి వాడైనా అతనికి అట్టే వయసు లేదు. రెండు సంవత్సరాల కింద అతని భార్యపోయింది. చచ్చిపోవాలనుకున్నాడు. పరారయాడు. దేశం తిరిగివచ్చాడు. ఇప్పుడు మళ్ళీ జీవితంమీద అతనికి ఆసక్తి కలిగింది. మనిషికి కష్టసుఖాలు తెలుసు. నీవలెనే బియ్యే పాసయాడు. జీవితంలో అతను ఒంటరివాడు. మగాళ్ళు ఒంటరిగా బతకలేరు. అతడు మళ్ళీ ఒక మనిషి కావాలంటే అతనికి జీవిత సహచరి కావాలి. ఇతనితో ఒక గంట మాట్లాడాను. చాలా సౌమ్యుడు. నీకు పేరు ప్రఖ్యాతుల మీద ఎంత కోరికో ఇతను వాటిపట్ల అంత నిర్లిప్తుడు. నువ్వు తీర్చిదిద్దిన సంసారంలో తన స్థానం గుర్తించి ఇతను మసలుతాడు. వీళ్ళ పై- అధికారి గంగోలీ, నేనూ చదువుకున్నాం. నేను రిటైరయినా అతనింకా రెండేళ్ళు పనిచేస్తాడు. పోయిన ఉద్యోగం తిరిగి ఇప్పించగలను. మంచిచోటుకి బదిలీ చేయించగలను. ఈ ఉపకారాలు జరిగాక ఈ ఆగంతకుడు నీకు విధేయుడుగా ఉండడంలో ఆశ్చర్యంలేదు" **అన్నారు.**

మా నాన్నగారు ఆడిన మాట తప్పిపోలేదు. రెండు నెలల్లో కాబోయే అల్లుడికి ఉద్యోగం వేయించారు. బదిలీ చేయించారు. నాకు చాలా ఘనంగా పెళ్ళి జరిగింది. అన్ని పత్రికలలోను మా పెళ్ళి గురించి వార్తలు వచ్చాయి.

మా నాన్నగారు ఆ సాయంకాలం మా ఇంటికి వచ్చిన అతిథికి ఆశ్రయమివ్వకపోతే అతనెక్కడ తిరుగుతూ ఉండేవాడో.

గడియారం పదకొండు గంటలు కొట్టింది.

గాలివాన జోరు హెచ్చుగానే ఉంది.

లేచి కప్పులో హార్లిక్సు పోసుకొని తాగాను.

నిద్ర రావడంలేదు. అల్లుడొచ్చేవరకు మేలుకొని ఉంటే చాలు. ఈ నిద్రమాత్ర వేసుకుంటే పొద్దున్న ఏడు వరకు తెలివి రాదు.

....

నేను కాపురానికి వచ్చేసరికి ఇల్లు అయ్యవారి నట్టిల్లులా ఉంది. మా ఆయనకు మరో జత బట్టలు లేని స్థితిలో మా ఇంటికి వచ్చారు. మా నాన్నగారే అతనికి మంచి బట్టలు కుట్టించారు. విశాఖపట్నంలో ఉద్యోగం వేయించారు. పాత సర్వీసు పోకుండా చేశారు. ఇంట్లో పూచికపుల్ల నుంచి అన్ని సామానులు, ఫర్నిచరు నేను తెచ్చినవే.

అందరి విషయం వేరు నా విషయం వేరు.

మా ఆయనని కలియడానికి ఎవరూ రాకపోయినా, నన్ను కలియడానికి ఎవరో ఒకరు వచ్చేవారు. వారిని రిసీవ్ చేసుకోవడం, మర్యాదలు చేయడం ఉండనే ఉన్నాయి. వాటికోసం, మంచి డిజైన్లలో ఖరీదైన ఫర్నిచరు మా నాన్నగారు కొనిపెట్టారు.

మా ఆయన తెచ్చే జీతమేపాటి?

నా పేరనే చాలా డబ్బు బ్యాంక్‌లో ఉండేది. అది లేకపోతే నా కార్యక్రమాలు కుంటుబడి మూల కూర్చునేదానిని.

గంగూలీ దొరగారు మరో మంచి ఉపకారం చేశారు. మా ఆయనకు ఇనస్పెక్టరు ప్రమోషనిప్పించారు. లిస్టులో అడుగున ఉన్న మనిషిని అందరికన్నా మీదికి తెచ్చారు. మా ఆయన ఈ మార్పును అంగీకరించలేదు. కాని మా నాన్నగారు అతనికి బోధపరిచారు. మామగారి మాట తీసివేయలేక అతను ప్రమోషను తీసుకున్నారు.

నేను కాపురానికి వచ్చిన సంవత్సరానికే మా కాత్యాయని పుట్టింది. చిన్నప్పటినుంచీ దాని స్వభావం మరోవిధంగా ఉంటూ వచ్చింది. నేనెంత ముందుకు ఉరకడానికి ప్రయత్నించేదానినో, అది అంత వెనుకాడేది.

దీనికి కూడా కారణముంది.

కాత్యాయనికి జ్ఞానం వచ్చేసరికి నాకు సోషల్ వర్క్ చాలా హెచ్చింది. ఏ కలక్టరుగారి భార్యో, జడ్జీగారి పెళ్లామో, ఏ కమీషనరుగారి గృహిణో టెలిఫోనుచేసి నా కోసం కారు పంపితే వెళ్లేదానిని. అపుడు తండ్రి, కూతురు ఇంట్లో మిగిలేవారు. మా ఆయన నాకు ఎటువంటి బోధలు చెయ్యలేదు. కాని తన కూతురిని మాత్రం ముమ్మూర్తులా తనవలెనే తయారుచేశారు.

నేనేం చేయగలను?

అదీ ఒకందుకు మంచిదే. చదువుకున్న రోజులనుండి మా కాత్యాయని ఇంటి బాధ్యత తనపైన పెట్టుకుంది. నా కన్న నాకూతురే మంచిదని ఎవరేనా అనుకుంటే దానికి కారణం వాళ్ల నాన్నే. నా వలెనే నా కూతురు కూడా పెడసరం కొయ్య అయితే నేను భరించలేను.

మా సంసారం ఏదోవిధంగా సాగిపోతుంటే ఓ రోజు ఒక పెద్దమనిషి దిగబడ్డాడు. అప్పటికి మా ఆయనకు ప్రమోషను వచ్చి రెండు సంవత్సరాలయింది. ఏదో ట్రెయినింగుకని బరోడా వెళ్లారు. ఒక నెల్లాళ్ల వరకు రారు.

ఆ వచ్చిన పెద్దమనిషి పేరు రాజగోపాలం. మా ఆయనతో కాలేజిలో చదువుకున్నాడు. అతనికి మా గెస్టు రూములో బస ఇచ్చాను. అటాచ్‌డ్ బాత్ రూము సౌకర్యం దానికుంది. రోజూ కాఫీలు, ఫలహారాలు,

భోజనాలు వేటికీ లోటు లేకుండా చూడ మని బంగళా ప్యూన్ సింహాచలానికి చెప్పాను. లోపలకివచ్చి డైనింగ్ టేబులు మీద మాతోపాటు భోజనం చెయ్యడానికి మొహమాటపడితే అతని గదిలోనే అన్నీ ఏర్పాటు చేశాను.

అతను వచ్చి ఒక వారం రోజులయింది.

ఒకరోజు సాయంకాలం అతనికి అన్నీ అందుతున్నాయో లేదో కనుక్కుందామని గదిలోకి వెళ్తే, అతను తాగేసి పడి ఉన్నాడు.

నాకు అరికాలి మంటలు పైకిలేచాయి.

నేను లోకంలో ఎవరినేనా సహిస్తానుకాని తాగుబోతులను భరించలేను.

సింహాచలాన్ని పిలిచాను.

"ఎవడ్రా ఈ పెద్దమనిషికి సారా తెచ్చి ఇస్తున్నాడు? "

సింహాచలం తానా పని చెయ్యలేదని పాదాల మీద పడ్డాడు.

"మరెవరు తెచ్చారు? "

"ఆ బాబుగారే వెళ్లి తెచ్చుకున్నారు"

"మరి నాతో ఎందుకు చెప్పలేదు? "

"దొరగారి స్నేహితులని ఆ బాబు చెప్పారు. మీకు ఈ విషయం తెలుసనుకు న్నాను"

"ఏదయినా సరే ముందు ఇతని సామాన్లు వీధిలోకి విసిరేసి, ఈ మనిషిని పీకపట్టుకుని గెంటి పంపించు"

నాలోకోపం హద్దులు మీరిపోతోంది.

ఆ రాజగోపాలం తాగుబోతని కాదు.

ఇటువంటి దౌర్భాగ్యులా మా ఆయన స్నేహితులని మండిపోయాను.

ఆ మనిషి పెట్టె, బేడా పైకి పెట్టి అతనిని నడిపించుకొని వీధిలో రోడ్డు పక్కన సింహా చలం నిలబెట్టాడు.

ఇంతలో మా ఆయన ప్రియశిష్యుడు ఆదారంటే వచ్చాడు. వాడతనికి నమస్కా రంచేసి రిక్షా పిలిచి అతనిని, సామానూ ఎక్కించి తీసుకుపోయాడు.

నేను అప్పటికేనా నిజం తెలుసుకున్నం దుకు సంతోషించాను. లేకపోతే ఎంత అప్ర తిష్ట. దేవుడు మేలుచేసి నా కోసం ఎవరూ రాలేదు. వస్తే ఎంత అమర్యాద! "సంఘసే వకులు విశాలాక్షిగారింట తాగుబోతుల తాండవం" అని మొదటి పేజీలో వార్త వస్తే ఉరిపోసుకోవడం తప్ప మరోదారి లేదు.

మరో పది రోజుల తరువాత ఇంకో సంగతి తెలిసింది.

ఆ ప్రబుద్ధుడు సోములు చెల్లెల్ని లేవదీ సుకుపోయాడట!

తాగుబోతులూ, వ్యభిచారులూ మా వారి ఆప్తస్నేహితులు. నాలుగో తరగతి ఉద్యోగు లతో మా ఆయన భుజం కలుపుతున్నారు. నేను జాగ్రత్తపడాలి.

మా ఆయన ట్రెయినింగు నుండి వచ్చిన వారం రోజుల వరకూ ఈ విషయం మీద ఏదీ అడగలేదు.

"రాజగోపాలాన్ని నువ్వు యింటినుండి పంపించి వేశావా? "

"తాగుబోతులూ, వ్యభిచారులు మీ స్నేహితులని నాకు ఇప్పుడే తెలిసింది. ఇక మీద నేనుండవలసిన జాగ్రత్తలలో ఉంటాను"

మా ఆయన నా ముఖంలోకి చాలా తీవ్రంగా చూశారు. అక్కడనుండి వెళ్లిపో యారు. నాకు ఎవరి భయమూలేదు. నా మనసుకి న్యాయంగా, సత్యంగా తోచినవి బయట పెట్టడానికి ఎటువంటి బిడియమూ లేదు.

ఒక వారం రోజులవరకూ అతను ఉదా

సీనంగా ఉన్నారు. తరువాత అంతా మామూలే.

నేను మాత్రం ఆవేళనుండి నా జాగ్రత్తలలో ఉన్నాను. అతను లైను మీదికి వెళ్లినప్పుడు మరో మనిషిని పంపించి అతను ఎవరెవరితో తిరిగారో, ఎక్కడెక్కడ భోజనం చేశారో, ఎక్కడపడుక్కునేవాళ్లో, ఎవరితో సరదాగా మాట్లాడేవారో ఈ విషయాలన్నీ పూర్తిగా రాబట్టాను. ఈవిధంగా రెండు సంవత్సరాలు అతనికి తెలియకుండా అతని తిరుగుళ్ల గురించి సంపూర్ణమైన వివరాలు సేకరించాను.

అవసరం వచ్చినప్పుడు వాటిని బాణాల వలె అతని మీద ప్రయోగించాను. మొదట్లో అతను ఒకటి రెండుసార్లు విసుక్కున్నాడు. తరువాత వేటికీ జవాబులివ్వకుండా యథాప్రకారం వ్యవహరించేవారు.

నాకు అందుకే కోపం వస్తుంది.

ఒకసారేనా అతను నన్నెదిరించి తాను ఆ పనులు చెయ్యలేదని చెప్పొచ్చుకదా!

తాను ఏమీ అనలేదు, తాను తప్పు పనులుచేసి, వాటిని మరి చేయకుండా ఉంటున్నట్లు వ్యవహరించి, నాకు మాట్లాడడానికి అవకాశం ఇవ్వలేదు.

అతను మగాడు. ఉద్యోగం చేస్తున్నాడు. కొన్ని సందర్భాలలో కొంతమందితో తిరగొచ్చు కొన్ని సమయాలలో నాకు ఇబ్బంది కలిగించే పనులు చెయ్యవచ్చు ఆపాటి స్వాతంత్ర్యం పాటించకుండా నా విమర్శకు విలువనిచ్చి తన నడవడిని నాకు అనుకూలంగా మలచుకోడానికి ప్రయత్నించాడు.

నేను ఏమి చేసినది తను ఒకనాడు కూడా ప్రశ్నించలేదు. తాచుపాముని కదిలిస్తే అది బుస్సుమంటుంది. నీటి పాము ఏం తలెత్తుతుంది?

నేను ఎక్కడెక్కడ అతనికి అడ్డు కల్పిస్తున్నానో వాటిని అతను సద్వినియోగం చేసుకుంటున్నాడు. విశ్వవిద్యాలయంలో ఎవరినో అతను మచ్చిక చేసుకున్నాడు. చాలా విలువైన గ్రంధాలు తెచ్చుకొని వీలు దొరికినప్పుడల్లా చదువుకుంటున్నాడు. పూర్వం అతను విచ్చలవిడిగా పుస్తకాలు కొని బీర్వాలు నింపడం చేశాడు. ఎవరు చదువుతారు, ఆ పుస్తకాలు! నవలలా? నాటకాలా?

లోకంలో నీకెంత జ్ఞానం ఉందని ఎవరూ ప్రశ్నించరు. నీకెంత డబ్బుందని అడుగుతారు. ఈ డబ్బు బాగా ఆర్జించాలి. కూతురొకతె. దానికి పెళ్లి కావాలంటే పుట్టిన దగ్గిరనుంచి డబ్బు జాగ్రత్త చేయాలి. దీనికి మితిలేదు. హెచ్చు డబ్బుకూడబెడితే చాలా ఘనంగా పెళ్లి చేయవచ్చు అమ్మాయికి ఎంత జ్ఞానబోధ చేస్తే ఏం ప్రయోజనం. అత్తవారేం చూస్తారు? పిల్ల మెడలో ఎంత బంగారముందని అడుగుతారు. ఇది ప్రపంచజ్ఞానం. ఆడపిల్ల తండ్రికి ఈ పాటి ఆలోచన అవసరంలేదా? పుస్తకాలు కొని ఇల్లు నింపడం వలన ప్రయోజనమేముంది?

నన్ను ఒకరోజు కూడా అతను ప్రశ్నవేయలేదు ప్రతినెల బడ్జెట్‌లో అతిథి మర్యాదలకెంత ఖర్చవుతుందని? రెండువందల నుండి మూడువందల వరకు అవుతుంది. నా ప్రవృత్తికి ఇది తప్పనిసరి ఖర్చు అతని గౌరవం నావలన పెరుగుతున్నది. గౌరవం కోసం ఆ పాటి ఖర్చుపెట్టడంలో తప్పులేదు. అన్ని ఖర్చులవంటిదే ఇది.

ఇప్పుడతను పుస్తకాలు కొనడంలేదు.

తను కొన్న పుస్తకాలన్నీ లైబ్రరీకి ఇచ్చివేశాడు.

లైబ్రరీనుండి పుస్తకాలు తెచ్చుకుని చదివి ఇచ్చివేస్తున్నాడు.

నా ఆటలు ఈ విధంగా అతను కట్టించాడు.

నేనింకా కట్టుబాట్లు చేసి ఉండేదానిని.

రోజురోజుకి నా సోషల్‌వర్క్ పెరుగు తోంది. మనిషికో గమ్యముండాలి. నా గమ్యం, ఏదోరోజు రాజ్యసభలో నామినేటెడ్ మెంబరుగా కూర్చోవడమే. ఇది అత్యాశ అని భావించనక్కరలేదు. రోజురోజూ నాకు వచ్చే పబ్లిసిటీ రాబోయే పరిణామాలను సూచిస్తున్నది.



గోడగడియారం ఒంటిగంట కొట్టింది. డ్యూటీలో ఉన్న కంట్రోలరుకు ఫోను చేశాను. మరొక్క అరగంటలో అల్లుడుగారు వస్తున్న ట్రెయిను చేరుకుంటున్నదని, ఎమ ర్జన్సీ జీపు అప్పుడే స్టేషనుకు వెళ్లిందని అతను చెప్పాడు.

అమ్మాయిని, రంగిని లేపాను. వేడినీళ్లు పెట్టించాను. అతనికో గది ప్రత్యేకంగా సిద్ధంచేయించాను.

కాని అల్లుడు వచ్చేసరికి రెండు దాటింది.

వస్తూనే అతను వంగి నా పాదాలకు నమస్కారం చేశాడు. అమ్మాయిని ఏడోనెల పురిటికి తీసుకొని వచ్చాం. ఇప్పుడు మనవ డికి అయిదోనెల నిండిపోతున్నది. ఏ మగాడు ఆడది లేకుండా ఏడు నెలలు గడ పగలడు? మా అల్లుడు చాలా మంచి వాడు. ఒకనాడుకూడా నా మాటను కాదన లేదు. పిల్లను వదిలి ఉండలేక నేను బార సాల వెనక్కు పెట్టాను.

"మరో అరగంటలో గాలివాన తీరందాటి భూమిమీద ప్రవేశిస్తుందని వెదర్ ఫోర్‌కాస్ట్ తాజా సమాచారం స్టేషనులో తెలిసింది. మామగారు సాయంకాలం వెళ్లినరైలు ఎక్క డుందో తెలియడంలేదు. అన్నిరకాల సంబం ధాలు తెగిపోయాయి. ఈ విషయం ఆయ నకు తెలిసే బయలుదేరారా? " అడిగాడు అల్లుడు.

"శర్మా! ఆయనకు తెలియడమేమిటి? అది అతని డ్యూటీ. సీనియరు ఆఫీసరు గారు వెళ్లమంటే ఎలా వెళ్లనని అనగలరు? రేపటికి గాలివాన వెలిసిపోతుంది. అతనికి ఇటువంటివి అలవాటే" అన్నాను నేను.

అతను స్నానంచేసి వచ్చిన తరువాత బట్టలు మార్చుకొని తన గదిలోకి వెళ్లిపో యాడు. ఇకనుంచీ అతని ఛార్జీ మా అమ్మా యిదే.

నేను తిరిగి మంచంమీద పడుక్కునేసరికి సరిగ్గా మూడయింది. బైట గాలివాన చాలా తీవ్రంగా ఉంది. అల్లుడు క్షేమంగా ఇల్లు చేరుకున్నాడు. అమ్మాయి, మనుమడు భద్రంగా ఉన్నారు. వంటావిడ, రంగీ బాగానే ఉన్నారు. నా విషయంలో మరే ప్రశ్నలు లేవు. రేపటి గురించి నేను ఆలో చించి బాధపడను.

ప్రజల జీవితాలలో కష్టాలు వస్తూనే ఉంటాయి. వాళ్లు తీర్చుకోలేకపోతే మావం టివాళ్లు ముందుకు వస్తారు. కాబట్టి రాబోయే చికాకుల గురించి, ఇబ్బందుల గురించి నేను మనసు పాడుచేసుకోలేదు.

అందరినీ రాబోయే ఫంక్షన్‌కి పిలిచాను.

అన్ని ఏర్పాట్లు చేశాను.

ఎవరేనా అడుగుతారు, ఇంటి యజమాని రాకపోతే ఏం చేస్తారని?

బహుశా అల్లుడికి కూడా అదే సందేహం

కలిగి ఉంటుంది.

అతను రాకేం చేస్తారు?

ఎక్కడికి వెళ్లినా రేపు సాయంకాలానికి, తప్పితే ఎల్లుండి పొద్దున్నకు తిరిగి వస్తారు.

ఆ మనిషితో ఇన్ని సంవత్సరాలయి కాపురం చేస్తున్నాను. ఎప్పుడూ నా అంచనా తప్పు కాలేదు.

ఇక నిద్రపోవాలి.

నిద్ర రావడంలేదు.

రేడియోలో చెప్పాడు.

సరిగ్గా ఈ వేళకు తుఫాను తీరం దాటుతుంది.

లైలులైను తీరానికి ఎంత దూరం?

"రంగీ! రంగీ!"

బహుశా నిద్రపోతున్నట్లుంది.

రేపు చేయవలసిన పనులు కొన్ని ఉండనేవున్నాయి.

లేచి మంచంపక్కనే ఉన్న టేబులు దగ్గరికి పోయాను. జాగ్రత్తగా ఒకటే నిద్ర మాత్ర తీశాను. మంచినీళ్లతో దానిని మింగాను.

ఇప్పుడు నిద్ర రాకేం చేస్తుంది?

మంచంమీద పడుకున్నాను. మృదువైన ఇంగ్లీషు రగ్గు మీదకు లాక్కున్నాను. నాకెవరు లలబీ పాడుతారు?

ఓ మై ఏంజల్! రిలాక్స్

ఓ మై గాడెస్! స్లీప్

యూ ఆర్ బార్న్ విత్ ఎ సిల్వర్

స్పూన్ ఇన్ యువర్ మౌత్

యూ ఆర్ లక్కీ!

స్లీప్ మై ఏంజల్ స్లీప్!

ఆవులింతలు వస్తున్నాయి.

కనురెప్పలమీద నిద్రాదేవి నాట్యమాడుతోంది.

నిద్ర! లోకాలన్నిటినీ తన ఒడిలోకి తీసుకునే నిద్ర... ని...ద్ర!

## శర్మ చెప్పినది

చాలా హాయిగా ఉంది. స్నానంచేసి, బట్టలు మార్చుకొని, బిస్కత్తులు హార్లిక్సు సేవించిన తరువాత చాలా ఉల్లాసంగా ఉంది.

శ్రీమతి పదినిమిషాలు మాత్రమే పక్కన కూర్చుంది. అంతలో చంటిపిల్లాడు ఏడవడం మొదలుపెట్టాడు. లేచిపోవడానికి ఆమె తొందరపడుతుంటే నేనొక్కటే మాట అన్నాను.

"నేను నీ కోసం ఏడు నెలలయి ఎదురు చూస్తున్నాను. వచ్చి కూర్చున్నావో లేదో మళ్లా వెళ్లిపోతున్నావు. ఎంత సేపట్లో వస్తావు? వచ్చిన తరువాత ఎంత సేపు నాతో ఉంటావు? "

"పిల్లాడేడుస్తున్నాడు. ఒక్క అరగంట అవుతుంది, వాడికి పాలుపట్టి నిద్రపుచ్చేసరికి అప్పుడే మూడు దాటింది. నాలుగయ్యే సరికి మళ్లా లేచి ఆడుకుంటాడు. ఈ రెండు రోజులు ఓపిక పట్టండి. తరువాత మీతోనే ఉంటాను"

"అవేవి కుదరవు. అరనిమిషం నీకు వీలు చిక్కినా నాతో గడపవలసిందే"

నవ్వుతూ చెయ్యి విడిపించుకొని తన గదిలోకి వెళ్ళిపోయిందామె.

పిల్లాడు పుట్టిన నక్షత్రం మంచిది కాదు. శాంతి, జపాలు, హోమాలు- అన్నీ అయితేనే కాని పిల్లాడిని చూడడానికవదు. అంత వరకు నా భార్య రాదంటే ఎలా?

ఈమధ్య ఆరోగ్యశాస్త్రం చదివాను. పోస్టునాటల్ యూనియన్‌కి అట్టే గడ్డు షరతులు లేవు. డెలివరీ తరువాత ఆరువారాలు. ఆ కాలం గడచిపోయింది.

నా భార్య నాకు అనుకూలవతి. అందు

చేత చాలా విషయాలలో నేననుకున్నట్లే పనులు జరుగుతాయి.

నేను నిద్ర లేచేసరికి బాగా వెలుగొచ్చింది. చూద్దునా, పదిన్నర దాటింది. నేను చెయ్యవలసిన పనేం లేదు. స్నానం ముగిసేసరికి పదకొండయింది. పేరుకి లఘువుగా టిఫిన్‌చేసి కంట్రోలరుతో మాట్లాడాను.

అనుకున్నట్లే తుఫాను తీరం దాటింది. నాగావళి వంతెనమీద మామగారు వెళ్తున్న రైలు ఆగిపోయింది. ఇంజను, పెట్టెలు తుఫాను తీవ్రతను తట్టుకొని నిలిచాయి.

"సీనియరు ఇనస్పెక్టరుగారు అందులో ప్రయాణం చేస్తున్నారు. ఆయన ఎక్కడున్నారు? " కంట్రోలరును అడిగాను.

"ఆ విషయమే సరిగా తెలియడంలేదు. మరొక్క రెండు గంటలలో మరికొన్ని వివరాలు తెలుస్తాయి"

"రోడ్డుదారిని ఎవరినేనా పంపలేకపోయారా? "

"ఆ పని కూడా చేశాము. ఒక సివిలింజనీరు, ఒక మెకానికల్ ఇంజనీరు, ఒక ఆపరేటింగ్ సూపరింటెండెంటు ఉదయం ఏడు గంటలకు జీపుమీద బయలుదేరారు"

"నిన్న రాత్రి నేను వచ్చినప్పుడు చాలా చెట్లు మొదళ్లతో విరిగి రోడ్డుకి అడ్డంగా పడివున్నాయి. జీపు ఎలా వెళ్తుందో? "

"అదే! విజయనగరంవరకు కంట్రోలు బాగయింది. ఇంతవరకు జీపు విజయనగరం చేరుకోలేదు"

నా భార్యను పిలిచాను.

ఆమె ఏడుస్తున్నది.

మా అత్తగారు ఎక్కడికో వెళ్ళిపోయారు.

"ఏ విషయం తెలియంది కళ్లనీరు పెట్టుకోకూడదు"

"ఎంత ఆపుకుందామన్నా దుఃఖం ఆగడం లేదు"

నా భార్యను ఓదార్చాను.

మా అత్తగారు ఇంటికి వచ్చేసరికి ఒంటిగంట అయింది.

భోజనాలయ్యేవరకు ఎవరూ ఏ సంగతి మాట్లాడుకోలేదు.

టేబిలునుండి లేచేటప్పుడు అన్నాను.

"మామగారు కనిపించడంలేదని కడపటి వార్త ప్రకారం తెలిసింది. అతను ప్రయాణం చేసిన రైలు పళాసా చేరుకుంది. అక్కడ స్టేషను మాస్టరు స్వయంగా మామగారు ప్రయాణం చేసిన ఫస్టుక్లాసు తణికీ చేశాడు. మామగారి పైంటు, చొక్కా, బెడ్డింగు, సూటుకేసు మాత్రమే అందులో ఉన్నాయి. పక్కపరచే ఉంది. వంతెనమీద రైలాగిపోయినప్పుడు డ్రైవరు మునిస్వామి వెనక్కు చూస్తే, మెరుపుల వెలుతురులో మామగారు బ్రిడ్జి వరకు వచ్చి నిలబడడం కనిపించింది. తన దగ్గిరకే అతను వస్తున్నందుకు మునిస్వామి సంతోషించాడు. ఇంతలో తుఫాను కేంద్రం బ్రిడ్జిమీదనుండి భూమివైపు అడ్డంగా ప్రయాణం చేసింది. ఆ భీభత్సంలో ఏమి జరిగిందో తెలియదు. మామగారు మాత్రం ఇంజను చేరలేదు.

మా అత్తగారు చాలా సావకాశంగా విన్నారు.

ఒక పదినిమిషాలు మౌనంగా ఉన్నారు.

"ఇటువంటి పరిస్థితులలో ఎల్లుండి జరగబోయే బారసాల మొదలైనవి ఆపు చేయించండి" అన్నాను నేను.

"శర్మా! అతను తిరిగివస్తారు. ఏ స్టేషనులోనో దిగిపోయి ఎవరి ఇంట్లోనో తలదాచుకోవచ్చు. అతను ఒకవారంరోజులకేనా తిరిగివస్తారు. ప్రస్తుతానికి మనం షెడ్యూలులో ఎటువంటి మార్పులు చెయ్యవద్దు. మన కింకా ముప్పై ఆరుగంటలు ఆలోచించడానికి వ్యవధి ఉంది. ఈ ముహూర్తానికి

బాలసార జరగకపోతే, మరో రెండు నెలల వరకు మళ్లీ అవదు. అతను ఉంటే మాత్రం ఏపనిలో అతను దిగరుకదా! పెళ్లికొడుకువు నువ్వు, బారసాల పెళ్లికూతురు నీ భార్య నిజమైన హీరో నీ కొడుకు. మీరందరూ క్షేమంగా ఉన్నారు. కార్యం జరిపించవల సిన దానిని నేనున్నాను. భోజనాలలో పాల్గొనేవాళ్లు దక్షిణలు పుచ్చుకునేవాళ్లు అందరూ భద్రంగా ఉన్నారు. అందుచేత ఒక్కమనిషి కోసం వేటినీ వెనకబెట్టనద్దు"

నేను ఆలోచించాను. మావాళ్లు రేపు మధ్యాహ్నానికి బస్సుమీదో, రైలుమీదో వస్తారు. తుఫాను దెబ్బ అటువేపు అంతగా తగలలేదు. వాళ్లేమనుకుంటారు?

నాకేం పాలుపోలేదు.

మా అత్తగారికి ఎన్నో ఫోనుకాల్సు వచ్చాయి.

ఆమె చాలా మామూలుగా జవాబు చెప్పారు.

"ఇందులో విచారించడానికేం లేదు. ఏదో దారి మధ్యన రైలాగితే, దిగిపోయి ఏవూరో వెళ్ళివుంటారు. ఏ స్నేహితుడి ఇంట్లోనో బాతాకానీ వేస్తూ కూర్చుంటే అతను అన్నీ మరచిపోతారు. అందుచేత అందర్నీ ఆశ్చ ర్యంలో ముంచుతూ హఠాత్తుగా దర్శనమి స్తారు. సో లెటజ్ వెయిట్ ఫర్ హిస్ సర్ప్రైజ్ రిటర్న్"

శాంతి, హోమాలు, బాలసార, సత్యనారా యణవ్రతం, సంతర్పణం, దానాలు, ధర్మాలు, రాత్రి డిన్నరు- అన్నీ మరే ఆటంకం లేకుండా జరిగిపోయాయి.

కానీ, మామగారు రాలేదు.

ఒక వారంరోజులు మా అత్తగారు రథం ముందుకు నడిపించారు. ఎనిమిదోరోజు ఆవిడ ఫోనుమీద మా సీనియరు అధికా రితో కలకత్తా మాట్లాడారు.

"భట్టాచార్జీగారు! మా ఆయనను గురించి ఇప్పటికీ కబురులేదు. అతను తుఫాను సమయంలో ఇంజనువేపు వస్తూ ఉంటే, గాలివాన తీవ్రమయిందని డ్రైవరు ముని స్వామి చెప్పారు. అతను వరదనీట్లో పడి కొట్టుకుపోయి ఎక్కడేనా ఒడ్డుకు చేరుకో వచ్చు లేక మరో వూరికైనా వెళ్లి ఉండ వచ్చు నేను మాత్రం ఏ సహాయం లేకుండా ఒంటరిగా మిగిలిపోయాను. నాదో రిక్వెస్టు. మా అల్లుడుగారు, శ్రీశర్మ, ఆఖరి ఆరుమాసాలు ప్రొబేషనులో ఉన్నారు. ఆ ప్రొబేషను విశాఖపట్నానికి మార్చితే మా కుటుంబానికి అతడు రక్ష కుడు అవుతాడు. అన్ని సంగతులూ తెలిసి నవారు మీరు"

మరొక్క రెండు రోజులలో నాకు ఆ ప్రకా రమే ఆర్డర్లు వచ్చాయి.

మా అత్తగారి ధైర్యానికి నాకే ఆశ్చర్యం వేసింది.

నేను మా మామగారి జోళ్లలో అడుగుపె ట్టడానికి అర్హుడనా కాదా అన్న ప్రసక్తిలేదు.

నేను విశ్వవిద్యాలయంలో ఎమ్మే ఎకనా మిక్సులో గోల్డుమెడలిస్టుని. సర్వీసుకమిషను పరీక్షలో మొదటివాడుగా వచ్చినవాడిని.

నేను ఆవిధంగా అత్తవారి ఇంట్లో స్థిరప డ్డాను.

నా భార్య సంతోషించింది. మా అత్త గారు కూడా చాలా ఆనందించారు, తన మాటను పైఅధికారి గౌరవించినందుకు. ఒక నెల్లాళ్లవరకూ ఎవరెవరో మా అత్తగారిని చూడడం, ఓదార్చడం జరిగింది. తరువాత అంతా పాతబడిపోయింది.

ఆ ఇంట్లో మార్పులేవీ రాలేదు. ఒక చిన్న మార్పు తప్ప. మా మామగారు పడుక్కున్న గది మా దంపతులకు దఖలు పడింది. మా అత్తగారు నా భార్య మునుపు పడు క్కునే గదిలోకి మారిపోయారు.

వంటలక్క, రంగి అలాగే పనిచేస్తు న్నారు.

ఆఫీసు ప్యూను సింహాచలం కూడా ఉన్నాడు.

ఒక ఆరునెలలు నేను వేటిలో కల్పించు కోలేదు. మామగారిని మించిపోవాలని ప్రయత్నించలేదు. నా హద్దులు తెలుసుకొని పనివెళ్లబుచ్చాను.

ఆ పని నాకు నచ్చినవిధంగా చెయ్యలేదు.

పాతకేసులు పాతకేసులువలెనే ఉండిపో యాయి.

కొత్త కేసులమీద కూడా చర్య తీసుకో లేదు. పెర్మనెంటు ఇనస్పెక్టరుగారు వచ్చిన తరువాత వాటిని పరిష్కరిస్తారని వాటి మీద వ్రాశాను.

రెండు నెలల తరువాత ఒకరోజు, రెండు వేల రూపాయలు మా అత్తగారికి ఇంటిఖర్చు లకింద ఉంచమని ఇచ్చాను. ఆమె చాలా ఉదాత్తంగా వ్యవహరించారు.

"శర్మా! నాకు కొడుకులు లేరనే లోటు లేదు. అందరినీ మించినవాడివి నువ్వు. ఇది నీ ఆర్జన. నీ భార్య చేతికి ఇవ్వవల సింది. ఈ కుటుంబం నడిపించడానికి ఇరవై సంవత్సరాలయి శ్రమపడుతున్నాను. మీ మామగారు ఏవిధంగాను నాతో సహక రించలేదు. అందుకోసం ఈ సంసారమనే రెండెడ్లబండికి నన్ను ఎడమవేపున కట్టి నడి పించారు. ఇద్దరి బాధ్యత నేనే వహించి ఈ రథాన్ని ముందుకు నడిపించాను. నువ్వు చాలా యోగ్యుడివి. అన్ని విషయాలలోను శ్రద్ధ తీసుకుంటున్నావు. ఉద్యోగంలో కూడా నువ్వు చాలా అప్రమత్తుడిగా ఉన్నట్లు నేను విన్నాను"

మా అత్తగారు లోలోపల ఏదో బాధపడు తున్నారు. పూర్వం కన్న హెచ్చుగా సోషల్ వర్కులో కలుగజేసుకుంటున్నారు. పగలల్లా ఎక్కడెక్కడికో తిరిగి, రాత్రి అలిసిపోయి పడుక్కుంటున్నారు.

నా భార్య చాలా నిలకడ అయిన మనిషి. సంసారం నడపడం ఆమెకు పుట్టు కతోనే వచ్చినట్లుంది. అత్తవారివేపు చాలా ఆదరంగా మెసలుతూ, తన తల్లికి ఏమీ లోటురాకుండా చూస్తూ, నాకు ఏవిధమైన ఇబ్బంది కలగకుండా శ్రమపడుతున్నది. చంటిపిల్లాడిని చూసుకోడంలో వెనుకాడ లేదు.

నేను మామూలుగా పనిచేస్తుంటే ఆరునె లలు గడిచిపోయాయి.

ఒకనాటి సాయంకాలం అనుకోకుండా అకస్మాత్తుగా మామగారిని సోములు ఆటోలో తీసుకొస్తే ఎవరం నమ్మలేక పోయాం.

మేమందరం చాలా సంతోషించాం.

ఇంతవరకు నేను రోజులు లెక్కబెట్టాను. ఇకమీద అతని ఉద్యోగం అతనికిచ్చేసి నా మానాన్న మరోచోటికి పోవచ్చు

మామగారు గడ్డం పెంచారు. అతనికి మాటలు సరిగా రావడంలేదు. అతను తిరిగి వచ్చిన సంగతి తెలిసి చాలామంది రాత్రే చూడడానికి వచ్చారు. అతనికి మతి స్థిమితంగా లేదని, ఎవరితోనూ మాట్లాడలే రని అందరినీ తిప్పి పంపించాము.

మరునాడు అతనికి క్షురకర్మ చేయించి మంచి బట్టలు కట్టి అతనీ ఆరునెలలు ఎక్కడ ఉన్నదీ చెప్పమని అడిగాం.

కాని అతనేం జవాబు చెప్పలేదు.

దూసి స్టేషనులో సోములు అతని నడ కను గుర్తుపట్టి పట్టుకొని రైలెక్కించి తెచ్చాడు.

ఈ ఆరునెలల జీవితం గురించి అతను ఎందుకు చెప్పడంలేదు?

నేను అతని జాగాలో పనిచేస్తున్నాను.

నాకు ఉద్యోగం మీద చాలా గౌరవం. నేను బాధ్యతగల ఉద్యోగిని. నా కిందపనిచేసే ఉద్యోగులు తరచు గైరుహాజరయి, వారి జాగాలలో మరెవరో పనిచేసి, ఏదోవిధంగా రైళ్లు నడపడం నాకు సరిపడలేదు.

పనివాళ్లందరి రికార్డులు స్వచ్ఛంగా ఉన్నాయి. ఎవరూ పొరపాటున కూడా తప్పు చేయలేదన్నమాట. చాలామంది నాకు దొరికిపోయారు.

ఎనిమిది గంటలో, అందుకు హెచ్చుగానో పనిచేయవలసినవాళ్లు ఉద్యోగాలలో కనిపించకపోతే నేను భరించలేకపోతున్నాను.

ఈ ఆరునెలలు ఇబ్బంది పడుతూనే గడిపాను.

నా మానాన్న నేను మరొకచోటికిపోతే, నాకు న్యాయంగా తోచినట్లు ఉద్యోగం చేయగలను.

మామగారు ఇల్లు చేరుకున్న తరువాత, ఇంతకాలం పొరపొచ్చాలు లేకుండా సాగుతున్న సంసారంలో పెద్ద సంక్షోభం ఏర్పడింది.

మా అత్తగారు రెండు రోజులవరకు ఏమీ అనలేదు. అతనిని ప్రశ్నలు వెయ్యలేదు. ఒక వారంరోజులవరకు తన కార్యక్రమాలను రద్దు చేసుకున్నారు.

మూడోరోజు పొద్దున్న కాఫీలు అయిన తరువాత హాలులో అందరం కూర్చున్నాం.

"మీరు ఎప్పుడు ఉద్యోగంలో చేరుతారు? " మా అత్తగారు అడిగారు.

మామగారు మాట్లాడడానికి ప్రయత్నించారు. చాలా కష్టంతో అన్నారు.

"నాకు మాట పోయింది. బాగుపడ్డ తరువాత ఆలోచిస్తాను"

"మీకు ఎలా మాటపోయింది? "

"మాట పోవడమే కాదు, చెవులు కూడా వినిపించడంలేదు. అతను సంజ్ఞలతోను, చిన్న చిన్న మాటలతోను తెలియజేయడానికి ప్రయత్నించారు"

"మీకు ఇంటి సంగతి ఎప్పుడు జ్ఞాపకం వచ్చింది? " నేనడిగాను.

"సోములు కనిపించి నన్ను గుర్తుపట్టిన తరువాత"

"మీరు ఈ ఆరునెలలు ఎవరింట్లో గడిపారో చెప్పగలరా? "

అతను నా ముఖంలోకి చూసి ఊరుకున్నారు.

"ఇవన్నీ చెప్పి, అదెందుకు చెప్పలేరు? " మా అత్తగారు ప్రశ్నించారు.

"ఆ విషయం చెప్పడంకన్న ఊరుకోవడం మంచిది"

తరువాత అతను సంజ్ఞలు చేశారు. అంట్లు తోమినట్లు, గుడ్డలు ఉతికినట్లు, పేడ పిడకలు చేసినట్లు అతను తెలియజేశారు.

"మీరు చెప్పలేకపోయారా, మంచి గౌరవప్రదమైన ఉద్యోగం చేస్తున్నట్లు"

తనకు మాట రాలేదని, గత జీవితం పూర్తిగా మరచిపోయినట్లు అతను సూచించారు.

అతను పూర్వంకన్న బాగున్నారు.

"మీరేదో దాచడానికి ప్రయత్నిస్తున్నారు" అన్నారు మా అత్తగారు.

అతను జవాబివ్వలేదు.

తనకు ఇష్టమైన సంగతులైతే సంజ్ఞలు చేసి చెప్పేవారు. తనకు సరిపడని విషయాలపట్ల మౌనం వహించేవారు.

"మెడికల్ బోర్డు ఏర్పాటు చెయ్యమని రైల్వే డివిజనల్ మేనేజరుగారితో చెప్పాను. ఎప్పుడు మీకు వీలవుతుంది? " నేనడిగాను.

అతను నవ్వి ఊరుకున్నారు.

ఈ విధంగా మామగారు మాకొక సమస్యగా పరిణమించారు.

ఇతను ఎప్పుడు ఉద్యోగంలో చేరుతారు?

నేనెప్పుడు విముక్తుడనవుతాను.

మరునాడు ఉదయం మా అత్తగారు కొత్త ప్రయోగం చేశారు. బ్రెయిన్‌స్టార్మింగ్ సెషన్ మొదలుపెట్టారు. సాధారణంగా మీటింగులలో ఇటువంటి పనిచేస్తారు. దానివలన కొత్త కొత్త ఆలోచనలు రేకెత్తుతాయి. కొన్నిటిని అమలులో పెడితే సత్ఫలితాలను ఇస్తాయి.

ఉదయం ఎనిమిది గంటలకు హాలులో నలుగురం కూర్చున్న తరువాత సంభాషణ మొదలయింది. మా అత్తగారి పెళ్లయిన మొదటి అయిదు సంవత్సరాలలో అతని



పరిస్థితి గురించి, అతని అసమర్థత గురించి, అతను చేసిన పొరపాట్ల గురించి, అతను పొందిన అవమానాల గురించి, సాధ్యమైనంతవరకూ తేదీలతోసహా ఆవిడ చెప్పడం మొదలుపెట్టారు.

మా అత్తగారి జ్ఞాపకశక్తికి జోహార్లివ్వాల్సిందే!

మామగారి జడత్వానికి అంతకన్నా నమస్కారాలు. ఎనుబోతుమీద జడివాన కురిసినట్లు ఆమె చేసిన ఆరోపణలు అతనిమీద నుండి జారిపోయాయి. నాకా విషయాలేవీ తెలియవు.



ఆ రాత్రి చాలాసేపటివరకు నాకు నిద్ర రాలేదు. పక్కనే నా భార్య, చంటివాడు పడుక్కున్నారు. మామగారిని తొలిసారి కలిసిన సంగతి జ్ఞాపకం వచ్చింది.

ఒకరోజు సాయంకాలం పిఠాపురంలో మా ఇంటికి ఒకాయన వచ్చారు. అతను ఆరడుగుల పొడుగున్నారు. పంచె కట్టుకున్నారు. నిండు చేతుల షర్టు తొడుక్కున్నారు. కోటు వేసుకున్నారు. ఫలానావారి ఇల్లెక్కడని నన్నే రోడ్డుమీద అడిగారు. తరువాత మా నాన్నగారిని కలిశారు. పెళ్ళి సంబంధం గురించి వచ్చానని చెప్పారు. మా నాన్నగారు మా తాతగారిని కలియమన్నారు.

మా తాతగారికి డెబ్బై సంవత్సరాలు. అతను లాయరుగా పనిచేస్తున్నారు. ప్రాక్టీసు మా పినతండ్రులు చూసుకుంటున్నా, ఏవో ముఖ్యమైన కేసులకు కోర్టులకు వెళ్లేవారు.

అతను సాయంకాలంపూట ఇంటికి ఎదురుగా ఉన్న లానులో గార్డెన్ ఛెయిర్లు వేయించుకొని, తన వయసులో ఉన్న రిటైర్డు హెడ్‌మాస్టరుగారితోను, విశ్రాంతులైన డిప్యూటీ కలెక్టరుగారితోను ఏవో సంగతులు మాట్లాడేవారు. సంభాషించేవారు ముగ్గురే అయినా, నాలుగు కుర్చీలు లానులో వేయించేవారు. మా నాన్నగారిని కలిసిన తరువాత మా తాతగారి దగ్గిరకి అతను వచ్చి, తనకు చూపించిన నాలుగో కుర్చీమీద కూర్చున్నారు.

అందరికీ నమస్కారాలు చేసి తనను పరిచయం చేసుకున్నారు. నేను ఆ పరిసరాలలోనే ఉండడంతో వాళ్ళ సంభాషణ విన్నాను.

"అయ్యా! నా పేరు శంకర దీక్షితులు. నేను రైల్వేలో సీనియర్ ఇనస్పెక్టరుగా ఉద్యోగం చేస్తున్నాను. కార్యార్థినై మీ దగ్గరికి వచ్చాను. నాకు పెండ్లీడు అమ్మాయి ఉంది. ఆమె బి.ఏ. పాసయింది. అందం గురించి నేనేమి చెప్పగలను? మా అమ్మాయి మా కళ్లకు చాలా చక్కనిదే. అయినా ఒక సంగతి మాత్రం దృఢంగా విన్నవిస్తున్నాను. ఆమెకు అంగలోపంకాని, వైకల్యంకాని లేవు. తన యీడుకు తగిన ఆరోగ్యం ఆమెకుంది. తల్లి క్రమశిక్షణలోను, తండ్రి అనురాగంలోను ఆమె పెరిగింది. ఆమెకు పద్దెనిమిదేళ్ళు. సంగీతం, నాట్యం మొదలైన కళలు ఆమెకు రావు. ఇంటిపనులు మెలకువగా చేసుకోడం, సంసారం దిద్దుకోడం బాగా తెలుసు. మీ పెద్ద మనుమడు ఈమధ్యనే సర్వీసు కమీషను పరీక్షలో ఉత్తీర్ణుడయి ప్రొబేషనరీ ఇనస్పెక్టరుగా ట్రెయినింగ్‌లో చేరినట్లు నా స్నేహితులు చెప్పారు. మీరు, మీ అబ్బాయి, మీ భార్య, కోడలు వచ్చి అమ్మాయిని చూసుకోవలసిందని కోరుతున్నాను" అన్నారు నాకాబోయే మామగారు.

మా తాతగారు చిన్న నవ్వు ముఖంమీద తోచగా, తన మిత్రులతో అన్నారు.

"మీరు, మరే క్రాస్ ఎగ్జామినేషన్లు అవుసరంలేకుండా అన్నీ స్టేట్‌మెంట్‌లోనే యిచ్చారు. కాని ఒక్కసంగతి చెప్పడం మరచిపోయారు"

"అదేదో సెలవియ్యండి"

"సంవత్సరంనర ట్రెయినింగ్ పీరియడ్‌లో పెళ్ళి చేసుకోకూడదని, మా మనమడు సంతకంచేసిన బాండులో ఉంది. అది మీరు గుర్తించినట్లు లేరు"

"మీరు చెప్పినది నిజమే. కాని, ప్రతిరూల్‌కి ఒక అమెండ్‌మెంటు ఉంటుంది. ముందుగా అనుమతి తీసుకుంటే ట్రెయినీ పెళ్ళిచేసుకోవచ్చు. దాని గురించి నేను శ్రద్ధ తీసుకుంటాను"

కాబోయే మామగారు వెళ్ళిపోయిన తరువాత మా తాతగారు హెడ్‌మాస్టరుగారితో

అన్నారు.

"ఈ వచ్చిన అతను చాలాసౌమ్యుడు. మాటల తీరూ తెన్నూ ఎరిగినవాడు"

"ఇది అతని సంస్కారానికి నిదర్శనం" అన్నారు డిప్యూటీ కలెక్టరుగారు.

పెళ్ళి కూడా అంత చక్కగా చేశారు.

ఎక్కడా ఏలోటూ రానీయకుండా మా అత్తగారు నడిపించారు.

అన్నీ బాగున్నాయి, మరెందుకీ రభస?

నిద్రలో నా భార్య తుళ్లిపడుతున్నది. తల్లి దండ్రులు ఈ విధంగా దూరమవుతుంటే బాధపడుతున్నది.

ఈ విధంగా నాలుగు రోజులు మా అత్త గారు మామగారి జీవితాన్ని జల్లెడపట్టారు.

అతను ఆ మాటలువింటూ చలనంలే కుండా ఎలా కూర్చున్నారనిపించింది.

అయిదోరోజు ఆమె పూర్తిగా తేల్చివేశారు.

"నేను నాలుగురోజులబట్టి ఆడిన మాటలు, ఏ గోడకో చెప్పినట్లున్నాయి. పౌరుషంగల మరో మగాడయితే ముందు నన్ను చంపి, తాను చచ్చేవాడు. మీలో ఎటువంటి మార్పు రాలేకపోతే ఏమనుకో వాలి? "

అతను జవాబు చెప్పలేదు.

"ఒకనాటి సాయంకాలం మా ఇంటి అరు గుమీద కూర్చొని, మంచినీళ్ళడిగిన పెద్దమ నిషికి మా నాన్నగారు నన్నిచ్చి పెళ్ళిచేశారు. అతని ఉద్యోగంపోయింది. ఇల్లు లేదు, వాకిలి లేదు. కనీసం మరో జత బట్టలు కూడా లేవు. ఈ సంసారాన్ని నేను నిలబె ట్టానని ధైర్యంగా చెప్తున్నాను. ఉద్యోగంలో ప్రమోషను ఇప్పిస్తే సంతోషించడానికి బదులు వద్దనే పెద్దమనిషి ప్రపంచంలో మీరు తప్ప మరొకరు కనిపించలేదు"

ఆవిడ యింట్లోకి పోయి ఒక గ్లాసెడు నీళ్ళు తాగి వచ్చారు. నిద్రలేక ఆవిడ కళ్ళు ఎర్రబడ్డాయి. జుత్తు కూడా బాగా చెదిరిపో యింది.

"ఇంతకాలం ఒక వ్యక్తిత్వం లేని మని షితో ఎలా కాపురం చేశానని నాకే ఆశ్చర్యం వేస్తున్నది. శారీరకమైన సంబంధం సడలి పోయి చాలా కాలమయింది. ఒక చూరు కింద, భిన్నభిన్న సంస్కారాలు, విభిన్నమైన ఆదర్శాలు గల ఇద్దరు మనుష్యులు బత కడం కష్టం. నా ఆత్మాభిమానాన్ని చంపు కొని నేను జీవించలేను. నన్ను ఇలాగేనా ఉండమని విడిచిపెడితే మీకు, మీ పెద్దలకు వేయివేల దండాలు"

కన్నీళ్ళు కారుతుంటే ఆమె ఏడుస్తూ యింట్లోకి వెళ్ళిపోయారు.

ఆరోజు అతను మెడికల్ బోర్డు ముందు హాజరవడానికి బదులు, తన ఉద్యోగానికి రాజీనామా సమర్పించారు. అప్పటికి ఇరవై అయిదు సంవత్సరాల సర్వీసు ముగిసింది. మానసికంగా తాను ఉద్యోగం చేసే సామర్థ్యం కోల్పోయానని తోటకూరకాడవలె వాలిపోయి అంటుకుపోలేనని ఆయన కారణం రాశారు.

అతనో రెండు నెలలు ఆఫీసుల్లో తిరి గారు.

భార్యాభర్తలు ఏ రాత్రికో యిల్లుచేరి, ఒక రికంట ఒకరు పడకుండా కాలం గడిపారు.

ఇది నా భార్యకు పరీక్షాకాలం.

ఏనాడయితే భర్తనుండి విడిపోవాలని మా అత్తగారు ఒక నిశ్చయానికి వచ్చారో, ఆనాడే నా భార్యను ఆజ్ఞాపించారు.

"అమ్మాయ్! నేను సమాజసేవలకు తిరు గుతుంటే, అవకాశం చూసి మీ నాన్న నీ బుద్ధిని పాడుచేశారు. ఇక నేను సహించ లేను. నువ్వు మీ నాన్నతో మాట్లాడితే నేనీ యింటినుంచి వెళ్ళిపోతాను. కాబట్టి, నీకు ఎవరు కావాలో ఆలోచించుకో!"

అందుచేత ఆమె తండ్రి గురించి పట్టించుకోడానికి తెగించలేదు. తండ్రి అంటే ఎంత అభిమానమో, దానినంతా ఆమె గుండెలలోనే దిగమింగుకుంది.

నా పరిస్థితి కూడా అలాగే ఉంది. నేను ఇటువంటి వాతావరణంలో ఎప్పుడూ పెరగలేదు. ఇంట్లో ఉన్నవాళ్ళందరూ ఒకరిపట్ల ఒకరు అభిమానంతో ఉండడం, ఆత్మీయతతో మెలగడం నాకు తెలుసు. ఈ విధంగా ఒకరిమీద ఒకరు, ముఖ్యంగా భార్యాభర్తలు కత్తులు నూరుకోవడం నాకు తెలియదు. మా తాతగారి దగ్గరికి విడాకులు కోరే దంపతులు వస్తే, ఒకరినొకరు దూషించుకోవడం నేనెరుగుదును. ఎందుకలా వాళ్ళు ప్రవర్తిస్తారో ఇప్పుడు నాకర్థమయింది.

ఉదయం చూస్తే మామగారు ఇంట్లో కనిపించలేదు.

ఆయనకోసం వెదకవలసిన అవసరం లేకుండా హాలులో టేబిలుమీద ఒక కొత్త అటాచీ, దానికింద ఒక ఉత్తరమూ కనిపించాయి.

ఆ ఉత్తరం ఎవరికి రాశారో వేరే చెప్పనక్కరలేదు.

అది అంటించిన కవరు కాదు. అందుచేత ధైర్యంగా చదివాను.

"నేను లోకంలో నిరాధారంగా ఉన్నప్పుడు మీ నాన్నగారు నాకు ఆశ్రయమిచ్చారు. పోయిన ఉద్యోగం తిరిగి యిప్పించారు, పిల్లనిచ్చారు. ఇల్లు నిలబెట్టారు. ఎవరో దారిని పోయే దానయ్యను ఇంటి అల్లుడిగా చేసుకోడానికి అతను ఎందుకు తొందరపడ్డారో ఇప్పుడు అర్థమయింది.

"నేను చాలా ముక్కుసూటిగా పోవలసిన వాడిని. పక్కవాళ్లు బాధపడుతుంటే చూసి ఓర్చుకోలేనివాడిని. సమాజసేవలో కొందరికి అట్టూ కొందరికి ముక్కా పెట్టాలని తెలియనివాడిని. నేను ముందుకువేసే ప్రతి అడుగుకి ఒక ఉచ్చువేసి, బోనులోని పులిలా నన్ను బంధించినప్పుడు, దైవం నాకు పుస్తకాలు చదువుకోడానికి అవకాశమిచ్చాడని సంతోషించాను. అది కూడా నీవంటివాళ్ళకి కళ్ళు కుట్టుకునేటట్లు చేసిందని తెలుసుకొని చాలా విచారించాను. కాదు ఏడ్చాను. నువ్వు, నేను వేరువేరు దిశలకు ప్రయాణం చేస్తున్నాం. ఒకడుగు ముందుకు వేస్తే రెండడుగులు దూరమవుతున్నాం. మనం కలియడమన్న ప్రశ్న లేనేలేదు"

"నువ్వు మాటిమాటికి, నా బతుకు నీ తండ్రి పెట్టిన బిచ్చమని అంటున్నావు. దానినంతటినీ ఈ సంసారాన్ని పోషించడంకిందే వినియోగం చేయించావు. నా బాధ్యతలు ఆ విధంగా నెరవేర్చుకున్నాను.

"కోర్టుద్వారా మనం వేరుపడితే బాగుంటుందనిపించింది. చాలా జాగ్రత్తగా ఆలోచించాను. నాకు పోయేది ఏమీలేదు. కాని సంఘంలో నీకో మంచిపేరుంది. అది నాశనమవుతుంది. నేను ఈనాటికి నీమీద కాని, నీ తండ్రిమీదకాని పగతీర్చుకోడం లేదు. ఎవరికీ తెలియకుండా నేను వెళ్ళిపోతే, మతిస్థిమితంలేనివాడు మళ్ళీ ఇల్లు విడిచి వెళ్ళిపోయాడని లోకం భావిస్తుంది. అది నీకు శ్రీరామరక్ష!"

అప్పటికింకా మా అత్తగారు నిద్రలేవలేదు.

రెండుసార్లు ఉత్తరం చదువుకున్నాను. బ్రీఫ్‌కేసునిండా నూరు రూపాయలనోట్ల కట్టలు నిండి ఉన్నాయి. అవి ఎన్నో నాకు తెలుసుకోవాలనిలేదు. నా భార్యను పిలిచి ఆ ఉత్తరం చూపించాను. గుడ్ల నీరు కుక్కుంది ఆమె. జాగ్రత్తగా ఆ కాగితాన్ని మడిచి, పెట్టి కిందపెట్టి పిల్లాడి సంరక్షణకి వెళ్ళిపోయింది.

మా అత్తగారు నిద్రలేచి, తన పనులన్నీ నెరవేర్చుకొని హాలులోకివచ్చారు. ఆవిడకి

ఉత్తరం, బ్రీఫ్‌కేసు అప్పజెప్పాను.

ఆవిడ ఒకసారి ఉత్తరం చదివి చింపివేశారు.

"అమ్మాయ్! ఇలారా! నేను రాబోయే వాటిని ఊహించుకొని బాధపడవలసిన దానినికాను. ఎప్పుడు ఎదురయే సమస్యకు అప్పుడు పరిష్కారం వెదకవలసినదానిని. కాబట్టి మీ యిద్దరికీ నా సలహా ఏమంటే, గతం గురించి ఆలోచించకండి. ఈ సంసారాన్ని ఆరునెలలయి ఏలోటూ లేకుండా నువ్వు నడుపుతున్నావు. మీ యిద్దరి పేర జాయంట్ అకౌంట్ బాంకులో తెరచి, మంచి వడ్డీవచ్చేటట్లు డిపాజిట్‌చేయండి. ఇది మనందరికోసం మీ నాన్నగారు ప్రసాదించింది"

జీవితంలో ఎంతోమందిని నేను చూశాను.

ఆవిడవలె తామరాకుమీద నీటిబొట్టులా వ్యవహరించే మనిషిని ఇంతవరకు చూడలేదు. ఏదో ప్రళయం సంభవిస్తుందని నేను భయపడ్డాను. ఈ విధంగా ఒక రాజమార్గం తెరచుకుంటుందని కలలో కూడా అనుకోలేదు.

మామగారు తనతో ఒక పూచిక పుల్ల కూడా తీసుకుపోలేదు. అతని బట్టలన్నీ అత్తగారు కుట్టించినవే. అందులో ఒకటి కూడా అతను తీసుకుపోలేదు. సోములు అతనిని యింటికి తెచ్చినప్పుడు కట్టుకున్న పంచ, బనియను, గామంచా మాత్రం ఇంట్లో కనిపించలేదు.

నేను ఎంతగా విముక్తిని కోరుకున్నానో, అంతగా నా ఉద్యోగానికి, ఊరుకి కట్టుబడిపోయాను. మామగారు వెళ్ళిపోయిన రెండు రోజులలోనే నన్ను అక్కడే స్థిరంగా సీనియర్ ఇనస్పెక్టరుగా వేసినట్లు ఆర్డర్లు వచ్చాయి.

తనకు ఎన్నో అవరోధాలు మా అత్తగారు కల్పించారని మామగారు నిందలు వేశారు. కాని, నాపట్ల అటువంటి ప్రయత్నం ఆమె చేసినట్లు కొంచెమైనా అనుమానం కలుగలేదు.

సాధారణంగా సీనియర్ ఇనస్పెక్టర్లు తమ బంగళాలోనే ఆఫీసు తెరుస్తారు. మా బంగళాలో ఒక గదిని ఆ విధంగా ప్రత్యేకించారు. ఇప్పుడు ఆ గదిలోని ఫర్నిచరు, రికార్డు పైకి తీయించి చక్కని డిస్టెంపరు వేయించాను. టేకు కర్ర ఫర్నిచరుకి పాలిష్ చేయించాను. వేయి రూపాయలిచ్చి ఎగ్జిక్యూటివ్ ఛెయిర్ తెప్పించాను. ఫైళ్లు దులిపించాను. రికార్డులు సరిచేయించాను. ఇంతవరకు ఎవరి చెప్పులలోనో కాళ్ళుంచి నడిచాను. ఇపుడు నాదన్న దారిలో అడుగువేస్తున్నాను.

బంగళా ప్యూన్ సింహాచలాన్ని బదిలీ చేశాను. కొత్తవాడిని వేసుకున్నాను. వాడు సరిగా పనిచెయ్యకపోయినా, కొత్త యిబ్బందులు తెచ్చిపెట్టినా ఉద్యోగంనుంచి తీసేస్తానన్నాను.

పాత కేసులన్నీ పరిష్కారం చేశాను.

కొంతమందిని బదిలీ చేశాను. కొందరిని రివర్ట్ చేయడానికి రాశాను. చాలామందికి ఇంక్రిమెంటు ఆపుజెయ్యమన్నాను.

ఈ ఆరునెలల్లో నేను చాలా తక్కువ సార్లు వెళ్ళక తప్పనప్పుడే లైనుమీదికి వెళ్ళి వచ్చాను. స్టాఫ్‌తో యాదాలాపంగా మాట్లాడాను. దేనిలోను కల్పించుకోలేదు. వాళ్ళు కూడా నన్ను గుర్తించలేదు. టెంపరరీ మనిషినని వాళ్ళు భావించారు.

ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి. సెక్షన్ ఈ కొసనుండి ఆ కొసవరకు ఉంది. ప్రతి స్టేషనులో ఒకరోజు మకాం చేసి, పనిపాట్లు ఎలా జరుగుతున్నది, పనివాళ్ళు ఎలా వ్యవహరిస్తున్నది క్షుణ్ణంగా పరిశీలించాను. స్టేషన్లు ఎంత అధ్వానంగా ఉన్నదీ,

ఉద్యోగులు ఎంత విశృంఖలంగా తిరుగుతున్నది గమనించాను. అందరినీ హెచ్చరించాను.

ఆరు నెలల తరువాత ఉచ్చులు బిగించాను.

ఆ సంవత్సరం చాలామందికి ప్రమోషన్లు వచ్చాయి. అర్హులైన వాళ్ళని, పరీక్షలో ఏమాత్రం లొసుగు చూపకుండా ప్రమోషన్లు యిచ్చాను.

మొదట్లో **చాటుగా నామీద** చెప్పుకునే వారు. తరువాత తరువాత నా ముఖంమీదే తిట్టడం మొదలుపెట్టారు. దేవుడిలాంటి మామగారి జాగాలో యమధర్మరాజొకడు వచ్చాడని వాళ్ళు దుయ్యబట్టారు.

ఇంతకాలం పై అధికారులు ఏవీ పట్టించుకోలేదు. ఇపుడు అందరూ ఆలోచిస్తున్నారు. ఒకాయన నన్ను పిలిచి, కొంచెం చాకచాక్యంగా పనిచెయ్యమన్నాడు. కిందివాళ్లతో తగవులు పెట్టుకుంటే ఎప్పటికేనా ప్రమాదమే అని హెచ్చరించాడు.



రోజులు గడిచిపోతున్నాయి.

చాలామంది పొగరుబోతుల్ని మెడలు వంచి దారికి తెచ్చాను.

మామగారు ఉద్యోగినే కాకుండా ఉద్యోగి కుటుంబాన్ని కూడా పరిగణించి, వాడిని శిక్షిస్తే కుటుంబమంతా దెబ్బతింటుందని, వాడిని మంచి దారిలో పెట్టడానికి ప్రయత్నం చేశారు.

కాని, నా దృష్టి భిన్నమైనది.

ఉద్యోగం దొరికేవరకు వాళ్ళు కాళ్ళు, చేతులు పట్టుకొని కుటుంబాన్ని పోషించవలసిన బాధ్యత తమదే అన్నట్లు అన్ని అగచాట్లు పడతారు. పనిలో చేరిన తరువాత అన్నీ మరచిపోతారు. వాళ్ళకు ఇటు ప్రభుత్వంకాని, అటు కుటుంబంకాని కనిపించదు. బాధ్యత పైన వేసుకోరు. ఉద్యోగి తప్పుచేస్తే ప్రభుత్వం శిక్షిస్తుంది. అతని కుటుంబం గురించి ఆలోచించదు. ఉద్యోగి లోటుపాట్లు రాకుండా పనిలో శ్రద్ధ వహించాలి. అశ్రద్ధగా ప్రవర్తించి ప్రభుత్వ ఆస్తికి, ప్రయాణికుల భద్రతకు ముప్పు తెచ్చిన నాడు తప్పకుండా ఆ ఉద్యోగిని శిక్షించాలి. ఇది ధర్మం.

సెక్షనులో వాళ్లందరూ ఉద్యోగాలకు చికాకు వస్తుందని భయపడ్డారు. బతకడానికి ఉద్యోగం ముఖ్యం.

క్రమంగా నేను మామూలుగా ప్రవర్తించడం మొదలుపెట్టాను.

సెక్షన్ అంతటిలో నాకు కొరకబడని స్టేషను మాస్టరొకడు మిగిలాడు. మొదటి ఆరునెలలలో అతని దగ్గరికి పోలేదు. ఉద్యోగంలో స్థిరపడ్డతరువాత రెండుసార్లు అతని స్టేషనుకు వెళ్ళాను. రెండు సార్లూ అతను సెలవు పెట్టి తప్పించుకున్నాడు. ఈసారి వారంరోజులు ముందు ఉత్తరం పంపించాను. స్టేషను ఇనస్పెక్షన్‌కి అతను ఉండి తీరాలని, సెలవుపెట్టి వెళ్ళిపోడానికి వీలులేదని గట్టిగా రాశాను.

అతని పేరు నాయుడు. అతను గుణుపురం స్టేషనులో పనిచేస్తున్నాడు. చాలా పాతవాడు. మరొకడైతే ఈసరికి మంచి

పదవిలో ఉండేవాడు. సంవత్సరంలో రెండు నెలలు పనిచేస్తే పదినెలలు గైరుహాజరవుతాడు. అతను ముందు నేపడాలో పెద్ద మాస్టరుగా ఉండేవాడు. అతని పని పాట్లు సరిగాలేక అధికారులు అతనిని మారుమూలస్టేషను గుణుపురానికి బదిలీచేశారు. ఇది అతనికి శిక్షగా మారడానికి బదులు వరంగా పరిణమించింది. ఎవరూ అడిగేవారు లేక మరీ విచ్చలవిడిగా తిరుగుతున్నాడు.

పనికట్టుకొని అతని కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు పాతవి తీయించాను. మనిషి తాగుబోతు, అతని శీలం కూడా అంత మంచిది కాదు.

రాత్రి బండిలో నేపడాలో దిగి, ఉదయం చిన్న బండీ పట్టుకొని గుణుపురం స్టేషను చేరేసరికి మధ్యాహ్నం ఒంటిగంట

అయింది. తొంభైకిలోమీటర్ల దూరం పోడానికి ఆ బండికి ఆరు గంటలు పట్టింది. పర్లాకిమిడి చేరేసరికి పది గంటలయిది. అక్కడ టిఫిన్ తెప్పించుకొని తిన్నాను.

గుణుపురం స్టేషను చేరిన తరువాత స్టేషనులో కూర్చున్నాను. నేను వస్తున్నానని తెలిసినా పెద్ద మాస్టరు వచ్చి నన్ను కలియలేదు. అంతేకాకుండా అతను గైరుహాజరయ్యాడు. ఎవరో చిన్న మాస్టరు అతని జాగాలో పనిచేస్తున్నాడు.

కథ మళ్ళీ మొదటికి వచ్చింది.

హోటలు నుంచి భోజనం తెప్పించుకొని తిన్నాను. పెద్ద మాస్టరు నాయుడిని పిలుచుకురమ్మని నా మనిషిని పంపించాను. ఇంటికి తాళంవేసి ఉంది. ఇతను స్టేషను విడిచి బయటికిపోడానికి ఎవరి అనుమతి తీసుకున్నాడు?

వెయిటింగ్ రూములో ఈజీఛెయిర్‌లో కూర్చున్నాను. రమారమీ రెండు గంటలవుతుంటే ఇద్దరు పాసింజరులు అక్కడికి వచ్చారు. అతను భర్తకాబోలు. ఆరడుగులు పొడవు మనిషి. సూది ముక్కు. విశాలమైన ఫాలం. సన్నరకం ఖద్దరు పంచ. మంచి జరీ అంచుది కట్టుకున్నాడు. నిండు చేతుల తెల్లటి ఖద్దరు చొక్కా వేసుకున్నాడు. మనిషి చాలా చక్కగా ఉన్నాడు. మనిషి నలభైఅయిదు సంవత్సరాలకు మించడు. అతని ముఖంలో హుందా కనిపిస్తోంది.

ఆవిడ అతని భార్య కాబోలు- అంతకన్నా చక్కగా ఉంది. అప్పుడే మూసనుండి కరిగిన బంగారం దిమ్మలోకి పోసి, పైకి తీసిన బొమ్మలా ఉంది. ఆవిడ వయసు ఎంత ఉంటుందని చెప్పడం? పదహారేళ్లనుండి ముప్ఫైయేళ్ల మధ్యను ఉన్నట్లుంటుంది. ఎవరికి కావలసిన వయసు వారికి ఆమెలో కనిపిస్తుంది. ఆమె కళ్లు, ముక్కు విశిష్టమైనవి. చూపులో లోతయినవి. ముంగురులు విశాలమైన ఫాలంమీద నాట్యం చేస్తున్నవి. మెడలో బంగారు గొలుసొకటి ఉంది. ఆమె కూడా పలుచని ఖద్దరు చీర కట్టుకుంది. చుక్కల ఖద్దరు రవిక తొడుక్కుంది. ఆమె సౌందర్యానికి దృష్టి దోషం తగులకుండా కుంకుమబొట్టు పెట్టుకున్నట్లుంది.

నేనామెను చూస్తుంటే కవిత్వం వచ్చినట్లయింది.

వాళ్లిద్దరూ ఎంత అనురాగంతోనో మాట్లాడుకుంటూ లోపలికి ప్రవేశించారు. వారి చేతుల్లో చిన్న ట్రావెల్ బాగ్‌లున్నాయి.

వచ్చిన అతను ఒకక్షణం నావేపు చూసి, తన భార్య పక్కన బెంచీమీద కూర్చున్నాడు.

డ్యూటీలో ఉన్న చిన్న మాస్టరు తొందరగా వెయిటింగ్ రూములోకి వచ్చి ఆ పెద్ద మనిషితో రెండు మాటలాడి, నావేపు తిరిగి అన్నాడు.

"సార్! వీరే మా పెద్దమాస్టరు నాయుడుగారు. అయ్యా, వీరు మన సీనియర్ ఇన

స్పెక్టరు శర్మగారు మిమ్మల్ని డ్యూటీలో ఉండమని ముందుగా ఉత్తరం వ్రాసినా, ఎందుకు లక్ష్యపెట్టకుండా సెలవు తీసుకున్నారని అడుగుతున్నారు. సెలవు పెట్టినా, స్టేషను విడిచి వెళ్లడానికి ఎవరు అనుమతి ఇచ్చారని ప్రశ్నిస్తున్నారు"

ఆ నాయుడు నావేపు ఒక అయిదు నిమిషాలు చూశాడు. అతని భార్య కూడా నన్ను తదేక దీక్షతో చూసింది.

"పంతులూ! మిట్టమధ్యాహ్నం రైలు దిగావు. భోజనం చేశావా? " అడిగాడు నాయుడు.

అతని మాటలు వింటుంటే నాకు అరికాలిమంటలు నెత్తికెక్కుతున్నాయి. నువ్వు నువ్వు అని సంబోధిస్తే నాకు మరీ చికాకు కలిగింది. వీళ్లు పెద్ద ఉద్యోగాలు చేస్తున్నా మాటలాడడం కూడా తెలియనందుకు ఏం చర్య తీసుకోవాలి?

"శర్మా! నిన్ను ఏకవచనంలో సంబోధించినందుకు చాలా కోపంగా ఉన్నావు. ఉద్యోగంలో నేను ఉన్నప్పుడు నిన్ను ఎలా పిలవాలో నాకు అంతుపట్టడంలేదు. మిస్టర్ సీనియర్ ఇనస్పెక్టరని పిలవాలా, శర్మగారూ అని అడ్రస్ చేయలా, లేక సర్ అని సంబోధించి సలాం చేయాలో నాకు తోచలేదు. ఇది చాలా ఎంబరాసింగ్‌గా ఉంటుంది. స్టాఫ్ ముందు నువ్వు అన్నిరకాల సంబోధనలు నానుండి ఆశిస్తావు. నీకు ఆశాభంగం కలిగించవలసివచ్చింది.

నువ్వు ఇన్‌సబార్డినేషన్ కింద నాకు ఛార్జిషీటు ఇచ్చినా ఇవ్వవచ్చు నేను సెలవుపెట్టి, నీ అనుమతి తీసుకోకుండా స్టేషను విడిచి వెళ్తున్నందుకు నామీద చర్య తీసుకున్నా నాకు అభ్యంతరం లేదు. కావలసిన వాళ్లను మనసారా ఆప్యాయంగా పిలుచుకోకుండా, అందలంమీద ఎక్కించడం నాకు సుతరాం సరిపడదు"

అతని భార్య నావేపు నిశితంగా చూస్తున్నది.

నాకు ఫకాలున నవ్వు వచ్చింది.

"నమస్కారం నాయుడుగారూ!"

నేను చేతులెత్తి అతనికి నమస్కరించాను. ఆవిధంగా మా ఇద్దరి మధ్యనున్న తెర తొలగింది.

"నాకు ముందున్న ఇనస్పెక్టరుగారి హయాంలో కూడా మీరిలాగే వ్యవహరించేవారా? "

"అంటే మీ మామ శంకరమా? "

"అవును"

నేను స్టాఫ్ దగ్గిర మామగారి ఊసెత్తవలసివస్తే ఇలాగే అనేవాడిని. అతని పేరు చెప్పి నిర్దాక్షిణ్యంగా వ్యవహరించడం నాకు ఇష్టం లేదు.

"వాడి హయాంలోను ఇలాగే చేశాను"

"అంటే? "

"నేను వాడి ఇనస్పెక్షన్‌కు ఉండేవాడిని కాను. డ్యూటీ ఉన్న చిన్నమాస్టరుతో రికార్డులు తెప్పించి ఇనస్పెక్షన్ చేసేవాడు"

"మీరిద్దరూ ప్రాణస్నేహితులుకదా? "

"అదేంలేదు. వాడి ధర్మమా అని నాలుగు ఇంక్రిమెంటులు బందయ్యాయి. నేపడా నుంచి గుణుపురం బదిలీ చేయించాడు"

ఈ పని మామగారు చేశారంటే నమ్మలేకపోయాను.

"మామగారి హయాంలో మీరు కలుసుకోలేదా? "

"వాడు నన్ను కలియలేదు. దానికేదో ప్రబలమైన కారణం ఉండిఉంటుంది. వాడు చాలా సెన్సెటివ్ మనిషి. ఎవరైనా తన గురించి అనుకుంటారని, అటువంటి ప్రచారానికి తావీయకుండా ఉండాలని ముందునుంచే ప్రయత్నించేవాడు. మా స్నేహం స్నేహమే, ఉద్యోగం ఉద్యోగమే"

"ఆయన అందరిపట్ల దేవుడు. మరి మీపట్ల ఎందుకీ ఉదాసీనబుద్ధి? "

"వాడు నాకు ప్రాణం కన్న అధికమైన వాడు. వాడి ప్రవర్తన వెనుక ఏదో బలమైన కారణం ఉండిఉంటుంది. ఇదంతా మంచికే అని వాడికి తెలుసు"

"మీ ఇద్దరినీ అర్థం చేసుకోవడం చాలా కష్టమవుతున్నది"

"ఓహ్ శర్మా! అద్దం వంటి మనస్సులు మావి. ఆవేళ మీ అత్తగారు నా సామాను బయటపెట్టి, ఇంటినుండి నన్ను వెళ్లగొట్టారు. నాకు ఆమెమీద కోపమనే అనుకుంటున్నావా? "

"ఇంత అవమానం చేసినందుకు మీరు కోపగించడంలో తప్పు లేదు"

"అది కాదు. విషయం విను"

ఇంతలో చిన్న బండి బయలుదేరుతున్నదని గంటకొట్టారు. చిన్నమాస్టరు స్వయంగా వచ్చి నాయుడుగారితో అన్నాడు.

"అయ్యా! మీరు బండెక్కితే లైన్‌క్లియరు పంపుతాను"

"శర్మా! మరోసారి వచ్చి ఇనస్పెక్షన్ చేయవచ్చు బండిలో నీతో ఎన్నో విషయాలు మాట్లాడాలి"

మా కోసం ఫస్టుక్లాసులో ఖాళీ ఉంచారు. సామానులోపలికి తెచ్చిపెట్టారు. అందులో మేం ముగ్గురమే కూర్చున్నాం.

బండి సరిగా మూడు గంటలకు బయలుదేరింది. చాలా మెల్లగా పోవడంచేత పెద్ద శబ్దాలేవీ రాలేదు.

"శర్మా! ఏమిటి చెప్తున్నాను? "

"మా అత్తగార్లు మిమ్మల్ని ఇంటినుండి వెళ్లగొట్టినా మీకావిడమీద ఎందుకు కోపం రాలేదని? "

"అవును. ఆమె కాదు- ఆమె స్థానంలో మరే ఇల్లాలు ఉన్నా అదేపని చేసేది"

"నాకేమీ అర్థమవడంలేదు"

"మీ అత్తగారు, మీ ఇంటికి నేను వచ్చిన తరువాత ఆదరించి నన్ను గెస్టు రూములో దింపారు. వేళకు టిఫిన్లు, భోజనాలు, స్నానపానాలు, దినపత్రికలు- అన్నీ ఏర్పాటు చేశారు. మీ మామకు నెల్లాళ్ల ట్రెయినింగు. అతను తిరిగి వచ్చేసరికి మరో పాతికరోజులు పడుతుంది. అంతవరకు నన్ను హాయిగా విశ్రాంతి తీసుకోమని చెప్పారు. ఆవిడకు తీరికలేక ఒక వారంరోజులవరకు నావేపు రాలేదు. మొదటి రెండురోజులు చాలా జాగ్రత్తగా గడిపాను. పగటిపూట తాగకుండా, సాయంకాలం మోతాదుగా తాగి చాలా ఇబ్బంది పడ్డాను. నేను దేనికైనా ఓర్చుకోగలను. కాని ఒంటరితనానికి చాలా భయపడతాను. ఏవో జ్ఞాపకాలు- అవి నన్ను చాలా బాధ పెట్టాయి. ఆ బాధ నుండి తప్పించుకోడానికి నాకు ఒక్కటే మార్గం తెలుసు. తాగి తాగి తెలివితప్పి పడివుంటాను. తాత్కాలికంగా అన్ని ఆలోచనలు దూరమయి నాకు బలవంతమైన శాంతి లభిస్తుంది. ఈ ప్రకారం వారం రోజులయ్యేసరికి నేను పూర్తిగా గుర్రమెక్కి కిందకు దిగలేని పరిస్థితిలో ఉండిపోతాను"

నేను వింటున్నాను. నాకన్నా శ్రద్ధగా అతని భార్య వింటున్నది.

ఒకే బెర్తుమీద, అతను మధ్యన, నేను కుడివేపు, అతని భార్య ఎడమవేపు కూర్చున్నాము.

ఇంతలో అతను సంభాషణ ఆపి, కాళ్లు మీదకు తీసుకొని బెర్తుమీద మఠం వేసుకు కూర్చున్నాడు.

"ఇలా కూర్చుంటే బాగుంటుందికదూ! అన్నట్టు నీతో ఏమన్నాను? " అతను భార్యను ప్రశ్నించాడు.

ఆమె ఏమీ జవాబు చెప్పలేదు.

అతను సన్నగా రాగం తీశాడు.

ఎంకీ మనమిద్దరమే

యెవ్వారొద్దన్నాడు.

ఈ సేలు ఈ తోట

లింకనీవన్నాడు.

పాట ఆపి ఆమె తొడమీద కొట్టి అతనన్నాడు.

"ఎంకీ కోపమా? "

అతనికేదో జ్ఞాపకం వచ్చినట్లు నా వంక తిరిగారు.

"శర్మా! నీకు నా ఎంకిని పరిచయం చెయ్యలేదా? "

ఆమె పేరు ఎంకని అతనంటే నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

"నువ్వు వచ్చిన సంతోషంలో మరిచిపోయాను. నేను నాయుడునుకదా! నన్నీమె నాయుడు బావా అని పిలుస్తుంది. నేనీ వెంకటలక్ష్మిని ఎంకీ అని పిలుస్తాను. ఇదీ ఇందులోని రహస్యం"

"మీరెంతో చక్కగా పాడుతున్నారు! నండూరివారి పాటలకు మీరు ప్రాణం పోశారు" అన్నాను, నేను కళ్లు చెమ్మగిల్లుతూ ఉంటే.

"ఆనాటి నావోడూ సెందురుడా!

అలిగీ రాలేదోయి సెందురూడా!

"ఈ పాట నా ఎంకే పాడాలి. నిర్మలమైన వెన్నెలలో, గులాబీపూల మృదువైన సౌరభంలో నా ఎంకి పాడుతుంది. శర్మా! జన్మకు ఇంతకన్నా హాయి ఎప్పుడేనా కలుగుతుందా? "

ఆమె పాడితే వినాలనిపించింది.

"అన్నట్లు, కథ ఎంతవరకు వచ్చింది? " అతనీసారి తన ఎంకినడిగాడు.

"నీకు కాఫీ పడితేనే కాని ఏవీ జ్ఞాపకం రావు" అంది ఆమె. ఆమె అతనిని అంత చనువుగా 'నీకు' అంటే నాకు ఆశ్చర్యం వేసినా, ఆ మాటలలో ఎంత తీయదనముంది? "

ఆమె లేచిఫ్లాస్కులోని కాఫీ మా ఇద్దరికీ ఇచ్చి తను కూడా తాగింది.

ఆమె స్వచ్ఛంగా కడిగిన ముత్యంలా ఉంది.

"ఇప్పుడు సావధానంగా వినండి. నా వెంకటలక్ష్మికి కూడా ఈ వివరాలు చెప్పలేదు. నా కళ్లు లోతులకు పోయాయి. రెండు రోజులై నేను స్నానం కూడా చెయ్యలేదు. తల రేగిపోయింది. గంటగంటకు తాగుతున్నాను. నాకు మరేదీ కోరిక లేదు. చచ్చిపోయి నా ప్రియురాలిని కలుసుకుందామనుకున్నాను"

"మీకు ఇంకో ప్రియురాలా? " నేనడిగాను.

"నీకు తెలీదా? మీ మామ నీతో ఈ విషయం చెప్పలేదా? "

"లేదు"

అతను తన మొదటి ప్రియురాలి గురించి వివరంగా చెప్పాడు.

"ఆమెకు ఆటా పాటా వచ్చు ఈమెకు పాట వచ్చుగాని, ఆట రాదంటుంది. ఈ వెంకటలక్ష్మికి వేరే నాట్యం నేర్పించడం దేనికి? ఆమె నడకే నాట్యం. ఆమె చూపే అభినయం"

ఆమె కిలకిలా నవ్వింది.

ఈతని మాటలన్నీ పరమసత్యమని నాకు తెలిసింది.

"అటువంటి స్థితిలో మీ అత్తగారు నా గదిలోకి ప్రవేశించింది. గదినిండా సిగరెట్టు పీకలు- ఎంగిలిపళ్లాలు. కడగని కాఫీ కప్పు ఎగిరి మంచంకిందకు పోయిన న్యూస్ పేపర్ కాయితాలు- వాటి మధ్యను దుప్పటీ కిందకు పడిన మంచంమీద, పిశాచంలా నేను కూర్చున్నాను"

అతను క్షణం ఆలోచించాడు.

"నేను ఆమె రాకను గుర్తించినట్లు లేను. ఆమె ఏమన్నారో నాకు వినిపించలేదు. ఎవడో బంట్రోతు నా పెట్టె, బెడ్డింగు పైకి ఈడ్చి, నన్ను బలవంతంగా లాక్కుపోతుంటే నేనీ ప్రపంచంలోకి వచ్చాను

"ఈ సంగతి తెలిసి నా భార్య బాగా బాధపడినట్లు చెప్పింది"

"అమ్మాయి ముమ్మూర్తులా మావాడినే పోలింది. అందరికీ విచారం కలిగినా, నా విషయంలో మరోవిధంగా పరిణమించింది. అప్పటి నా స్థితి అన్నిటికీ అతీతమైఉంది. మీ అత్తగారి కోపం నన్ను వెళ్లగొట్టకపోతే తాగితాగి నేను గుడ్లుపేలి చచ్చి ఉండేవాడిని. భగవంతుడు ఈవిధంగా నా చావు తప్పించాడు"

ఒక్కక్షణం అతను ఊరుకొని నవ్వి. అన్నాడు.

"మీ అత్తగారి ప్రవర్తన కారణంగా మావాడు మహాజ్ఞానిగా తయారయ్యాడు. ఆ భగవంతుడే సోములుని దారంట పంపాడు. సోములు నన్ను ఇంటికైతే తీసుకుపోయాడు కాని ఎక్కడ ఉంచడం. పక్కింటివాడు కుటుంబంతో తిరుపతి పోతూ ఇంటితాళాలు అతనికిచ్చాడు. మరే ఆలోచన లేకుండా నన్ను యింట్లో ప్రవేశపెట్టి, నా మైకం తగ్గడానికి చాలా సాధనాలు చేశాడు. తల కడిగాడు. బట్టలు మార్చాడు. అన్నీ అయిన తరువాత భోజనం తెచ్చిపెట్టాడు. ఆ రాత్రంతా నా దగ్గర కూర్చున్నాడు. నా పెట్లో రెండు బ్రాందీసీసాలున్నాయి. ఒకదాని మూత విప్పి, కొద్దిగా తాగడానికిచ్చాడు. తాగుడుకు అలవాటయిన వాడికి ఒక్కసారి ఆపేస్తే వాడు చాలా నరకయాతన అనుభవిస్తాడు. క్రమంగా మోతాదు తగ్గించి మనిషిలో ఆత్మవిశ్వాసం పెంపొందించాలి. ఈ విషయాలు సోములుకు తెలుసు. మరునాడు అతను లైను మీద వెళ్లవలసివచ్చింది. తన జాగాలో ఎవరిని నియమించాడో తెలుసా? "

తెలియదని తల ఊపాను.

"ఈ చిన్నారి చిలుకను నా సేవకు నియోగించాడు. ఈమె గురించి నీకు తెలుసా? "

"తెలీదు"

"ఈమెకు తొమ్మిదోయేటే పెళ్లయింది. పదోఏట భర్త చనిపోయాడు. మాలో మారు మనువులున్నాయి. ఈమెకు వయసొచ్చిన దగ్గిరనుంచి పడుచువాళ్లు వరుసలు వరుసలుగా వచ్చి పెళ్లాడతామన్నారు. కాని ఈమె ఎవరినీ అంగీకరించలేదు. హైస్కూలు చదువులు పూర్తిచేసింది. అటు తరువాత పుస్తకాలు చదువుకుంటూ ఇంటిపట్టున ఉండి సోములు పెళ్లానికి సాయం చేసింది. నన్ను చూడడానికి వయసులో ఉన్న అమ్మాయిని నియోగించి సోములు వెళ్ళిపోయాడు"

వెంకటలక్ష్మి చాలా శ్రద్ధగా వింటున్నది.

"చాలా రొమాంటిక్‌గా ఉంది" అన్నాను నేను.

"మరునాడు ఉదయం ఈ అమ్మాయి టీ పట్టుకొని నా గదిలోకి ప్రవేశించింది. ఏదో తార పాలపుంతనుండి విడిపోయి, భువికి వచ్చినట్లనిపించింది. అప్పుడామె ఏమందో తెలుసా? "తాగుబోతు వాడి కళ్లకు అందరూ పశువుల్లా కనిపిస్తారు. లేకపోతే అలా వెర్రిగా చూస్తావెందుకు? " అంది. ఈ అమ్మాయితో వేగడం కష్టమనిపించింది. ఆమె అటు తరువాత అంది. "నువ్వు పిచ్చి పిచ్చివేషాలు వేస్తే ఈ టీ నీ ముఖంమీద పారబోసి నేను వెళ్లిపోతాను. బుద్ధిగా ఉంటే, ఈ గది ఊడ్చి మంచంమీద పక్క సర్ది నీకు స్నానానికి నీళ్లిచ్చి, మిగిలిన పనులు చేస్తాను"

"ఇంతకీ నువ్వెవరివో చెప్పకుండా అధి

కారం చెలాయిస్తున్నావు"

"నా పేరు వెంకటలక్ష్మి. సోములు చెల్లెల్ని"

"నీకు మైనారిటీ తీరిందా? "

"తాగుబోతుకి చూపులు మందగిస్తా యంటే నేను నమ్మలేదు. ఇప్పుడు నమ్మక తప్పలేదు. నీ కళ్లకి నేను ఎన్నేళ్లదానిగా కనిపిస్తున్నాను? "

"పదహారేళ్లదానిలా ఉన్నావు"

"పదహారేళ్ల పిల్లకు పాతికేళ్ల మనిషికి నీకు తేడా తెలీదా? "

నేను లేచి ఎగిరి గంతేశాను.

ఆమె చెప్పినట్లే బుద్ధిగా విన్నాను. వినక పోతే ఆమె తన్ని చెప్పితీరుతుంది.

ఆమె గది చాలా శుభ్రంగా తీర్చింది. స్నానం అయి, నేను బట్టలు మార్చుకున్న తరువాయి, టిఫిను, కాఫీ తెచ్చింది. అన్నీ అయిన తరువాత నా పెట్టెలో బ్రాందీసీసా తీసి మూడు చెమ్చాలు ఒక గ్లాసులోపోసి నీళ్లు కలిపి మందులా ఇచ్చింది.

"నిన్ను చూస్తుంటే మత్తుగా ఉంది. మరీ బ్రాందీ దిగదుడుపు దేనికి? "

"ఇలా రెండురోజులివ్వకపోతే నువ్వు బాధపడి చస్తావని మా అన్న మరీ మరీ చెప్పాడు"

"నువ్వు చూస్తున్నావుకదా ఈమెను. అందచందాలకు తీసిపోని ఆమె మాటలు వింటుంటే నాకు బతుకుమీద మళ్లా ఆశ కలిగింది.

"అన్నిటికన్నా అధికంగా ఈమెమీద కోరిక కలిగింది. నా బాహువులలో ఈ కాంచన కన్యను బంధించి ఆమె కపోలాల మీద గులాబులను లాలనగా చుంబించా లని మనసు కలిగింది. మంచిగా చెప్తే ఈ పెంకి ఘటం వింటుందా?

నాలుగోరోజయ్యేసరికి కోరికను అణచుకో లేకపోయాను.

ఆ రాత్రంతా నాకు నిద్రలేదు.

కొద్దికొద్దిగా గంట గంటకు బ్రాందీ తాగు తూనే ఉన్నాను. నా కోరికను బలపరచడా నికి మోతాదుగా తీసుకున్నాను. తప్పతాగి తెలివి తప్పి పడిపోతే ఇంకా ఆమెనుండి దూరమవుతాను.

"మరునాడు ఉదయం ఆమె మామూ లుగా గది ఊడ్చడానికి, స్నానానికి నీళ్లు కాచడానికి వచ్చింది. ఆమె పెరట్లోకి వెళ్ల గానే వీధి తలుపులువేసి గడియపెట్టాను. పెరటిలో ఆమె వంగి పొయ్యి సిద్ధం చేస్తూ ఉంటే వెనుకపాటుగా ఆమెను చేతులలో బంధించాను. ఆమె తాచులా లేచింది. నన్ను విదిలించుకుంది. ఆమె చీరపట్టుకు లాగాను. చింపి పేలికలు చేశాను. రవిక ముక్కలు ముక్కలు చేశాను. ఆమె నా ముఖంమీద గోళ్లతో చీరితే నెత్తుర్లు కారాయి. ఆమె నిరోధించిన కొలదీ నాలో బలం హెచ్చయి ఆమెను ఆక్రమించుకోడా నికి ప్రయత్నం చేశాను.

ఆమె చివరిసారి నన్ను తోసి గట్టిగా అరి చింది.

"పశువా! ఆగు! నువ్వు ఆకలిగొన్న సింహంలా రెచ్చిపోతున్నా ఇంతవరకూ సహించాను. నువ్వు బహుశా మానభంగం చెయ్యడానికి ముందుకురుకుతున్నావు. నువ్వాపనికి సాహసించి తాత్కాలికంగా నన్ను పొందవచ్చు కాని నీ ఎదుటే నేను ఉరిపోసుకొని చచ్చిపోతాను"

ఈ మాట నాకు ఫిరంగి గుండులా తగి లింది

ఆమెకు ఆరడుగుల దూరంలో కూర్చు న్నాను.

"నా ప్రాణాధికమయిన తొలి ప్రియురాలు ఉరిపోసుకొని చనిపోయింది. ఈమెను బల

వంతంగా చంపడానికి నా కరచరణాలు ఆడలేదు.

ఆమె నావేపే చూసింది.

"నిన్ను చూస్తే జాలివేస్తుంది. నేను లేక పోతే బతకలేనని నీ వాలకమే చెప్తుంది. నిన్ను నేను ఎలా పెళ్లాడగలను? తాగుబో తును పెళ్లాడడంకన్నా మరణమే మేలని నేను నిశ్చయించుకున్నాను. దీనికి ఎదురు తిరగలేను"

నేను ఆమె ముఖంలోకి చూశాను.

ఎవరో దేవత అలిగి నా ఎదుట సాక్షాత్క రించినట్లు నాకనిపించింది.

"నేనొక్క విషయం చెప్తున్నాను. ఈ రెండు రోజులు నువ్వు చాలా మోతాదుగా తాగావు. బహుశా నేను నీ ఎదుట ఉంటే తాగుడు మానగలవు. నేనొక షరతు విధి స్తున్నాను. నేను నీ ఎదుట ఉంటే తాగుడు మానగలవా? నిన్ను ఈ పాడు అలవాటు నుండి ఉద్ధరించడానికి ఉత్తమ మార్గం మరొకటి కనిపించడంలేదు. ఒక నెల్లాళ్లలో నువ్వు సరియైన దారికి మళ్లితే, నీతోనే నా జీవితమంతా ఉండిపోతాను"

నేను లేచి నిలుచున్నాను.

"నేను ప్రమాణం చెయ్యను. తాగుబోతు చేసిన శపథాలు నిలవవు. నీవంటి ఉత్తము రాలు నన్ను విడిచి వెళ్లిపోడంతో నేనీ వ్యస నానికి బానిసనయ్యాను. నన్ను దీనినుండి తప్పించుకునే దారి చూపు"

"నేనీ స్థితిలో మా అన్న ఇంటికి పోలేను. నువ్వే వెళ్లు. మా అన్న నాలుగయిదు రోజు లవరకు ఇంటికి రాడు. మా వదినతో జరి గినదంతా చెప్పు. నాకో చీరా, రవికా అడిగి తీసుకురా. నన్ను లేవదీసుకొని పోతున్నా నని చెప్పు. మైనార్టీ తీరిన దానిని ఎత్తుకు పోతే ఎటువంటి కోర్టు సహాయం చెయ్యలే దని చెప్పు"

"ఈ మాటలన్నీ సోములు పెళ్లానికి చెప్పాను. ఆమె నా ఎంకి నుదుట కళ్యాణం బొట్టు పెట్టింది. కొత్తచీర కట్టించింది. కొత్త రవిక తొడిగింది. ఆశీర్వదించి నా వెంట పంపించింది"

అతను సంభాషణ ముగించి వెంకట లక్ష్మి భుజంమీద చేయివేశాడు.

"నాకు చాలా ఆనందంగా ఉంది. ఈమె ఎంత ధైర్యంగా ఎంత నిజాయితీగా ఒక పతితుడిని ఉద్ధరించింది" నవ్వుతూ అన్నాను.

"ఇప్పటికీ ఈమె మీతో లేచి వచ్చినట్లేనా, లేకపోతే మెడలో తాళికట్టారా?"

"ఇన్నేళ్లు ఈమె నాతో ఆవిధంగానే కాలం గడిపింది. నన్ను చూస్తున్నావుకదా! జీవచ్ఛ వంగా మారిన నన్ను ఈ స్థితికి తెచ్చింది. బీడుపడ్డ నా హృదయ క్షేత్రంపైన ప్రేమా మృతం వర్షించింది. నాతో వచ్చిన దగ్గిర నుండి నేటివరకు కంటికి రెప్పలా కాపాడు తోంది"

"అంతా చెప్పారు, తాళి సంగతి వెనక్కు బెట్టారా?"

"ఆ సంగతే చెప్తున్నాను. నేను పదిహేను రోజులు సెలవు పెట్టాను. రేపు శ్రీకాకుళం రిజిస్ట్రారు ఆఫీసులో ఈమెను వివాహమాడు తున్నట్లు ప్రమాణం చేస్తున్నాను. తరువాత గుడిలో దండలు మార్చుకోవడం, దేవుడి ఎదుట తాళికట్టడం, ఇంతవరకూ హనీ మూన్ జరుపుకున్నాం. ఇక మీద పుణ్యక్షే త్రాలకు వెళ్లివస్తాం"

"శర్మగారూ! నాదో కోరిక. మీరుకూడా మాతో శ్రీకాకుళం వచ్చి మా వివాహ పత్రా లమీద సాక్షిసంతకం చెయ్యాలి. అది మన కుటుంబాల మధ్య నుండే సంబంధానికి చిరకాలం నిలిచే గురుతు" అంది వెంకట లక్ష్మి.

రాజగోపాలం నాయుడుగారు పిలిచినా వెళ్లవలసిన వాడినే అటు వంటిది నాయుడు బావ ప్రియురాలు ఎంకి

పిలుస్తుంటే ఏ మనిషి నిరాకరించగలడు?

నేను ఇల్లు చేరుకునేసరికి రెండు రోజులు ఆలస్యమయింది. నాకోసం ఎదురు తెన్నులు చూస్తున్న నా భార్యకు జరిగిన సంగతంతా చెప్పాను. ఆవిడ సంతోషానికి అవధులులేవు.

యథాప్రకారం ఉద్యోగం నా ప్రవర్తనలో మార్పు కలిగినట్లు నాకే అనుమానం వేసింది. నాకిప్పుడు ఉద్యోగులు శత్రువులు కారు, అందరూ కావలసినవాళ్ళే.

సెక్షన్‌లో ఒక స్టేషనుకి ఇనస్పెక్షన్‌కి వెళ్లాను. అక్కడ రామమూర్తిగారన్న స్టేషను మాస్టరు పనిచేస్తున్నారు. మాటల సందర్భంలో అతనో సంగతి చెప్పారు. మామగారు ఉద్యోగం విడిచి పరారయిన ప్పుడు, ఈయన కూడా అతనితో పనిచే శారు.

భోజనమైన తరువాత వెయిటింగ్ రూములో విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు ఈ ప్రసక్తి వచ్చింది.

"రామమూర్తిగారూ! మామగారి జీవి తంలో తెలుసుకోలేని మిస్సింగ్‌లింక్ ఒకటి ఉండిపోయింది. దాన్ని గురించి అతను నా భార్యక్కూడా చెప్పలేదు. అతను ఉద్యోగం విడిచి పరారయారు. ఆ సంగతి మీకు తెలు సనుకుంటాను? "

రామమూర్తి ఆలోచించి నిదానంగా చెప్పడం మొదలుపెట్టారు.

"మీ మామగారి మొదటి భార్య గురించి మీకు తెలుసనుకుంటాను"

"మా అత్తగారు రెండవ భార్య అన్న సంగతి తప్ప మొదట ఆమె గురించి నాకు తెలియదు"

"మీ మామగారు చాలా చదువుకున్న మనిషి. సంగీతమన్నా, సాహిత్యమన్నా, చిత్రలేఖనమన్నా అతను ఒళ్లెరుగడు. ఉద్యో గంలో చేరిన ఆరు నెలలకే అతనికి వివాహ మయింది. అతని భార్య సాక్షాత్తు సరస్వతీ దేవి. అంతటి చక్కదనం మీరెక్కడా చూసి ఉండరు. సంగీత సాహిత్యాలు ఆమెకు వెన్నతో పెట్టిన విద్యలు. అంతేకాకుండా ఆమె చాలా చక్కగా బొమ్మలు వేసేది. వాళ్లిద్దరి అభిరుచులు ఒకటయాయి. ఉత్త మమైన సాహిత్య గ్రంధాలను కొనడం, రమ ణీయమైన వర్ణ చిత్రాలను సమకూర్చుకో వడం, అతని హాబీ అయింది. ఏ జమీం దారుకో ఇటువంటి సరదాలుంటే సత్ఫలితా లనిస్తాయి. సామాన్యుడికుంటే ఏం ప్రయో జనం? అతను చింకి బట్టలు వేసుకొని కాలం గడిపాడు. కాని పుస్తకాలు కొనడం మానలేదు. రెండు సంవత్సరాలు ఈవి ధంగా ఆ దంపతులు ఆర్థికంగా ఇబ్బం దులు పడ్డారు. రాజగోపాలం నాయుడు ఆ వూరికి ఉద్యోగం మీద రావడంతో ఈ ఇబ్బందులన్నీ తొలగిపోయాయి. పేరుకే అతను తన ఇంట్లో ఉండేవాడు. వాళ్లతోనే భోజనం చేసేవాడు. కబుర్లాడేవాడు. పాటలు వినేవాడు. మీ మామగారికి కావల సిన పుస్తకాలు, వర్ణ చిత్రాలు నాయుడే కొనే వాడు. విశ్వవిఖ్యాతులైన రూబెన్సు మొద లైన చిత్రకారుల ఆల్బమ్‌లు, రవివర్మ చిత్రాలు, అరుదుగా లభించే ఉత్తమ సాహిత్య గ్రంధాలు మీ మామగారు సేకరిం చారు. చక్కని అలమరాలలో వాటిని భద్ర పరిచారు"

అతను ఒక క్షణం ఆగి మళ్లా చెప్పడం మొదలుపెట్టాడు.

"జీవితమొక మధురస్వప్నంవలె వాళ్లు అయిదేళ్లు గడిపారు. ఆమె పేరు కాత్యా యని. ఆమె శరీర సౌందర్యం ఎంత రమ్య మైనదో ఆమె అంతః సౌందర్యం అంత దివ్యమయింది. తన పని కూడా మానుకొని ఇతరులకు సహాయం చేసే స్వభావమా మెది.

లోకంలో ఎవరు బాగున్నా కాలం కన్ను



కుట్టుకుంటుంది. ఆమె మంచితనాన్ని, అతని సాధు స్వభావాన్ని చాలామంది వినియోగించుకున్నారు. అక్కడికి రెండు స్టేషన్ల ముందున్న దానిలో ఒక ప్రబుద్ధుడు పని చేస్తూ ఉండేవాడు. వాడి పెళ్లానికి ఆకస్మికంగా తీవ్రమైన జ్వరం వచ్చింది. వాడికి కావలసిన వాళ్లెవరూ లేకపోవడంతో ఈ దంపతులను వాడు బతిమాలి తనతో తీసుకుపోయాడు.

"ఆ కాలంలో మశూచి ఇంకా ఉంది. వీళ్లు వెళ్లిన ఇంట అది కనబడింది. కాదనలేక మానలేక వీళ్లిద్దరూ రోగికి బాగానయమయి, నీళ్లు పోసేదాకా అక్కడే ఉండివచ్చారు.

"ఆ దౌర్భాగ్యుడు మంచి మాటలు చెప్పి కాత్యాయని చేత రోగికి అన్ని సపర్యలు చేయించాడు. నోరూ వావీ లేకుండా రాత్రుళ్లూ పగళ్లూ విశ్రాంతి లేకుండా ఆమె సేవచేసింది. ఆమెకి అక్కడే జ్వరం వచ్చింది. దానితో ఆమె ఇంటికి తిరిగి వచ్చింది.





"ఈలోకం తిన్ననైనది కాదు. కాత్యాయనికి జ్వరంగా ఉందని చూడడానికి వచ్చిన వాళ్లు భయంతో ఇళ్లకు పారిపోయారు. ఆమెను చూడడానికి వచ్చిన వాళ్లలో కొంత మందికి ఆ వ్యాధి సోకింది.

"స్టేషను పరివారమంతా కట్టుకట్టి మీ మామగారి ఇంటికి రావడం మానేశారు. పనిమనిషి రాలేదు. చాకలి తిరిగి చూడలేదు. దుకాణం వాడు సరుకులివ్వడానికి నిరాకరించాడు.

"రాజగోపాలం నాయుడు పేరు మోసిన తాగుబోతు. మీ మామగారి ఇంట్లో కలిగిన ఈ ఉపద్రవానికి అతను తట్టుకోలేకపోయాడు. మీ మామగారు సెలవు పెట్టినా పైవూరినుంచి ఎవడూ పని చెయ్యడానికి రాలేదు. అన్నివిధాల దిగ్బంధం జరిగినప్పుడు నాయుడు వెనుకంజవెయ్యలేదు. అటు స్నేహితుడి జాగాలో పనిచేస్తూ అతనికి సహాయం చేస్తూ ఉండిపోయాడు. రోగి దగ్గిర ధైర్యంగా కూర్చోడానికి తాగమని స్నేహితుడు సలహాయిచ్చినా నాయుడు మాత్రం అటువంటి తప్పు పని చెయ్యలేదు.

"ఉన్నట్లుండి ఒకరోజు ఆకాశం మబ్బుపట్టింది. క్రమంగా వర్షం మొదలయింది. ఆ వర్షం విడువకుండా కురిసింది. దానికి గాలి కూడా తోడయింది. చివరకది గాలివానగా మారింది. ఆ గాలివాననాటి మధ్యాహ్నం రోగి కళ్లు మూసింది.

"ఊరంతా కట్టకట్టి వాళ్లను బహిష్కరించింది. స్నేహితులిద్దరు బహుప్రయాసలకులోనై జరుపవలసినది జరిపించారు.

"తిరిగి వచ్చినప్పుడు రాజగోపాలనాయుడు మాత్రమే వచ్చాడు. అప్పటికే ఊళ్లో వాళ్లు గణాచారి దగ్గరికిపోవడం, ఆమెకు పూనకం రావడం, ఆమె ఆజ్ఞలు జారీ చెయ్యడం జరిగింది.

"అప్పుడు గుర్తు వచ్చింది నాయుడికి, మీ మామగారు ఇంటికి తిరిగి రాలేదని. అతను వెంటనే కొండవేపు పరుగెత్తాడు. మీ మామగారిని ఆత్మహత్యనుండి రక్షించాడు.

"ఆసరికి ఊరి ప్రజలందరూ మీ మామగారి ఇంటిమీదదాడి చేశారు. బీరువాలు పగులగొట్టారు. తంబురాలు విరుగగొట్టారు. పుస్తకాలు చింపి గుట్టలుగా పడేశారు. తైలవర్ణ చిత్రాలను నామరూపాలు లేకుండా చేశారు. వాటన్నిటిమీద పెట్రోలు పోసి నిప్పంటించారు.

"అప్పుడు భగవంతుడు ఒక గూడ్సు రైలు పంపించాడు. అందులో మీ మామగారు పరారయ్యారు"

"బహుశా దీనితో అంటురోగం తగ్గిపోయిందనుకుంటాను" అన్నాను నేను.

"గాలివాన చేత బహుశా తగ్గిందనుకుంటాను. కాని ఒక సంగతి మాత్రం ఇప్పటికి కూడా నాకు అంతుబట్టకుండా ఉండిపోయింది"

"ఏమిటది? "

"ఒక అయిదు సంవత్సరాలు ఆ వూళ్లో పంటలు పండలేదు. సకాలంలో వానలు కురవలేదు. చాల ప్రయాసతో పండించిన పంటలు వరదల్లో కొట్టుకుపోయాయి. ప్రజలలో కళాకాంతీ కొరవయ్యాయి. మంచివాళ్లను అనాలోచితంగా హింసిస్తే ఇటువంటి పరిణామాలే కలుగుతాయి"

నాకు ఏమనాలో తెలియలేదు.

"ఈ విషయాలు మామగారు ఎవర్నికైనా చెప్పవచ్చుకదా"

"ఆ మహాదుఃఖాన్ని గరళకంఠుడిలా అతను హృదయంలోనే దాచుకున్నాడు. విన్నవాళ్లకు కూడా ఇది దుఃఖం కలిగించక మానదు. అందరినీ తన బాధలతో ఇబ్బంది పెట్టలేక అతను ఆ విషయం బయటపెట్టలేదు"

కన్నకూతురికి కూడా అతను అందుచేతనే

చెప్పలేదని అనిపించింది.

జీవితంలో ఇన్ని పరీక్షలకు గురయి అతను జీవించి ఉన్నారంటే ఆశ్చర్యమే కలిగిస్తుంది.

నేను నా భార్యకు ఈ విషయం చెప్పలేకపోయాను.

రోజులు గడుస్తున్నాయి. ఒకరోజు టపాలో ఆడిట్ రిపోర్టు వచ్చింది. ఆరు నెలలక్రితం మా ఆఫీసుకు ఆడిట్ బృందం వచ్చి ఇన్‌స్పెక్షన్ చేసింది. ఆ రిపోర్టు చూడగానే నాకు ఆశ్చర్యం కలిగింది.

వేయి రూపాయలు విలువచేసే ప్రభుత్వం ఫర్నిచరు కనిపించలేదు. దానిగురించి విచారణ జరిపి సదరు వస్తువులను కాని లేక వేయి రూపాయలనుకాని ప్రభుత్వానికి జమచేయవలసిందని అందులో ఉంది. మూడు నెలలలో విచారణ పూర్తి చేయవలసిందని ప్రత్యేకమైన సూచన వుంది.

నేను ఛార్జి తీసుకున్న తరువాత ఏ వస్తువూ పోలేదు. అంతకుముందు పోయి ఉండాలి. విచారణలేకుండానే రిటైరయిన ముందు ఇన్‌స్పెక్టరు మీద రాస్తే కేసు మాఫీ అవుతుంది.

రిపోర్టు నా ముందు పెట్టుకున్నాను.

ఏమిటి రాయాలని ప్రతిదినం ఆలోచించాను. మళ్లీ దానిని వెనక్కు పెట్టేవాడిని.

ఈవిధంగా రెండు నెలల మూడు వారాలు గతించిపోయాయి. సంగతి విచారించకుండా రిపోర్టు రాయడానికి మనస్కరించలేదు.

ముందు పనిచేసిన పెద్దమనిషి ప్రస్తుతం ఎక్కడున్నాడో నాకు సరిగా తెలియలేదు. అతను ఆముదాలవలసకు సమీపంలో ఏదో ఆశ్రమంలో ఉన్నారని మాత్రం విన్నాను. స్టేషనులో పదకొండు గంటలకు దిగాను. నాతోపాటు సోములుని కూడా తీసుకుపోయాను. స్టేషను మాస్టరు నడిగితే ఆశ్రమం గురించి చెప్పాడు. శ్రీకాకుళం వెళ్లే బస్సు ఎక్కితే మొదటి రెండు స్టాపులు విడిచి మూడో స్టాపులో దిగితే చాలు. అక్కడికి అరఫర్లాంగు దూరంలో ఆశ్రమముంది.

మేమిద్దరం ముందుగా హోటలులో భోజనం చేశాము. ఆశ్రమంలో మామగారిని కలిసి, ఫర్నిచరు గురించి అడిగి మర్నాడు రిపోర్టు రాయాలని అనుకున్నాను. నేను ఎందుకు ఆశ్రమానికి వెళ్తున్నానో సోములుకి చెప్పలేదు.

ఒంటిగంటకో బస్సు బయలుదేరితే దానిలో ఎక్కాము. మొదటి స్టాపు గడచిపోయింది. రెండో స్టాపులో ఎవరో వయసు ఉన్న ఆమె ఎక్కింది. ఆమె చాలా చక్కగా ఉంది. తెల్లని ఖద్దరు చీర కట్టుకుంది. ఆమె చేతిలో ఒక కిట్ బాగ్ ఉంది. ఆమె కండక్టరుకు డబ్బులివ్వబోతే అతను ఆమెకు నమస్కారం చేసి అవి పుచ్చుకోలేదు.

ఆమె ఎవరు?

ఇంతలో మూడో స్టాపు దగ్గర బస్సు ఆగింది.

ఎవరినీ అడగకుండా ఇద్దరం బస్సు దిగిపోయాము.

ఎండాకాలం. రోడ్డుపక్కన చెట్లనీడల్లో నిలుచున్నాం. స్టేషను మాస్టరు చెప్పినట్లు ఏ ఆశ్రమం కనుచూపుమేరలో కనిపించలేదు. ఎడమవేపు కొద్ది దూరంలో ఒక ధాన్యపు మిల్లుంది.

దక్షిణం నుంచి చల్లని గాలి వీచింది.

ఇంతలో మరో బస్సు వచ్చి ఆగింది. దానినుంచి ఒకాయన దిగారు. అతను ఏభై యేళ్ల మనిషి. చేతివేళ్లకు విలువైన ఉంగరాలు ఉన్నాయి. సన్నని నూలుపంచకట్టుకున్నారు. పలుచగా ఉన్న చొక్కా తొడుక్కున్నారు. ఇస్త్రీ మడతలున్న వోణీ భుజాల

మీద వేసుకున్నారు. బస్సు వెళ్లిపోయిన తరువాత అతను నాలుగువేపులకు చూసి చెట్టు కింద నిలబడ్డ మా దగ్గిరికి వచ్చారు. నేను ఫంట్లాం వేసుకున్నాను. టీ షర్టు వేసుకున్నాను. విలువైన నా జోడుకున్న పాలిష్ నిగనిగలు నన్నొక గౌరవనీయుడిగా అతనికి పరిచయం చేసినట్లున్నాయి. అతనే నా దగ్గిరికి వచ్చారు.

"మీరు ఎవరికోసం చూస్తున్నారు? " అతను అడిగారు.

బహుశా అతనిని కలియడానికి మేము వచ్చామని అతను అనుకున్నట్లున్నారు.

"ఈ ప్రాంతాలలో ఒక ఆశ్రమముందని, మాకు కావలసిన అతను అందులో దొరుకుతారని స్టేషను మాస్టరు చెప్పారు. ఇక్కడ అటువంటిదేదీ కనుచూపుమేరలో కనపడడం లేదు" అన్నాను నేను.

అతను నన్ను కిందనుండి మీదకు మరో సారి చూశారు.

"మీకెవరు చెప్పారో! ఇది మాత్రం రెండో బస్‌స్టాపు" అన్నారతను.

"ఏదో పొరపాటు జరిగింది. ఒక చోట బస్సు ఆపి ఎవరినో ఎక్కించుకుంటే అది రెండో స్టాపు అనుకున్నాము. అక్కడ వయసులో ఉన్న ఒకావిడ ఎక్కారు. ఖద్దరు చీర కట్టుకున్నారు. కిట్‌బాగ్ ఒకటి ఆమె చేతిలో ఉంది. దాని తరువాత స్టాపులో దిగిపోయాం.

అతను నవ్వుకున్నారు.

"మీరు పొరబడ్డారు. ఆ ఖద్దరు చీర కట్టుకున్న ఆవిడ ఆశ్రమంలోని మనిషే. ఆమె వెంట వెళ్లినా మీరు సరిగా చేరుకునేవారు.

"ఇక్కడికి ఆశ్రమం ఎంత దూరముంటుంది? "

"మూడు మైళ్లు. ఇంతకీ మీరు రామదాసుగారిని చూడడానికేనా వెళ్తోంది? "

నాకీ రామదాసు ఎవరో తెలియదు. ఆశ్రమం పేరు కూడా సరిగా వినిపించుకోలేదు. నాకూ, ఈ ఆశ్రమవాసికీ సంబంధముందని లోకానికి తెలియకూడదు. అందు చేతనే వివరాలు సేకరించడానికి ప్రయత్నించలేదు.

ఆ పెద్దాయన మళ్లీ అన్నారు.

"మీరు బాగా ఎండబడినట్లున్నారు. ఇప్పుడు బస్సులు అంతగా దొరకవు. కొంచెం ఎండ తగ్గిన తరువాత వెళ్లవచ్చు ఆ రైసు మిల్లు మాదేను. దాని వెనుక చెట్ల మధ్యను విశ్రాంతి తీసుకోడానికి చిన్న బంగళా కట్టించాను. అక్కడ కొంచెంసేపు కూర్చొని, సేదదీరి మీరు వెళ్లవచ్చు"

నేను కాదనలేకపోయాను. ఎండలో ముఖం మాడి అక్కడికి పోవడంకంటే సావకాశంగా సాయంకాలం వెళ్లవచ్చుననుకున్నాను. ఇంతకూ నా పని పది నిమిషాల కన్నా హెచ్చుపట్టదు.

రైసుమిల్లు వెనుక ఉన్న తోటలో చిన్న బంగళా అన్ని సౌకర్యాలతోను ఉంది. అందులో ఒక విశాలమైన గదిలో పెద్ద ఫోము పరుపు, మంచి దుప్పట్లు, నాలుగు మేలు రకం కుర్చీలు, చిన్న టేబులు ఉన్నాయి.

ఆ మిల్లు యజమానిగారు లక్ష్మయ్యగారు. ఇద్దరు పనివాళ్లు వచ్చి గది తలుపులు తీశారు. ఆయన దగ్గిరనుండి చేతికర్ర తీసుకున్నారు. ఫాను వేశారు. అతను చొక్కా విప్పి కొక్కానికి తగిలించి, బాత్‌రూములోకి పోయి కాళ్లు కడుక్కొని వచ్చారు. నేను కూడా ఆ పనే చేశాను.

అతను తోటలోని కొబ్బరి బొండాలు తీయించారు. బొప్పాయిపళ్లు, మామిడిపళ్లు, సపోటాలు, అరటిపళ్లు తెప్పించారు.

నిజమైన ఫలాహారమది.

రమారమి రెండు గంటలయింది.

ఆయన సావకాశంగా మంచంమీద మేను వాల్చారు. కుర్చీ దగ్గరగా తీసుకోమని నాతో చెప్పారు. తరువాత అతనే మాట్లాడారు.

"మీరు ఏ ఆశ్రమానికి వెళ్లాలో తెలియదంటున్నారు. ఈ ప్రాంతాలలో మూడో బస్‌స్టాప్ దగ్గిర రామాశ్రమం తప్ప వేరొకటిలేదు. అందులో రామదాసుగారు, అతని శ్రీమతి నారాయణి, వాళ్ల అబ్బాయి రెండేళ్ల ఆనంద్ ఉన్నారు. ఇందులో మీకెవరు కావాలి? "

నాకీ పేర్లన్నీ కొత్తే. ఏదో ఎక్కడో పొరపాటు జరిగింది.

"ఇంతకీ ఆ రామదాసుగారి వయసెంత? ఇంకా ఏవేనా వివరాలు చెప్తారా? "

"రామదాసుగారి వయసు నలభై ఏడేళ్లు. అతను పొడవాటి మనిషి. ఛామనచాయ. నావలెనే ఖద్దరు బట్టలు కడతాడు. అతని భార్య నారాయణి. వయసులో ఇద్దరికీ పది పన్నెండేళ్లు తేడా కనిపిస్తుంది"

"ఈ ఆశ్రమం ఎన్నేళ్లనుంచి ఉంది? "

"ఈ ఆశ్రమ నిర్మాణమయి రెండు సంవత్సరాలే అయింది. అది కూడా రామదాసుగారికోసమే మా అన్నగారు రామయ్యనాయుడుగారు కట్టించారు"

"సాధారణంగా ఆశ్రమాలలో సాధువులుంటారు. మీ రామదాసుగారు అటువంటి దానిలో కాపురం పెట్టారే!"

"స్వభావతః అతను సాధువు. గృహస్థాశ్రమం పాలిస్తున్నారు"

"ఇతను చాలా వింతైన మనిషిలా ఉన్నారు. కొంచెం వివరంగా అతని గురించి చెప్తారా? "

"మీరీ ప్రాంతాలకు కొత్తవాళ్లుగా కనిపిస్తున్నారు. మా అన్న పేరు తెలియనివాళ్లు ఈ చుట్టుపట్ల లేరు. ఆయనకు ఎకరాలకొద్దీ పల్లపు భూములున్నాయి. ఇళ్లున్నాయి. అతను మా అన్నగారు. ఒకనాటి సాయంకాలం, రమారమి అయిదు గంటలవేళ, అతని దగ్గిరికి ఇద్దరు వచ్చారు. ఇద్దరూ ఎండలో బాగా వడలిపోయారు. కచేరీ సావడిలో మా అన్నగారు కూర్చున్నారు. వచ్చిన వారిలో మగతను మా అన్నగారికి నమస్కారం చేశాడు. ఆయన నిశితంగా అతని ముఖంలోకి చూసి కుర్చీలోంచి లేచి అన్నారు.

"పంతులూ! ఎన్నాళ్లకయ్యా! ఈ అమ్మడెవరు? మీ ముఖాలు చూస్తుంటే ఎప్పుడు తిన్నారో తెలియనట్లున్నాయి. ఈ బట్టలేమిటి? ఈ వేషమేమిటి? ఒరే వెంకడూ, ముందు అబ్బాయిగారికి, అమ్మాయిగారికి కాళ్లు కడుక్కోడానికి నీళ్లివ్వు. మంచినీళ్లు తాగడానికి తీసుకురా!"

"నేను కూడా అక్కడున్నాను. వాళ్లు కాళ్లు కడుక్కోడానికి పెరటిలోకి వెళ్లిన తరువాత మా అన్నగారిని వాళ్ల గురించి అడిగాను.

"లక్ష్మయ్యా! ఈ పంతులు తెలీదట్రా! ఏటిలో కొట్టుకుపోతుంటే నేను ఒడ్డుకు చేర్చానుకదరా! తరువాత నువ్వూ, నేనూ ఇతనిని విజయనగరం తీసుకెళ్లి వాళ్ల నాన్నగారికి అప్పగించి వచ్చాంకదా!" అన్నారు.

"ఆ మనిషి పన్నెండేళ్ల కుర్రాడప్పుడు వరదలోకొట్టుకు పోతుండగా మా అన్నగారు రక్షించారు.

"ఇంతలో వాళ్లిద్దరూ కాళ్లు కడుక్కొని వచ్చారు. పాలు తాగిన తరువాత అన్నగారు వాళ్లతో అన్నారు.

"మీరు బాగా అలిసిపోయారు. పెరట్లో నూతి దగ్గిర స్నానంచేసి వస్తే హాయిగా ఉంటుంది. పూజారికి కబురు పంపి మీకు రాత్రి భోజనానికి ఏర్పాటు చేస్తాను"

"ఆ వచ్చిన అతను సందేహిస్తూ నిలబడ్డాడు. మెల్లిగాఅన్నాడు.

"మాకు స్నానం చేసిన తరువాత మార్చు

కోడానికి బట్టలులేవు. కొనుక్కోడానికి చేతిలో చిల్లిగవ్వలేదు. మేము మీ ఆశ్రయం కోరి వచ్చాము"

"మా అన్నగారు లేచి, అతని భుజం మీద తట్టి అన్నారు.

"నేనుండగా మీకు లోటు దేనికి? ముందు స్నానం చేసిరండి. కొత్తబట్టలు కట్టుకోండి. తరువాత మీ గురించి చెప్ప వచ్చు"

"వాళ్లు స్నానాలు చేసి వచ్చారు. కొత్తబట్టలు కట్టుకున్నారు. అమ్మాయి నుదుట కుంకుమ దిద్దాడు వచ్చిన అతను. తరువాత ఇద్దరూ మా అన్నగారికి నమస్కారం చేశారు. ఆగంతకుడు కథ చెప్పడం మొదలుపెట్టాడు.

"అతను మూడు సంవత్సరాల కింద గాలివానలో చిక్కుకున్నాడు. గాలికి కొబ్బరిచెట్టు విరిగి అతని మీద పడింది. గ్రామంలోని మోతుబర్లు అతనికి వైద్యం చేయించారు. అతనికి మాట పోయింది. చెవులు వినపడలేదు. అతను పేరు కూడా మరచిపోయాడు. గత జీవితం గురించి గుర్తులేకుండాపోయింది. ఎక్కడినుంచి వచ్చాడో, ఎవరివాడో తెలియక పోతే అతనికో పేరు పెట్టారు. రామదాసుగా ఆ రోజునుండి అతను చలామణి అవుతున్నాడు. క్రమంగా కోలుకున్నాడు. తనకు ఆశ్రయమిచ్చిన అమ్మడు ప్రేమిస్తే కాదనలేదు. ఆమె లక్షలకు అధికారిణి. ఏమీ లేనివాడిని ఆమె ఎందుకు ప్రేమిస్తుంది?

"ఏదయితేనేం, ఇద్దరికిద్దరూ పూర్వ జీవితాలను విడిచిపెట్టి కొత్త జీవితాలు మొదలుపెట్టాలని బయలుదేరారు. ఈ మార్పు స్థిరపడేవరకు ఎవరేనా ఆదుకోవాలి. ఆలోచించగా మా అన్నగారికన్నా ఉదారస్వభావులు, వాళ్ల పరిస్థితులను అర్థం చేసుకునే వాళ్లు మరొకరు కనిపించలేదు. అందుకోసమే వాళ్లు తిన్నగా ఇక్కడికి వచ్చారు.

మా అన్నగారు అతను చెప్పినదంతా విని అన్నారు.

"రామదాసు! నువ్వు ఏవిధంగా గ్రామ ప్రజలకు సేవచేయదలచుకున్నావో ఆలోచించడానికి ఇంకా ఆరేడు నెలల వ్యవధి ఉంది. అమ్మడు నీళ్లుపోసుకుంది. ఆమె పురుడయేవరకు మీరు నాయింటే ఉంటారు. పూజారిగారు మీకు భోజనాలు సమకూరుస్తారు. ఈ ఆరు నెలలు నీ పథకం గురించి బాగా ఆలోచించవచ్చు"

ఆవిధంగా రామదాసు ఇక్కడ స్థిరపడ్డారు.

"అన్ని గ్రామాల ప్రజలకూ ఒకడే సేవ చేయడం జరగనిపని. ఏవో రెండు మూడు గ్రామాలలో అతని పథకం ఆచరణలో పెడితే చాలు. ఆ గ్రామాలకు అందుబాటులో ఉన్నచోట ఒక ఆశ్రమం నిర్మించి కాయకష్టంతో పనిచేయాలని రామదాసు, అమ్మడు నిశ్చయించుకొనడంవలన వాళ్లకు అటువంటి అవకాశాలు కల్పించాలి. అంతేకాక స్వయంశక్తితో సంపాదన జరిగితేనేకాని రామదాసుకి కావలసిన పుస్తకాలు, నిత్య సంసారానికి కావలసిన సామాన్లు లభించవు. విషయం కూడా గుర్తుంచుకోవలసినదే!

"ఈవిధంగా మా అన్నగారు, రామదాసు ఒక నెలపాటు చాలా పథకాలు పరిశీలించి చివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. ఈ ప్రాంతంలోనే మూడు గ్రామాలు ఎంచుకున్నారు. ఆ మూడింటికి అందుబాటులో ఉన్న రెండెకరాల స్థలం ఒకటి ఆశ్రమం కోసం ప్రత్యేకించారు. ఆశ్రమం పక్కనే మరో మూడెకరాల భూమి, స్వయం సంపాదనకు అనుకూలించేటట్లు కేటాయించారు. ఈ అయిదెకరాలు మా అన్నగారి భూమే అవడంచేత మరేమీ ఇబ్బంది లేకపోయింది.

"ఆశ్రమ నిర్మాణం పూర్తయేసరికి ఆరు నెలలయింది. మూడు గ్రామాలకు సమీపంలో ఆశ్రమం నెలకొంది. ఆసరికి నారాయణి పల్లెటూర్లోనే ప్రసవించింది. కొంచెం వయసు హెచ్చిన తరువాత ఆమె గర్భం ధరించడంచేత, ప్రసవం చాలా ఆందోళనకరమైన పరిస్థితులలో జరిగింది. శ్రీకాకుళం గవర్నమెంటు హాస్పిటలులో పురుడు పోసుకోవడానికి ఆమె అంగీకరించలేదు. అందరు గ్రామీణ స్త్రీలవలెనే ఇంటిపట్టున పురుడుపోసుకుంటానని భీష్మించింది.

"అప్పుడా దంపతులు ఒక నిర్ణయానికి వచ్చారు. నారాయణి శ్రీకాకుళం హాస్పిటల్లో మంత్రసాని కోర్సు పూర్తిచేసి గ్రామాలలోని స్త్రీలకు అందుబాటులో ఉండడానికి, కుటుంబ నియంత్రణకు సహాయపడాలని వాళ్లు నిర్ణయించారు.

"రామదాసు ఏం చేయాలి? మూడు గ్రామాలలోను ప్రభుత్వం నడుపుతున్న పాఠశాలలున్నాయి. అందుచేత ప్రాథమిక విద్య గురించి అతను ఆలోచించనక్కరలేదు. పెద్దవాళ్లలో అక్షరాస్యతకు లోటు లేదు. గ్రామాలలో పార్టీలు ఏర్పడి కక్షలు పెరుగుతున్నాయి. వాటిలో మామూలు ప్రజలు ఇరుక్కొని ఒకరికొకరు శత్రువులుగా మారుతున్నారు. దీనితో గ్రామ పారిశుధ్యం, త్రాగడానికి శుభ్రమైన మంచినీరు, రోడ్లు మొదలైన వాటిమీద దృష్టి ఉంచలేకపోతున్నారు. పార్టీలకన్నా ఇవి మనుగడకు ముఖ్యం. కాబట్టి పెద్దలకే చదువు చెప్పాలి. ఆ బాధ్యత రామదాసు తను తీసుకున్నారు"

లక్ష్మయ్యగారు చెప్పినది చాలా శ్రద్ధగా విన్నాను.

సోములు కూడా చాలా ఆసక్తితో వింటున్నాడు.

కొన్నికొన్ని అంశాలు ఈ రామదాసూ, మామగారూ ఒకరేనని రుజువు చేస్తున్నాయి. లక్షాధికారిణి అయిన నారాయణి ఎందుకితని వెంటబడింది? అది కూడా అన్నీ విడిచి!

"ఆశ్రమం ఎలా ఉంటుంది? " నేనడిగాను.

"ఒక లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని దానిని నిర్మించారు. ఆశ్రమంలో ఉండేవాళ్లు కావలసిన కాయగూరలు మొదలైనవి పండించుకోడానికి ముందు భాగంలో స్థలం విడిచిపెట్టారు. వెనుక భాగంలో ఆశ్రమం కట్టారు. మట్టిగోడలు, పైకప్పు చొప్పగడ్డి, అలికిన నేలలు అని ముందనుకున్నారు. మా అన్నగారు ఇటుక ఆవం పెట్టించారు అంతకు ముందు. అందులో మూడు వంతులు ఇటుక మిగిలిపోయింది. ఆ ఇటుకలు గోడలకు ఉపయోగించారు. మా అన్నగారు మట్టి నేలలకు ఒప్పుకోలేదు. పైకప్పు మాత్రం రామదాసు చెప్పినట్లే నేయించారు. పెద్ద కిటికీలు, విశాలమైన అరుగులు, పొడవూ, వెడల్పూ గల గదులు, స్నానానికి, శౌచానికి మంచి సదుపాయాలు, గాలి, వెలుతురు సమృద్ధిగా వచ్చేటట్లు, మా అన్నగారు శ్రద్ధ తీసుకున్నారు.

"ఆశ్రమ నిర్మాణంతోబాటు పెరటి తోటకు అన్ని సన్నాహాలు జరిగాయి. పెద్ద నూయి తవ్వించారు. నూతినీరు పెరటి తోటకు కాయగూరలు పండించే మూడెకరాలకు సమృద్ధిగా సరిపోతుంది. దానికి మోటారు పెట్టించారు.

"ఆశ్రమంలో రామదాసు దిగేసరికి అన్నీ అనుకున్న విధంగా అమరాయి. నారాయణి కొడుక్కి మూడు నెలలు వచ్చాయి. ఆనంద్ అని నామకరణం చేశారు. ఆవరణగేటుకి సమీపంలో పెద్దసాల వేశారు. ఇది గ్రామస్థులు గోష్ఠి జరుపుకునేచోటు.

"రామదాసు తన కాలాన్ని చక్కగా విభజించారు. ఉదయం తన పనులన్నీ పూర్తి

చేసుకొని, దత్తత తీసుకున్న మూడు గ్రామాలలో ఒకదానిలో పనిచేయడానికి వెళ్లారు"

నేను అతని మాటలకు అడ్డు వచ్చాను.

"అయ్యా! లక్ష్మయ్యగారు! ఈ మూడు గ్రామాలు రోడ్డుకు దగ్గిరగా ఉన్నాయి. పట్టణానికి కూడా అట్టే దూరంలో లేవు. వీటిలో మీ రామదాసు చేయడానికి ఏం పనులున్నాయి? "

"మీరన్న మాట నిజమే. అన్నీ ఉండడం వేరు. వాటిని ఒక పద్ధతిలో ఉంచడంవేరు. గ్రామాలవరకు రోడ్లు వేశారు. కాని అవన్నీ పాడుపడ్డాయి. వర్షాలకు పడ్డ గోతులను ఎవరూ కప్పలేదు. బళ్లు వాటిమీదే నడిచి అవి ఇంకా పాడుపడ్డాయి. ఆవిధంగా గ్రామంలోని కాలువలు, వాటినన్నిటినీ రోడ్డు మీదికే విడిచి పెట్టారు. ఆ కుళ్లు నీరు గుంటలుగా ఏర్పడి దోమలు గుడ్లుపెట్టి పెరగడానికి అనుకూలిస్తున్నాయి. ఎవరో ఒకరిద్దరి ఇళ్లు తప్ప మిగిలినవాళ్లవి కళ తప్పి ఉన్నాయి. పశువులను కట్టడానికి వీధులలో రాటలు పాతారు. విరిగిన పొణకలను పైన పారేశారు. కాబట్టి ఇవి మామూలు గ్రామాలు, ఆదర్శప్రాయంగా అందాలు సంతరించుకున్న గ్రామాలుకావు"

"ఇది ఏ ఒక్క రామదాసు వలన అవ్వవలసిన పనికాదు"

"అదే వేయిమంది మామూలు మనుషులకు ఒక రామదాసుకు ఉన్నతేడా! మామూలు మనుషులు తమ గురించే ఆలోచించుకోలేరు. ఇతరులమేలు గురించి ఏమాలోచించగలరు? ఎవరో నాయకుడు ముందుకొచ్చి "మీరిలా చేయాలి" అని ఉద్బోధిస్తే వాళ్లు అతనిని అనుసరిస్తారు"

"అంటే మీ రామదాసు లేబర్ లీడరుగానో, లేక రాజకీయ నాయకుడుగానో మారాడన్నమాట"



"మీరు చెప్పిన రెండు రకాల నాయకులకు స్వప్రయోజనాలున్నాయి. వాటి కోసం కొందరిని పైకి లేవనెత్తి, కొంతమందిని పాతాళానికి అణచివేస్తారు. కాని ఇతని దృష్టివేరు. ఏ రాజకీయాలకు సంబంధంలేనిది మానవత్వమే పునాదిగా ఉంది అతని ప్రయత్నం. ఇతనికి శత్రువులులేరు"

"కాని మామూలు మనుష్యుల మనస్సులలో ద్వేషం, ఈర్ష్య, స్వార్థపరత్వం ఉండనే ఉంటాయి"

"అవును.. ఇవి గ్రామ ప్రజలలో తక్కువపాళ్లలో ఉంటాయి. కాబట్టి అతను గ్రామాలనే ఎన్నుకున్నాడు. తన పథకం అమలు పరిచేముందు రోజూ అతను గ్రామవాసులను కలిసి వారితో సత్సంబంధాలు ఏర్పరచుకున్నాడు. వారితో అతను తన ప్లానుల గురించి మూడు గ్రామాలు సంచరిస్తూ, ప్రతి మనుష్యుడిని కలుస్తూ వాళ్ల ఇళ్ల గురించి, అలవాట్ల గురించి, బలహీనతల గురించి, అన్నిటి కన్నా హెచ్చుగా వాళ్లలోని మంచితనం గురించి లోతుగా అధ్యయనం చేశారు. పిమ్మట రంగంలోకి దిగారు"

"ఈ రామదాసు చాలా ఆశ్చర్యకరమైన వ్యక్తిగా కనిపిస్తున్నాడే!"

"అతను నూటికి నూరుపాళ్లు సామాన్యుడివలె కనిపిస్తారు. మొదటి తొమ్మిది నెలలూ అతను గ్రామ ప్రజలమధ్య తిరిగినప్పుడు ఎవ్వరూ అతని గురించి అట్టే పట్టించుకోలేదు. అందుచేత వాళ్ల గురించి అట్టే తెలుసుకోలేకపోయారు. కాని అతను చాలా మితభాషి. వినడమే అతని ధ్యేయం. వేయి కళ్లతో పరిశీలించారు. అప్పుడు అతనొక స్థూలమైన కార్యాచరణ మనసులో రూఢి చేసుకున్నారు"

"మామూలు మనిషిగా కనిపిస్తూ తన పని సులువు చేసుకున్నారన్నమాట"

"అతనిలో గొప్పదనమే అది. ఆశ్రమానికి "రామాశ్రమం" అని పేరుపెట్టారు. ఉదయం రామదాసు, భార్య, పిల్లాడు ఆశ్ర

మంలో ప్రవేశించారు. మా అన్నగారిని, నన్ను, మరో నలుగురిని పిలిచారు. ఆశ్రమ ప్రవేశమైన తరువాత సాయంకాలం కొంత మందిని మూడు గ్రామాలనుండి పిలిచారు. ముందు కట్టిన సాలలో అందరినీ కూర్చోబెట్టారు తుంగచాపలమీద. వడపప్పు, పానకం అందరికీ ఇచ్చారు. అందరూ కూర్చున్న తరువాత అతనో సంగతి వాళ్లతో ముచ్చటించారు.

"మీరందరూ నా మీద దయుంచి ఈ సాయంకాలం ఇక్కడికి వచ్చినందుకు చాలా సంతోషం. నేను పుస్తకాల పురుగును. ఏవేవో చదివాను. చాలా విషయాలు నన్ను ముగ్ధుడిని చేశాయి. ఈ ఆనందాన్ని నలుగురితో పంచుకుంటే అది ఇంకా అధికమవుతుంది. మీకన్నా ఆప్తులు నాకెవరున్నారు? నేను మీ అందరి మధ్య ఇవాళ నుండి నివాసమేర్పరచుకున్నాను. శ్రీరామయ్య నాయుడుగారు, శ్రీ. లక్ష్మయ్య నాయుడుగారు నాకు అన్నివిధాల సదుపాయాలు కల్పించి మీలో ఒకడిగా నన్ను తీర్చారు.

"రోజంతా మనం పనిపాట్లలో ఉంటాము. శరీరానికి విశ్రాంతి ఎంత అవసరమో, మనసుకు ఆనందం కలిగించడం కూడా అంత ముఖ్యమే. నాకు తెలిసిన మేరకు మీతో ఒక విషయం ముచ్చటిస్తాను.

"చాలాకాలం క్రిందట వందల సంవత్సరాలు కాదు. రెండు వేల సంవత్సరాల క్రింద మౌర్య చంద్రగుప్తుడు భారతదేశపు చక్రవర్తి. కొండలనుండి వరదలుగా పారే నీరు నష్టమయి పంటలకు అనుకూలించడం లేదని తెలుసుకున్నాడు. అతడు రైవతకపర్వతం నుండి, ఊర్జయత్ పర్వతంనుండి పారే కొండవాగులను నిర్బంధించి తటాకమొకటి నిర్మించాడు. ఈ మహా తటాకం కొన్ని వేల ఎకరాలలో పంటలకు సాయపడింది. దీనికి అశోక మహా చక్రవర్తి సమయంలో మరమ్మత్తులు జరిగాయి. అతను తటాకం నుంచి వచ్చే పంట కాలువలను బాగు చేయించడమే కాకుండా నీరు నిలువ అయి దుర్గంధం రాకుండా ఏర్పాటు చేయించాడు. ఇందులో రెండు సంగతులు మనకు తెలుస్తున్నాయి. చక్రవర్తి అనండి, ప్రభుత్వమనండి ప్రజల మనుగడకోసం, పంటలు పండించడానికి శ్రద్ధ తీసుకోవడం. అదీ రెండు వేల సంవత్సరాల క్రిందట గొప్ప సంగతి. ఈనాడు మనం నిర్మించిన నాగార్జునసాగర్ డామ్ మొదలైన వాటికి తీసిపోని సుదర్శన తటాకం ఆనాడే నిర్మించిన ఇంజనీర్ల కౌశలం మనం గర్వించదగిన విషయం.

"ప్రకృతికి, మనుష్యుడికీ నిరంతరం పోటీ ఉండనే ఉంటుంది. ప్రకృతి ఉన్నట్లుండి తన శక్తిని ప్రదర్శిస్తుంది. మనుష్యుడు వేసిన అంచనాలన్నీ తప్పని రుజువు చేస్తుంది. చంద్రగుప్తుడు నిర్మించినది, అశోకుడు బాగు చేయించినది అయిన ఈ సుదర్శన తటాకం కొన్ని సంవత్సరాల తరువాత తీవ్రమైన గాలివానకు దెబ్బతింది. గట్లు కొట్టుకుపోయాయి. నిలువ చేసిన నీరు వరదలై పారింది. అక్కడితో చేతులు ముడుచుకుని ఊరుకున్నారా? మళ్లా సుదర్శన తటాకాన్ని బాగుచేసి ప్రజలకు అంకితం చేశారు.

"రెండు వేల సంవత్సరాల కిందటి సంగతి మనకి ఎలా తెలిసిందని మీకు సందేహం రావచ్చు. వంద సంవత్సరాల క్రిందటి వరకూ ఇటువంటి వింతలు బయటపడలేదు. పురాతత్వ శాస్త్రజ్ఞులు తవ్వకాలు జరిపి శాసనాలలోని భాషను నేర్చుకున్న తరువాత ఇవన్నీ బయటపడ్డాయి.

"అప్పుడు రాజులూ, చక్రవర్తులూ ఉండేవారు. ఇప్పుడు ఆ జాగాలో ప్రభుత్వముంది. మౌలికంగా రాజులకైనా, ప్రభుత్వానికైనా ప్రజల క్షేమమే ముఖ్యం"

"ఈ సంగతి చెప్పిన ఆరు నెలల తరు

వాత, అతను ఒక గ్రామం చెరువుగట్లను కొంతమంది గ్రామ ప్రజల సహాయంతో బాగు చేసినప్పుడు వారికి ఆనాటి సంగతి అర్థమయింది"

నేను వింటున్నాను, ప్రశ్నలు వేయడానికి నాకు లక్ష్మయ్యగారు అవకాశం ఇవ్వలేదు.

అతను పనివాళ్లను పిలిచారు. కొబ్బరి బొండాలను కొట్టించి గ్లాసునిండా నీరునింపి ఇచ్చారు.

మళ్లా అతను చెప్పడం మొదలుపెట్టారు.

"ఈ రామదాసు, ఇలా మీరు చేయండని ఒకనాడు కూడా చెప్పలేదు. తాను చేసే వారు. అతను ఒక విషయంమీద సంభాష ణను కేంద్రీకరించి బోరుకొట్టించరు. వేదాల మీద, ఉపనిషత్తులమీద, సైన్సుమీద, గణిత శాస్త్రంమీద ఒకటేమిటి-అతని పరిధిలో లేని సబ్జెక్టు ఉండదనిపిస్తుంది.

"విషయం తెలియడం వేరు, దానిని తెలి



సేటట్లు చెప్పడంవేరు. అతని మాటలలో ఒక సమ్మోహనశక్తి ఉంది. మాధుర్య ముంది. నిజాయితీ ఉంది. అన్నిటికన్న ముఖ్యంగా ఆత్మీయత ఉంది. అతని గోష్ఠు లకు క్రమక్రమంగా ప్రజలు హెచ్చారు. వారానికి మూడు రోజులు అతను మాట్లా డుతారు. సాయంకాలం ఆరుగంటలకు మొదలుపెట్టితే, తొమ్మిది వరకూ ఉపన్యా సాలు సాగుతాయి. ఒకొక్కసారి కాలం సంగతి అతనూ, వినేవాళ్ళూ మరచిపో తారు"

"ఉపన్యాసాలిచ్చి జీవిక వెళ్ళబుచ్చుతున్నా రన్నమాట"

"మీరు పొరబడుతున్నారు. అతనూ, భార్యా పెరటితోటలో పనిచేస్తారు. ముగ్గురు పాలికాపులతో మూడెకరాల పొలంలోను కాయగూరలు పండించుతారు. పట్టణం దగ్గిరలో ఉండడంచేత గులాబులు, మల్లెలు, కనకాంబరాలు కూడా బుట్టలతో కోసి బజారుకు పంపుతారు. వాళ్ళ శ్రమకు మంచి ప్రతిఫలం లభిస్తుంది.

"మా అన్నగారు ఆశ్రమం కట్టించిన రెండెకరాలను రామదాసుగారికి గిఫ్ట్‌గా ఇచ్చారు. మిగిలిన మూడెకరాలు పాతిక సంవత్సరాలకు కౌలుకింద యిచ్చారు. అన్నీ సక్రమంగా జరిపించారు. ఇవన్నీ మీకెం దుకు చెప్తున్నానంటే, రామదాసుగారు మీర నుకున్న మనిషో కాదో నిర్ధారించుకోమని"

అన్నీ విన్నతరువాత కూడా నా అనుమా నాలు పూర్తిగా తీరలేదు. అప్పటికి అయిదు గంటలవస్తోంది. ఎండ తగ్గింది. మేమి ద్దరం లేచి లక్ష్మయ్యగారి దగ్గర సెలవు తీసుకొని రోడ్డువేపు నడవడం మొదలు పెట్టాం.

కొంచెం దూరం నడిచామో లేదో లక్ష్మయ్యగారి కేక వినిపించి ఆగిపోయాం. అతను మా దగ్గిరికి వచ్చి అన్నారు.

"రామదాసుగారు ఈరోజు కళింగపట్నం వెళ్తున్నట్లు కబురు పంపించారు. ఇవాళ సాయంకాలానికి తిరిగి రాలేనని, రేపు గోష్ఠికి అందరిని రమ్మన్నారు. ఈ సంగతి మీకు చెప్పడం మరచిపోయాను"

నేను ఎంత ప్రయత్నించినా నా విచారణ జరిపించే అవకాశాలు దూరమవుతున్నాయి. ఏదో నాకు తోచిన విధంగా రిపోర్టు రాసి పంపడమే మిగిలింది.

"లక్ష్మయ్యగారు! రామదాసుగారి గురించి మీరు చాలా ఆసక్తికరమైన విషయాలు చెప్పారు. అతను మేము కోరిన మనిషి అయినా కాకపోయినా, అందరికీ కావలసిన వాళ్ళుగా మీ మాటలవలన తెలుస్తోంది. మరేదో రోజు వచ్చి అతని దర్శనం చేసు కుంటాం. ప్రస్తుతానికి మావూరికి వెళ్ళిపోడా నికి సెలవియ్యండి"

అతను ఒకక్షణం ఆలోచించారు.

"శర్మగారు! మీరు ఎక్కడనుంచో వచ్చారు. రామదాసుగారు లేకపోతేనేం. అతని గృహిణి కూడా చాలామంచి మనిషి. అన్నిటికన్న ఆశ్రమం చూడదగినది"

మేము రాత్రి తొమ్మిదిగంటల బండిలో వెళ్ళాలి. అందుచేత సావకాశంగా వెళ్ళ వచ్చు కనీసం ఆశ్రమమైనా చూసిపోదా మని సోములంటే నేను కాదనలేకపో యాను.

మేమిద్దరం రోడ్డుపక్కన బస్సుకోసం ఒక పావుగంట నిలబడవలసి వచ్చింది. బస్సులో నేను చూసిన నారాయణి జ్ఞాపకం వచ్చింది.

ఆవిడ ఎంత చక్కగా ఉంది! కండక్టరుకు ఆమె డబ్బులిస్తూ ఎంత చక్కగా మాట్లా డింది. ఆవిడకు లక్షలున్నాయి. ఆ డబ్బు ఆమె ఏం చేసింది?

మాటల సందర్భంలో లక్ష్మయ్యగారు ఈ విషయం కూడా చెప్పారు. జ్ఞాతులకు,

తల్లికి కొంత డబ్బు ఇచ్చి, మిగిలినదంతా ఒక ధర్మ సంస్థకు దానంచేసింది. అన్నదమ్ములకి ఇవ్వవలసిన అవసరం లేదన్నది. సగం ఆస్తి ఆ సరికే ఆ పెద్దమనిషి స్వంతం చేసుకున్నాడు. అయినా ఆమె ఆ మాట పైకి అనలేదు.

ఎందుకీమెకు సంపదలమీద మనసుపోలేదు?

ఆమె దృష్టిలో రామదాసు నిర్ధనుడు. ఆమె ఆస్తి కూడా మొదటి భర్తకు సంబంధించినదే. కాబట్టి తాను చేబట్టిన రామదాసు అంతస్తుకి 'ఆవిడ కూడా దిగిపోయింది.

ఇంతలో బస్సు వచ్చింది. ఇద్దరం ఎక్కిపోయాం. పదిహేను నిమిషాలు కాకుండా మూడో స్టాపు దగ్గిర దిగిపోయాం.

లక్ష్మయ్యగారు చెప్పిన గుర్తులనుబట్టి చాలా సులువుగా రామాశ్రమాన్ని పోల్చుకున్నాం. బోర్డేదీలేదు. ఆశ్రమం చుట్టూ హెడ్జింగ్ ఉంది. గేటు తీసుకొని లోపలికి ప్రవేశించాం. నాలుగడుగుల వెడల్పున కాలి దారి ఉంది. కొద్దిదూరం వెళ్ళగానే కుడివేపు రామదాసుగారు గోష్ఠి జరిపేశాల ఉంది.

ఆ శాలలో అయిదు వందలమంది సులువుగా కూర్చోవచ్చు. లక్ష్మయ్యగారి మాటల ప్రకారం అందరూ నిండిపోగా కొంతమంది కదలకుండా నిలబడి వింటారు. పావు గంటా, అరగంటా? కాబట్టి ఈ రామదాసు మాటలు వినాలని అనిపించింది. అది దాటితే పూదోట కనిపించింది. అందులో మల్లెలు, గులాబులు విరబూచి కనిపిస్తున్నాయి. సన్నజాజి పందిర ఒకచోట ఉంది. సాయంకాలమయిందేమో వాతావరణం చల్లబడింది. అక్కడక్కడ వేసిన బొప్పాయి చెట్లకు బంగారు పళ్ళు వేలాడుతున్నాయి.

ఆశ్రమం పరమ రమణీయంగా ఉంది.

ప్రపంచంలోని బాధలకు, స్పర్ధలకు, ద్వేషాలకు అతీతమై పరమశాంతి అంతటా నిండింది.

నేను ఉపన్యాసశాల దాటి ఆశ్రమంవేపు వెళ్ళవలసిన వాడిని ఒక్కసారి ఆగిపోయాను.

మధురమైన సంగీతం వినవస్తోంది.

"వరవీణా మృదుపాణీ

వనరుహలోచను రాణి"

పెద్దవాళ్ళ కంఠమది. తంబురాశ్రుతి మందంగా వినిపిస్తోంది. అది ఎంత శ్రావ్యంగా ఉందో చెప్పలేం.

ఆమె గొంతును అనుసరిస్తూ కొంతమంది బాలికలు పాడుతున్నారు. అందరి గొంతులు ఒకటయి ఆ గానం దివ్యంగా తోచింది.

క్రమంగా సాహిత్యం అయింది.

అంతకుమించిన తియ్యదనంతో స్వరం వినవచ్చింది. బాలికలు వేసే తాళం స్పష్టంగా వినిపిస్తోంది.

సత్యం మనసును తాకుతుంది.

గానం హృదయాన్ని కదిలిస్తుంది.

సాహిత్యం ఊహాతీతమైన లోకాలకు చేర్చుతుంది.

ఈ రామదాసు, నారాయణి సత్యవ్రతులు.

సాహిత్యంలో అతను నిధి.

సంగీతంలో ఆమె సరస్వతి.

ఏ సంపదలు ఇవ్వలేని రసానుభూతిని వీళ్ళిద్దరూ సామాన్య గ్రామీణులకు పంచుతున్నారు.

లోకంలో ఆదర్శాలమీద ఉపన్యాసాలివ్వడం చాలామంది చేస్తారు. చెప్పిన దానిని ఆచరించే వాళ్ళు కోటికి ఒకరు కూడా ఉండరు. వీళ్ళిద్దరూ చెప్పినదానికన్న మిన్నగా ఆచరిస్తున్నారు.

నన్ను ఈ ట్రాన్స్‌నుండి సోములు లోకం

లోకి తెచ్చాడు.

"దొరగారు! మీరు వచ్చినట్లు అమ్మగారితో చెప్పివచ్చేదా? "

వద్దని తల ఊపాను.

సంగీతం అయిపోయే సూచనలు వినవచ్చాయి.

నేను వెనక్కు తిరిగాను. గేటువేపు నడిచాను. సోములు జాగ్రత్తగా గేటు మూసి నన్ను వెంబడించాడు.

సూర్యాస్తమయం ఎప్పుడో అయింది.

పడమటి వెలుగులు కూడా తగ్గిపోయాయి. గాలి, రావాకుల కదిలిస్తూ హాయిగా వీస్తోంది.

మేమిద్దరం రోడ్డుపక్కన నిలుచున్నాం.

శ్రీకాకుళంవైపు పోయే బస్సు ఆగి వెళ్ళిపోయింది.

మేము వెళ్ళవలసిన బస్సు ఎప్పుడొస్తుందో తెలియదు.

"దొరగారు! **ఇంతకీ** మనం ఇక్కడకి ఎందుకు **వచ్చినట్లు" అడిగాడు** సోములు.

నేను కొంచెంసేపు **ఆలోచించాను.** తరువాత అన్నాను.

"రమారమి మూడు నెలలకింద ఒక ఆడిట్ రిపోర్టు వచ్చింది. అందులో మన ఆఫీసు ఫర్నిచరు, వేయి రూపాయల విలువైనది, కనిపించలేదని రాసి ఉంది. దాని గురించి విచారణ చేసి, బాధ్యులను నిర్దేశించి, వారినుండి వేయి రూపాయలు వసూలుచేసి ప్రభుత్వానికి జమకట్టమని ఉంది. నేను ఛార్జీ తీసుకున్ననాడు ప్రత్యేకంగా ఆఫీసులోని ఫర్నిచరు వివరాలు రాసి సంతకం పెట్టాను. కాబట్టి ఇవి నాకు ముందు పనిచేసిన సీనియర్ ఇనస్పెక్టరుగారి హయాంలో పోయాయి. పోయిన వస్తువుల గురించి విచారణ చేయడానికి ఇక్కడికి వచ్చాను. కాని ఇక్కడున్న అతను రామదాసుగారు. అతనిని విచారించే హక్కు నాకెక్కడుంది? "

ఒక్క క్షణం సోములు మాట్లాడలేదు. పిమ్మట జేబులోంచి ఒక కవరు తీశాడు. మసక వెలుగులో కవరులోంచి నూరురూపాయల నోట్లు ఒక పది తీసి నా చేతిలో పెడుతూ అన్నాడు.

"దొరగారు! ఈ రామదాసుగారెవరో మీకు ఈ సరికి తెలిసే ఉండాలి. నా వంటి వాడికే అర్థమయితే మీ విషయంలో చెప్పనక్కరలేదు. ఇటు రామదాసుగారు, అటు విశాలాక్షి అమ్మగారు, తాము కోరిన దారులలో నడుస్తున్నారు. ఒకరి గురించి ఒకరు తెలుసుకోడానికి వారు ఆరాటపడడంలేదు. మీరు నారాయణిగారిని కూడా కలియలేదు. చాలా మంచి పనిచేశారు. విశాలాక్షమ్మగారికి కూడా ఈ విషయాలు చెప్పి ఆమె మనసు పాడుచేయకండి. బాబుగారు చెల్లించవలసిన వేయి రూపాయలు నేనిస్తున్నాను. ఇవాళే నా భార్య ట్రీట్‌మెంటుకోసం తీసుకున్న లోను అందింది"

నేనా సొమ్ము తీసుకోలేదు.

"సోములూ! నువ్వు మా మామగారి సహాయం ఒక్కసారి మాత్రమే పొంది జన్మ అంతా అతనికి కృతజ్ఞుడవుగా నిలిచావు. అన్నివిధాల తండ్రినేపోలి, నిత్యం ఎదురయే ప్రతిక్లిష్ట పరిస్థితిలో నాకు కుడి భుజంగా నిలిచి, నా సంసారాన్ని ధర్మపథం మీద నడిపిస్తున్న నా భార్యను, కాళ్ళు కడిగి ఆయన నాకు ప్రసాదించారు. అతని ఋణం ఎన్ని వేలిస్తే తీర్చుకోగలను! కనీసం ఈ వేయి రూపాయలైనా ఇవ్వనీ!"

గాలివాన వెలిసిన పిమ్మట కలిగే ప్రశాంతి నా హృదయాన్ని ఆక్రమించుకుంది. ★

ఈ నవల శ్రీ కూరెళ్ల సోమేశ్వరరావు గారికి అంకితం. —ఘండికోట బ్రహ్మాజీరావు

# ‘పెళ్లి’ పై సమీక్షలు

మే ‘చతుర’లో ప్రచురితమైన కోలపల్లి ఈశ్వర్ నవల ‘పెళ్ళి’పై
మా కందిన ఉత్తమ సమీక్షలు

## హాస్యపు మేళవింపు

**మే** నెల చతురలో ప్రచురితమైన కోలపల్లి ఈశ్వర్‌గారి ‘పెళ్లి’ వ్యక్తి జీవితంలో వివాహపు ఆవశ్యకతను తెలియజేస్తూనే ఇటీవలి కాలంలో కనుమరుగైపోతున్న ఉమ్మడికుటుంబ వ్యవస్థకు పునాదులైన ఆర్ద్రీత, మమకారం, ఆత్మీయతానుబంధాలను నొక్కి వక్కాణిస్తూ జ్ఞాపకానికి తెచ్చింది.

పెళ్లి చేసుకుంటున్నట్లుగా చినబాబు కలగనడంతో మొదలుపెట్టి, ఆ కల నిజమైనట్లుగా ముగిస్తూ. ఇతివృత్తాన్ని మలిచిన తీరు బాగున్నా అక్కడక్కడా కొన్ని సినిమాటిక్ సంభాషణలూ, నాటకీయతా ఎక్కువైనాయనిపించింది.

మేథకు వయస్సుతో సంబంధంలేదనే అబ్బిగాడి పాత్ర కథను మలుపులు తిప్పగలిగింది.

హరేరామ్, పారిజాతంల జంట పాత్రలు వర్తమాన సినీ హాస్యనటులను దృష్టిలో పెట్టుకుని సృష్టించినట్లున్నాయి. అయినా ఇతివృత్తం రక్తికట్టడంలో తోడ్పడేవిగానే ఉన్నాయి.

ఒక కప్పు కింద ఉంటూ అన్నల వివాహాలు కుటుంబ జీవితంలో తెచ్చిన మార్పులు గమనించి, వాటి ప్రభావం తనమీదపడి, పెళ్లాడితే ఎక్కడ తల్లిదండ్రులకు దూరమవుతానో అని భయపడి అసలు పెళ్లేవద్దన్న చినబాబుకు... తల్లీతండ్రీ, కూతురు-కొడుకు, బంధువులు... వీళ్లెవరూ జీవిత చరమాంకంలో మనకు ఆలంబనకారు మన కోసం కన్నీరుకార్చే, ఆకలి దప్పులు కనిపెట్టి ఉండే, అలసినవేళ సేదదీర్చే తోడుగా నేనుంటాననే ఓ స్త్రీమూర్తి అవసరం ఎంతైనా ఉందంటూ పురుషోత్తమరావుచే చెప్పించిన తీరు వాస్తవికంగా తోస్తుంది.

ఎంచుకున్నది సీరియస్ సబ్జెక్ట్ అయినా హాస్యపు మేళవింపుతో ఏవో కొన్ని కారణాల మీదట వివాహమాడరాదన్న ఆలోచన ఉన్న అనేకులలో అంతర్లీనంగా, వివాహపుటాలోచనను రేకెత్తించడంలో రచయిత కృతకృత్యులైనారనే చెప్పవచ్చు.

-బి.శ్రీనివాసరావు
గుంటూరు-522002

## ఫ్రూట్ సలాడ్

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

సాహిత్యంలో హాస్యం కరువైపోతున్న ఈ రోజుల్లో మండుటెండల్లో వర్షపు జల్లులా మే నెల చతురలో ‘పెళ్లి’ నవలను అందించినందుకు కృతజ్ఞతాభినందనలు

సీరియస్ సబ్జక్ట్‌ని తీసుకున్నా హాస్యాన్ని మేళవించగలిగారు రచయిత.

ఏ వెంచర్‌లోనైనా రిస్క్ ఎలిమెంట్ కాస్తోకూస్తో ఉంటుంది. అలాగే వివాహవ్యవస్థ కూడా పూర్తిగా కష్టనష్టాలకు అతీతంకాదు. అలాగని పూర్తిగా వ్యవస్థనే వద్దనుకోవటం కూర్చున్న కొమ్మనే నరుక్కోవటం లాంటిదే.

ఈ విషయం గురించే చెబుతూ చినబాబు బావ రఘు, "కాపురాల్లో కలతలకి భయపడి మనుషులంతా పెళ్లిళ్లు చేసుకో

వటం మానేస్తే ఇక ఈ ప్రపంచమే ఉండదు" అన్న మాటలు ఆలోచింపజేస్తాయి.

ఉమ్మడి కుటుంబం బాక్‌డ్రాప్‌గా బేస్ అయిన కథ గనుక ఉమ్మడి కుటుంబవ్యవస్థను సమర్థించక తప్పలేదు రచయితకు.

జాయింట్ ఫామిలీలో సర్దుకోలేని ఎంతో మంది జంటలు విడిగా న్యూక్లియర్ ఫామిలీలు ఏర్పరచుకుని జీవిస్తున్నారు ఈనాడు. కలసి ఉండి రోజూ కీచులాడుకునే బదులు దూరంగానే ఉండి తరచూ కలుసుకుంటూ ఉంటే ఆప్యాయతానురాగాలు పెరుగుతాయని పెద్దలూ సహకరిస్తున్నారందుకు.

కథలో ఈ పాయింట్‌ని కూడా టచ్ చేసుండాల్సింది. ఎందుకంటే అందరూ విరాజితలా సర్వం ఉమ్మడికుటుంబానికే త్యాగం చేసి మెషిన్లా అందరికీ సేవలు చెయ్యలేరు కదా?

రోజూ అర్ధ రాత్రప్పుడు విరాజిత 'ట్రాన్స్' లోకి వెళ్లి (నట్లు నటించి) చినబాబు డైరీలో రాయటం అసహజంగా అనిపించినా పాఠకుల్లో ఆసక్తి కలిగించింది.

ఏదేమైనా ఈ నవల చదివాక మిట్టమధ్యాహ్నం ఎర్రటి ఎండలో ఉసూరంటూ ఓ మైలుదూరం నడిచాక ఐస్‌క్రీం పార్లర్‌లో ఫ్రూట్‌సలాడ్ తిన్న అనుభూతి కలిగింది.

అందుకు చతురకూ, రచయితకూ మరో మారు ధన్యవాదాలు.

–కె.వి.కృష్ణారావు
నెల్లూరు

## కామెడీ సినిమా

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

మే నెల చతుర నవల 'పెళ్లి' ఓ కామెడీ సినిమా చూస్తున్న అనుభూతిని కలుగజేస్తూ సరదాగా సాగింది. ఆద్యంతమూ నవ్వుల జల్లులు కురిపిస్తూనే కథలో అంతర్లీనంగా ఉన్న సందేశం పాఠకులను ఆలోచింపచేస్తుంది. వివాహ వ్యవస్థ వలన కుటుంబాలు విడిపోకూడదని హీరో చినబాబు పడిన తపన బాగా చిత్రీకరించబడింది. కానీ అలా పెళ్లి వద్దని భీష్మించుకు కూర్చునే బదులు తన కుటుంబ సభ్యులతో ఐకమత్యం కోసం చినబాబు కనీసం ఒకటి రెండు ప్రయత్నాలైనా చేసినట్లు చూపి ఉంటే బాగుండేది. కాలుకు గాయమైతే కాలంతా నరికి వేసుకోంగదా! లోపం వివాహ వ్యవస్థలో కాదు, అతడి కుటుంబ సభ్యుల మనస్తత్వంలో ఉంది. అతడికి వివాహ వ్యవస్థమీద అంత ఘోరమైన విరక్తి కలుగడానికి కారణమైన అతడి అన్నావదినలు తమలో మార్పుకోసం ప్రయత్నించకుండా ఓ స్త్రీ పాత్రను అర్థాంతరంగా అతడి జీవితంలో ప్రవేశపెట్టడం, అతడి బ్రహ్మచర్య వ్రతం భంగం చేయమని ఆమెను కోరడం కొంత అసహజంగా ఉంది.

హీరోయిన్ విరాజిత జీవితం మొత్తం మొదటి నుండి చివరివరకు సినిమాటిగ్గా సాగింది. చినబాబుకు వివాహం మీద విరక్తి కలగడానికి కారణం అతడు తన మనసులో పెంచుకొన్న అపోహ. అంతేగానీ అతడేదో స్త్రీ ద్వేషి అయినట్లు, విరాజిత అర్ధరాత్రి అతడి గదిలోకి దొంగతనంగా ప్రవేశించి డైరీ రాయడం, ముద్దు పెట్టుకోవడం వంటి పనులద్వారా అతడిని లొంగదీసుకోవాలని చూడడం కథకు అనవసరమనిపించింది. కథలో అతిముఖ్యమైన అబ్బిగాడి పాత్ర రచయితే ఒప్పుకొన్నట్లు సినిమాలలోని ముదురు బాలనటుల పంథాలోనే సాగింది. మిగిలిన పాత్రలన్నీ కథను పొడిగించడానికి ఉపకరించాయే తప్ప వాటి గురించి ప్రత్యేకంగా చెప్పడానికేమీ లేదు. కథలో సస్పెన్స్

మాత్రం చివరివరకూ చక్కగా మెయిన్‌టెయిన్ చేయబడింది.

–జి.కృష్ణారావు
గుంటూరు- 522002

## పెళ్లికి నిర్వచనం

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'పెళ్లి' అనేది జీవితంలో ఎలా ముఖ్యమైనదీ, ఎంత ముఖ్యమైనదీ హరేరామ్, పురుషోత్తమరావు పాత్రలద్వారా చెప్పిస్తారు రచయిత. తన కుటుంబంలోనేకాదు ప్రతి కుటుంబంలోనూ పెళ్లితో రాకూడని మార్పులు వస్తాయని, వాటి నివారణకు పెళ్లి మానుకోవడమే ముఖ్యమని భావించే చినబాబు నిర్ణయం తప్పని నిరూపిస్తారు విరాజిత, హరేరామ్, పురుషోత్తమరావులు.

చివరికి చినబాబు నిర్ణయం మార్చడానికి కుటుంబ సభ్యులు మారడం, పండగలో అందరు కలవడం, ఒకరికి జ్వరం వస్తే అందరూ తల్లడిల్లడం అన్నీ సహజంగా ఉన్నాయి. భార్య అంటే ఏమిటి? పెళ్లి అంటే ఏమిటి? భార్య అవసరం ఎపుడు వస్తుంది? ఎందరున్నా చివరి సమయంలో భార్య అవసరం ప్రతి భర్తకు కావాలనే పురుషోత్తమరావు ఈ నవలకు ప్లస్‌పాయింట్. చివరికి అందరూ ఆశించినట్లు చినబాబు ఒక ఇంటివాడు కావడంతో పెళ్లి యొక్క పరమార్థానికి సరైన నిర్వచనం చెప్పిందీ నవల. భార్యాభర్తలన్నాక వంటపంచుకోవడంలో తప్పు లేదు. పెళ్లి అంటే జీవితాలు పంచుకోవడమేకాదు బాధ్యతలు పంచుకోవడమే పెళ్లి. అన్ని పాత్రలు మనల్ని సజీవంగా పలకరిస్తాయి కథలో. చతురలో వచ్చిన అన్ని మంచినవలల్లాగే ఇదీ ఒక మంచి నవల.

–యం. సుదర్శనాబాయి
మదనపల్లి- 517327

## నవ్వించిన నవల

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

పెళ్లికాని వారు పెళ్లి చేసుకోవాలనుకోవడం, పెళ్లిచేసుకున్నవారు ఆ సంసారబంధ చక్రం నుండి బయటపడాలనుకోవడం సహజం.

ఈ నవలా నాయకుడు చినబాబుకూడా తన ముగ్గురన్నదమ్ములూ తమ భార్యలతో ఎలా సర్దుకుపోవాలో తెలియక నిత్యం ఏదో గొడవలతో సతమతమవడం ప్రత్యక్షంగా చూసి తను ససేమిరా పెళ్లిచేసుకోకూడదని నిర్ణయించుకుని చివరికి పెళ్లి చేసుకోవడం పై ఉదాహరణకు తార్కాణం. పెళ్లైతే ఓ ఇంటివాడినవుతానేమోగానీ, ఉన్న ఇంటి నుండి (తల్లితండ్రులనుండి) దూరమవక తప్పదన్న సత్యాన్ని రచయిత సెలవివ్వడం నిజంగా ఫెంటాస్టిక్ అండ్ మార్వలెస్.

"మీ గుండెల్లో చీకటి పడిందని ఎవరో చెబితే దీపం వెలిగిద్దామని వచ్చాను. చీకటి కదా! కళ్లకేం కనపడక దీపం వెలిగించలేక పోగా నా చెయ్యి నేను కాల్చుకున్నా"నని డైరీలో రాసిన విరాజిత మాటలు ఆర్ద్రతను కలిగించాయి.

ముద్దుముద్దుగా మాట్లాడాల్సిన అబ్బిగాడు వాళ్ల బాబాయితో ముదురు మాటలు మాట్లాడినప్పటికీ అవి సందర్భోచితంగా అతికాయి. సాదాసీదా విషయాన్ని తీసుకుని ఎక్కడా విసుగనిపించకుండా చక్కగా కథ నడిపిన తీరు శ్లాఘనీయం.

మొత్తం మీద నవలల్లో నవ్వించిన నవలగా 'పెళ్లి' పాఠకుల హృదయాల్లో పదికాలాలపాటు చెరగని ముద్ర వేసిందనటం అతిశయోక్తి కాబోదు.

–నెట్టూరి లక్ష్మణరావు
పొదలకూరు-524345

# చతుర కతలు

## ఆసరా

మా వీధిలో ఓ 'గణేశు'ని విగ్రహం తవ్వ కాలలో బయటపడింది. సెంటిమెంటు ప్రకారం దానిని అలాగే వదలివేయకుండా 'గుడి' కట్టించాలని మా వీధి ప్రముఖు లంతా ఉబలాటపడ్డారు.

కాని అది చాలదు గనుక చందాలపర్వం మొదలయింది. గుడిగోడలమీద దాతల పేర్లు వేయిస్తాం.... అంటూ ఆశపెట్టాం. అయినా చాలామంది లొంగలేదు.

విసిగివేసారి... మా వీధిలోనే అప్పుడ ప్పుడూ వుంటూ ఎప్పుడూ హైదరాబాద్ లోనే వుండే "నాయకుడు"గార్ని కలిశాం. ఆయన మాటలు సి.యమ్. లెవల్ నుండి పి.యమ్. లెవల్ వరకు వుంటాయి. వాగ్దా



నాల పుట్ట. గుడికి ప్రారంభోత్సవానికి నన్నే పిలవండి... అన్నాడేగానీ చందా సంగతెత్త గానే డబ్బులేదు అంటూ దాటవేశాడు. ఆయన సంస్కారం మాకు తెలియనిది కాదు.

సరే అందరం కలిశాం.

గుడి నిర్మాణం సాగాలంటే మరి 'విత్తం' కావాలి కదా!... డబ్బువిషయం వచ్చేసరికి చాలామంది చేతులెత్తేశారు. బహుకొద్ది మంది మాత్రం చేతులు దించి జేబులో పెట్టి చాలా తక్కువ మొత్తంలో డబ్బు తీశాం.

ఆ తర్వాత పట్టువదలని విక్రమార్కు ళ్లాగ దానకర్ణులకోసం వెదికాం. అయినా పెద్దగా డబ్బు పోగవలేదు. అందరిని కాపాడే దేవుడికే యిన్ని ఆర్థిక కష్టాలు వుంటే.... మామూలు మనుష్యుల సంగతి

ఏమిటి అనిపించసాగింది. అయినా పని కొనసాగించాం.

...మరో పాతికవేలుంటే గుడినిర్మాణం పూర్తవుతుంది. ఎలా దొరుకుతాయి?

ఓ సాయంత్రంవేళ మా యింటిలోకూర్చుని తీక్షణంగా ఆలోచిస్తుంటే 'ఏమండీ!? ఎవరు లోపల? అని అరిచారెవరో బయటినుంచి.

"చేయి ఖాళీగా లేదు... పైకెళ్లిరా!? " అని మా ఆవిడ లోపల్నుంచి రిటార్టు యిచ్చింది.

"ఇప్పుడు 'డ్యూటీ'లో లేనమ్మా!? ... కాస్త మీ ఆయన్ని పిలువ్!? " అని మళ్ళీ అరిచాడతను.

ఈ స్టేట్‌మెంటేదో కొత్తగా అనిపించి బయటికి వచ్చాను.... ఎదురుగా ఓ సగటు భిక్షకుడు....

"ఏమిటీ!? " అన్నాను చిరాగ్గా...

"కాస్త మీతో మాట్లాడాలి? " అన్నాడు స్టయిల్‌గా.

"ఏమిటీ నువ్వు మాట్లాడేది? ..." చిర్రెత్తిపోయి అన్నాను.

"బిజినెస్"...అన్నాడు.

వంద బొచ్చెలుపెట్టి మాడున కొట్టినట్లయింది. నోరు తడారిపోయింది... వీడికి నాతో బిజినెస్ ఏమిటీ!?

"గుడి కట్టడానికి మరోపాతికవేలు కావాలి గదా!" అన్నాడతను.

"అవును"

"అవి నేనిస్తాను... కాకపోతే మీరు నాకో సాయం చెయ్యాలి"

"నువ్విస్తావా? ..." ఆశ్చర్యంగా అన్నాను.

"మొన్న యమ్.ఎల్.ఏ. గారు ఎలక్షన్లో నిలబడినప్పుడు లక్షలు పెట్టుబడి పెట్టింది నేనే...! అందుకే అడుక్కోవడానికి మొత్తం మెయిన్ రోడ్ నాకే యిచ్చాడు. అక్కడ యింకెవరూ బిచ్చమెత్తడానికి వీల్లేదన్నాడు...!"

"సరేగానీ... 'పాతికవేలు' నువ్విచ్చాక నేను నీకేం చెయ్యాలి!? ..." అనుమానంగా ప్రశ్నించాను.

"సింపుల్! ఆ గుడిదగ్గర యింకెవరూ బిచ్చమెత్తడానికి వీల్లేకుండా అది నా 'సోల్ ప్రాపర్టీ'గా రాసివ్వాలి!... యింకా...."

వాడు చెబ్తూనే వున్నాడు...

"హా... గణేశా..." అనేకేకా, దబ్బుమన్న చప్పుడు, విని వెనుదిరిగిన నాకు, నేలమీద కూలబడిన మా ఆవిడ కనిపించింది.

–డా॥ కె.శివ సుబ్బారావు

# ఎమర్జన్సీ అలారం!

ఆ కాలనీలో అన్నీ కొత్తగా కట్టిన ఇండిపెండెట్ హౌస్‌లే. ఫ్లాట్లు మచ్చుకైనా లేవు. నగరానికి దూరంగా ప్రశాంతమైన వాతావరణంలో, వాయు కాలుష్యం ఏమాత్రమూ లేనిచోట రిటైర్ అయిన ఉద్యోగులు, కారు సదుపాయం వున్నవారు వారివారి అభిరుచులకు తగినట్లు కట్టుకున్న ఇళ్ళు అవి. మెయిన్ రోడ్‌లు, క్రాస్ రోడ్‌లతో చాలా ప్లాన్డ్‌గా కాలనీని తీర్చిదిద్దారు.

అటువంటి సత్యమూర్తి కాలనీలో అంతా బాగానే ఉందిగాని, రాత్రిళ్ళు దొంగల భయం మొదలైంది. ఘూర్ఖాలని పెట్టినా, రాత్రి వంతులవారీగా కాలనీవాసులు గస్తీ తిరుగుతున్నా ఏదో ఒకరోజున ఏదో ఒక ఇంట్లో దొంగలు పడడం జరుగుతోంది. కాలనీలో పలుకుబడి గలవారు వుండడంతో 'పోలీసు ఔట్‌పోస్ట్' ఆ ప్రాంతంలో ఏర్పాటుచేశారు గానీ అందువలన దొంగల భయం కొంత తగ్గినా పూర్తిగా మాత్రం పోలేదు.

మధ్యాహ్నం పూట వీలయితే కలుసుకుని లేకపోతే ఫోన్ చేసుకుని ఆ కాలనీలోని గృహిణులు యోగక్షేమాలు, లేటెస్ట్ సినిమా



విశేషాలు, వారపత్రికలో సీరియల్ మలుపులు, తిరుపతిలో ధర పెరిగి సైజ్ తగ్గిన లడ్డూ కథ, పార్లమెంటులో ఫలితాల తారుమారు అలా ఎన్నో మాట్లాడుకుంటూ కాలక్షేపం చేయడం అలవాటు చేసుకున్నారు. వివిధ ఛానల్స్‌లో రోజుకిమూడు నాలుగు సినిమాలు రావడంవలన సినిమా థియేటర్లకు వెళ్ళడం పూర్తిగా మానేశారు.

ఈ వాతావరణంలో ఒక రోజున ఫోన్ 'డెడ్' అవడంతో పక్క క్రాస్ రోడ్‌లోని పార్వతమ్మ ఇంటికి వెళ్ళింది భాస్కరమ్మ. వారిద్దరికి పదిరోజుల క్రితం లెండింగ్ లైబ్రరీలో పరిచయం అయింది.

"క్రికెట్ మ్యాచ్ వలన అబ్బాయికి, అమ్మాయికి సెలవు ఇవ్వడంవలన ఇంట్లోనే వున్నారు. ఫోన్ కూడా డెడ్ అయింది. అందువల్లనే మీ ఇంటికి రాగలిగాను" అంది పార్వతమ్మతో భాస్కరమ్మ.

పార్వతమ్మ రస్నా ఇచ్చి మర్యాద చేసి "ఏమిటి విశేషాలు" అనడిగింది.

"అంతా బాగానే వుంది కాని రాత్రి దొంగలు పడతారనే భయం మటుకు పోవడంలేదు. కంటికి నిద్రపట్టడంలేదు. పట్టినా కలలోనూ దొంగల భయమే" అంది భాస్కరమ్మ.

"ఔను. అందరి పరిస్థితీ అలాగే వుంది. అయితే మాకు మటుకు మా ఆయన పుణ్యమా అని దొంగల భయంలేదు" అంది పార్వతమ్మ.

"ఎలా? మీ ఆయన పోలీసాఫీసరు కాదు గదా!" అంది కుతూహలంతో భాస్కరమ్మ.

"రాత్రి పన్నెండు దాకా ఆ ఛానల్, ఈ ఛానల్ లలో ప్రోగ్రామ్స్ చూస్తూ మేలుకునే వుంటారు. ఆ తర్వాతే పడుకుంటారు" అంది పార్వతమ్మ.

"ఒంటిగంట దాటాకా గదా దొంగలు బయల్దేరేది. మరి మీవారు నిద్రపోతే దొంగలకి అడ్డువుండదు గదా" అంది భాస్కరమ్మ.

"మా ఆయన పక్కమీద పడినవెంటనే ఎమర్జన్సీ అలారంలాగా గురక మొదలుపెట్టారు ఉదయం ఆరింటికి లేచేదాకా ఆ గురక ఆగదు" అంది పార్వతమ్మ.

—బోడపాటి కృష్ణవేణి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78